

చెన్నపట్టణము, ఆగస్టు ౧౯౩౧

సంపుటము ౮ ప్రజోత్పత్తి సంవత్సరము శ్రావణమాసము సంఖ్య ౮

# మబ్బులేనివర్షము

దివాకర్ల వేంకటావధానిగారు

[మాతృగుప్తుఁ డుజ్జయిని వదలిపోవ నెంచిన మఱునటినాఁటి వేకువ విక్రమార్కుఁ డాతనిఁ బిలిపించి లేఖ నొకదాని నిచ్చి దీనిని మధ్యేమార్గమునఁ జదువకుండఁ గొంపోయి కాశ్మీరామాత్యుల కప్పగింపుమనికోరెను. కవియూ నెటకేగుటకు నదివరకు నిశ్చయించుకొనకుండుటచే సంతసించి రాజాజ్ఞ నంగీకరించె. కాశ్మీరామాత్యు లాయుత్తరమును జూచుకొని మాతృగుప్తునకుఁ బట్టముఁ గట్టిరి.]

మూఁగవై పడియున్న మురజభేరీశంఖకాహళంబులు దెసల్గలయ మ్రోసె
రాజవీథి నిరంతరప్రజాపటలిచే నేల యీనిన యట్లు నిండియుండె
మొల్కనగవులతోడ ముత్తైదువలు కప్రపారతుల్ వెలిగించి రతులభక్తి
వందిమాగధుల కైవారంబు మిన్నంటె జయపాఠపఠనాతిసంభ్రమమున
మాతృగుప్తమహారాజమణి లభించె-మాయదృష్టంబుకతన ముమ్మాటి కనిరి
సింగపుంగద్దె యదియే వసింపుఁ డందు-మమ్ము మన్నింపుఁడని పల్కి- మంత్రివరులు.

ఈవిపరీతసంఘటన మేమి మతిభ్రమ గల్గి యిట్లు నా
కేవలవైదికప్రవరుఁ గిల్బిషసిద్ధదరిద్రదేవతా
పావనపాదసేవకునిఁ బార్థివుగాఁ దమిమీఱఁ గోరిరో
ధీవరులో సమాత్యకులదీపకు లింతయు స్వప్నదృశ్యమో?

కల యెల్లా? నిది విక్రమార్క-ధరణీకాంతప్రధానాజ్ఞకున్
ఫలమంచున్ వచియించినార లిఁక నాపై నింతకాలమ్ముఁ గే
వలమున్ లేని దయావిశేష మధికంబై యెట్టు లీనాఁటికిన్
గలుగన్ వచ్చె నగాధచిత్తులుగదా క్ష్మానాథు లత్యంతమున్?

ఇంకొకఁ డుండెనేమ్మొకో? అహీనగుణాఢ్యుఁడు మాత్యగుప్తనా
మాంకుఁడు నామొగంబునకె యబ్బిన దింతయదృష్ట మన్నదో
నింకను నమ్మకంబు జనియించుట లేద మనమ్మునందు తే
మంకరకాల మబ్బినది మాఱె నృపాలుని చిత్తవృత్తియున్.

నన్ను భూనాథుఁ జేయు మనమ్ము లేక-జాబు నాచేతి కాతఁ డొసంగు టేల?
చదువుచోఁ బాతకం బబ్బు సత్యమనియె-గుప్తదానప్రియుండౌట కొంత నిజము.

జలపూర్ణకుంభముల్ తలఁదాల్చి యెదురుగా వచ్చినా రిరువురు వనజముఖులు
వికసించుపూవుల వెలయుసౌరభముతో గంధవహుండు స్వాగతము నిచ్చె
శ్రవణపర్వంబుగా శారికాముఖవిహంగములు నుతించు గీతములు పాడె
సర్పఫణాకోటి దర్పంబుమై నిల్చి కాటుకపెట్ట యుత్కంఠఁ గొలిపె.
వలసి యొకచోట నిద్రించునట్టి సమయ-మందు నొకమేడ నెక్కుచు నబ్ధిదాఁటి
నట్లు కలఁగంటి శకునముల్ వ్యర్థమగునె-కాలము ఫలించె నాకు భాగ్యము లభించె.

నీసభాంతరమందున నిల్చుకొనుచు-భాగ్యము లొసఁగుట నృపాల, పాడిగాని
రాజ్యపాలనమందు మర్మము లెఱుఁగని-శుద్ధవైదికుమెడ చుట్టుఁ జుట్టఁ దగునె!

తనసౌఖ్యం బహిశత్రు భీతి శమనార్థం బావలం ద్రోయుచున్
దనకున్ బాన్పయియున్న శేషుఁగని దైత్యారాతి దుఃఖించి నా
తనభారంబును దెచ్చిపెట్టె భుజబంధంబందునన్ బూను మీ
వనయంబున్ ధరణీభరం బనుచు, నన్యాయంబనన్ జెల్లునే?

ఉరుములును లేవు, లేదు విద్యుత్తుగూడఁ-గానరాదయ్యె మేఘ మాకాశమందు
విపులమై వర్షమెంతయు వెల్లివిరిసె-ధరణిపాలక, నీవే వదాన్యుఁడ వన!

ఎంతోమంది కవీంద్రులున్ బుధులు భూమీశాన, నీయీవికిన్
స్వాంతంబం దలరారి యాశిష మొనర్పన్ వృద్ధిచే మించి య
శ్రాంతంబున్ నిరపాయమై యలరు నీసామ్రాజ్యసంపత్తి క
ల్పాంతస్థాయిగ నీయశోగరిమ నిల్వన్ నేను దీవించెదన్.

---

# నంది (ముక్కు) తిమ్మకవిని గుఱించి

కొణిదెన బాలకృష్ణయ్య గారు

ఆంధ్రకవుల చరిత్రయందు "సాధారణముగా ముక్కుతిమ్మన్న యనఁబడెడు నందితిమ్మన్నకవి యీ మల్లయకవికి మనుమఁడని చెప్పుదురు" అని నందిమల్లయ్య ఘంట సింగయ్యలను గూర్చి వ్రాయుచోటను

"ఈకవి (నంది తిమ్మన్న) వరాహపురాణాదిగ్రంథములను రచించి ప్రఖ్యాతి కెక్కిన మలయమారుతకవికి మేనల్లుఁడు" అని నంది తిమ్మనచరిత్రమునందును — కీ॥ శే॥ వీరేశలింగముపంతులుగారు సూచించి యున్నారు.

కవిజీవితములయందుఁ ప్రబోధచంద్రోదయపారిజాతాపహరణములయందలి సీసపద్యముల నాధారములుగఁ జర్చించి,

"ఈ పద్యములఁబట్టి చూడఁగా ముక్కు తిమ్మనకు మల్లయకవి సవతితమ్ముండనియు, సింగనకవి సవతిమేనల్లుం డనియును దేలినది. ఈసింగనకవికి మలయమారుతాభిధాన ముండుటంబట్టి యితఁడు తిమ్మకవికి మేనమామ యగు మలయమారుతకవికిఁ గుమారుని కుమారుఁడుగా నూహింపనై యున్నది" అని యొకచోటను

"నందిమల్లయకవికి ముక్కు తిమ్మన మనుమఁడనికాని, యిందులోఁ జెప్పఁబడిన మలయమారుతకవియు, తిమ్మకవి మేనమామ యగు మలయమారుతకవియు నొక్కఁడే యని కాని చూపుటకు గ్రంథదృష్టాంతములు లేవు. అట్టి ప్రతీతియైనను వ్యాపకములో లేదు" అని యింకొకచోటను

గురుజాడ శ్రీ రామమూర్తి పంతులు గారు వ్రాసి యున్నారు.

చరిత్రకారు లిరువుర యభిప్రాయములును భిన్నములుగ నున్నవి. లోకమున నున్న వాడుక ననుసరించి కవులచరిత్రయందును, గ్రంథస్థపద్యములనుబట్టి కవిజీవితములయందును నట్లు వెల్లడింపఁబడి యున్నది. ఎంత వెదకినను నిప్పటిదనుకఁ బారిజాతాపహరణమున నొకటి, ప్రబోధచంద్రోదయమున నొకటి సీసపద్యములుదక్క వీరి బాంధవ్యము నెఱింగించు దృష్టాంత మింకొకటి లభింపలేదు. ఆపద్యముల సీక్రింద నుదాహరించి వాటి యాధారమున నే పైఁజెప్పిన చరిత్రకారు లిరువురలో నెవరి నిర్ణయము సత్యదూరముగాక, లోకసహజముగ వరుసక్రమమునకు సూటిగ నున్నదో విమర్శింతము :—

పారిజాతాపహరణమునందలి పంచమాశ్వాసము చివరనున్న సీసపద్యమందుఁ దిమ్మన తన చరిత్ర మెుకించుక వివరించెను.

"కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేల పవిత్రకులుఁడు
నంది సింగామాత్యునకును దిమ్మాంబకు
దనయుండు సకలవిద్యావివేక

చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
నల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయా
నమహాగ్రహార సన్మానయుతుఁడు
తిమ్మయార్యుండు శివపరార్ధీనమతి య
ఘోరశివగురు శిష్యుండు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె సంగ్రభావ
నాదివాకరతారాసుధాకరముగ."

దీనివలనఁ దిమ్మకవితండ్రి సింగామాత్యుఁడు, తల్లి తిమ్మాంబ, మేనమామ మలయమారుతకవి అని తెలియుచున్నది.

నందిమల్లయ, ఘంటసింగయ (మలయమారుతకవి) విరచిత ప్రబోధచంద్రోదయము నందు వారి చరిత్రమును దెలుపు సీసపద్యము:

"కలఁడు కౌశికగోత్రకలశాంబురాశిమం
దారంబు సంగీత నంది నంది
సింగమంత్రికిఁబుణ్య శీల పోతమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయ మనీషి
అతని మేనల్లుఁ డంచిత భరద్వాజ గో
త్రారామచైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యమ్మలాం
బకుఁ గూర్మితనయుండు మలయమారు
తాహ్వయుఁడు సింగనార్యుండు నమృతవాక్య
తీశ్వరారాధకులు శాంతు లిలఁ బ్రసిద్ధ
లుభయభాషల నేర్పరు లుపమ రస ప
మర్థు లీకృతిరాజనిర్మాణమునకు."

నందిమల్లయతండ్రి సింగమంత్రి, తల్లి పోతమ్మ, మేనల్లుఁడు మలయమారుతుఁడు, అని దీనఁ దెలియవచ్చినది.

రెండు గ్రంథములయందలి పద్యములలోను మలయమారుతకవి చుట్టరికము ముడివైవఁబడియున్నది. ఈ మలయమారుతుని సంబంధమే మల్లయతిమ్మనల వరుస దెలిసికొన నుపకరించునని తోఁచుచున్నది.

పై పద్యములయందలి క్రమమును నిర్ధారణచేయుటకు శ్రీరామమూర్తిగారు క్రిందఁ జూపిన వంశవృక్షమును గల్పించినారు:—




దీనినిబట్టి నందిసింగన్న కిరువురు భార్యలు. మలమారుతాభిధానులగు కవు లిద్దఱు గానవచ్చుచున్నారు. ఘంటసింగయకు "మలయమారుతకవి" యనునది బిరుదనామము. సింగయతాతకుఁగూడ నట్టి విశేషణముగాని పేరుగాని యుండుననుటయు, దానినిబట్టియే యాతనికి "మలయమారుతుఁ"డను పేరు వచ్చెనని యుఁ జెప్పుట పాడిగాదు. తాతపేరు మనుమనికి రావచ్చును. కాని యాతఁడు తాతవలెనే కవిగను, లేక బిరుదనామము ధరించినవాఁడుగను నుండుట సాధారణముగఁ బొసఁగదు. మఱియు నీసింగయకు మలయమారుతుఁ డను

నది. బిరుదుపేరుగఁ బ్రవర్తిల్లుచుండ నాబిరుదు పే రాతని తాతపే రనుట చెల్లుబడి కాని మాట. వాదోపయోగముకొఱకు సింగయ తాత మలయమారుతుఁడనియే తలంతము. అయిన నాతఁడు "మలయమారుతకవీంద్రునకు మేనల్లుండ"నని తిమ్మనవంటి మహాకవిచే సంస్తుతింపఁ దగిన కవితామహిమమహితుఁడై యుండవలెఁగదా; అట్టి యవకాశ మేమియు లభింపలేదు. తెలియవచ్చినవాఁ డొక మలయ మారుతకవీంద్రుఁడే. అతఁడు సుప్రసిద్ధకవియై యుండినట్లు లాతనికృతులు ప్రబలప్రమాణము లుగనున్నవి. నిజమునకు మలయమారుతుఁ డిం కొకఁ డుండెఁ, యతఁడు ప్రసిద్ధకవీశ్వరుఁడై యున్నయెడ, విశేషించి తనకుఁ బితామహుఁడైయుండిన రెండవమలయమారుతుఁ డేల నాతని స్మరించియుండఁడు? మేనల్లుని పొగడ్తకుఁ బాత్రుఁడైనవాఁడు పౌత్రుని కొండాటకుఁ దగనివాఁ డయ్యెనా? శ్రీరామమూర్తి పంతులుగారి నిర్ణయ మివ్విషయమున ససహజ పద్ధతి ననుసరించియున్నదని తోఁచుచున్నది.




కవిజీవితములయందలి బంధుత్వక్రమము నటు లుంచి పయివంశవృక్షమున నింకొక పద్ధతిని మలయమారుతకవీశ్వరుని సంబంధముతో నిర్ణయింపఁబడినది.

నంది సింగమంత్రి తనయుఁడు మల్లయ దనకు మేనమామయని మలయమారుతకవి చెప్పుటవలనను, మలయమారుతకవీంద్రునకు మేనల్లుండనని తిమ్మన వ్రాసియుండుటచేతను, మల్లయకు మేనల్లుఁడు, తిమ్మనకు మేనమామయు నగు మలయమారుతాభిధానుఁ డొక్కఁడని నిశ్చయించుట పొరబాటుకాదని చెప్పవచ్చును. నంది మల్లయ తనసోదరి పుత్రిక (మేనగోడలు) తిమ్మాంబను దన తనయుఁడు సింగనకుఁ బరిణయము గావించియుండునని తిమ్మన తాను మలయమారుతుని మేనల్లుఁడ ననుటలో స్పష్టపడుచున్నది. అట్టి పరిణయము స్వభావవిరుద్ధము గాదు.

కావున తిమ్మకవి వరాహపురాణాది గ్రంథకర్తలగు నంది మల్లయకు మనుమఁడు, మలయమారుతకవీంద్రునకు మేనల్లుఁడు నని పైన వివరింపఁబడిన క్రమమునుబట్టి సులభముగ నిశ్చయింపవచ్చుననియును, ఒకనికి సవతి అన్నయనియు, నింకొకని పితామహునకు మేనయల్లుఁడనియుఁ జెప్పుట విరుద్ధమును సత్యదూరము ననియు నిర్ధారణయగుచు వీరేశలింగము పంతులుగారి యభిప్రాయమే నిజముగ నుండుననుట కవకాశ మేర్పడుచున్నది. తాతపేరు మనుమని కుంచుట వాడుకలో

నున్నది. కావుననే తిమ్మనతండ్రికిఁ బితామహుఁడగుటను, ఘంటసింగయకు (మలయమారుతునకు) మాతామహుఁడగుటను నాయిరువురకు సింగననామమే పెట్టఁబడియుండవచ్చును. తిమ్మనయంతేటి కవి తనకు సవతియన్నగ నుండ మల్లనఁ దనకృతియందుఁ బేర్కొనకుండునా? లేకఁ దిమ్మనయే తమ్ముఁడైన-చో నన్నయగు మల్లనను గూర్చి తన గ్రంథమునఁ జెప్పఁడా? మేనమామను జెప్పి తన యన్నను విడచునా? సమకాలికులగు జంటకవులలో నొకని పెద్దతనమును గొనియాడి రెండవవానినిఁ దలఁపకుండుట యొప్పదని తిమ్మనార్యుఁ డెఱుంగఁడా? మల్లన తిమ్మన లిద్దరు దమతండ్రి సింగమంత్రి యనుటచే సవతితల్లి పిల్లలనియు, సింగన కిద్దఱు భార్యలనియు శ్రీరామమూర్తిగారి యభిప్రాయము. ఒకపక్షమున నీయన్నదమ్ములు సవతితల్లులకు జనించిన కారణమున లోకసహజమగు నసూయచే నొండొరుఁ దమ కావ్యములఁ జెప్పికొనుట కిచ్ఛగింపక మానినై చియుండురని తలంతము. శ్రీరామమూర్తిగారి సిద్ధాంతము సరియైనదని నమ్మెదము. కాని దీని కింకొక బాధక మున్నది గదా? ఇద్దరికిని దండ్రి యొకఁడుగ నుండుట నన్నదమ్ములని విశ్వసించినంత సులభముగ "మలయమారుతుని తండ్రి తండ్రికి మేనల్లుఁడు తిమ్మన" యనుమాట విశ్వసింప నవకాశము లేదు. ఈ రెండవ మలయమారుత కల్పనము గగనకుసుమమువంటిదని స్పష్టముగఁ జెప్పవచ్చును. తాతకు మేనల్లుఁడు, మనుమనికి మేనమామ, యగు మలయమారుతుని వల్లనే యీసంశయము సులభముగ నివారణయగుచున్నది. ఇందునుగురించి శ్రీరామమూర్తిపంతులుగా రెన్నియో చారిత్రకవిషయములఁ బెంచి చర్చించి వ్రాసినను వారి సిద్ధాంతముమాత్రము భ్రమాస్పదమై యున్నట్లు వా రాధారముగఁ గొన్న పద్యద్వితయమువల్లనే వెల్లడియగుచున్నదని చెప్పవచ్చును. ఇందువలన నందిసింగన కిద్దరు భార్యలుగాని, మలయమారుతాభిధానకవిశ్వరు లిద్దరుగాని లేరనియు, నందిమల్లయకుఁ దిమ్మన మనుమఁడనియు, మలయమారుతకవికి మేనల్లుఁడనియు నిశ్చయింప నవకాశ మేర్పడినది.

ఇంకొక సంశయము గలదు. "పితామహుఁ డంతటికవియై యుండినఁ దిమ్మన తన కావ్యమున నాతని స్మరింపలేదేమి?" అని. మల్లయ-సింగనలలో సింగనయే విశేషపాండితీ ధురంధరుఁడై యుండినట్టు లాతని మలయమారుతకవీంద్రాంకితమే చాటుచున్నయది. మేనల్లునివలననే మల్లయపేరు వెల్లడియైయుండును. మేనల్లునియొక్క మేధాసంపదయెదుట మల్లయకవి ప్రతిభ చెప్పఁదగినంత విశేషముతోఁ గూడనిదై యుండవచ్చును. ఇదియుఁగాక నిజమునకు మల్లనకుఁ గవితాశక్తి యెంతదనుకఁ గలదో సంశయింపఁదగియున్నది. ఏలనన వీరిగ్రంథములు రెండు గలవు. రెండును మామయు నల్లుఁడును గలసి రచించినవే. మేనల్లునికంటెఁ బెద్దయగు మేనమామ తా

సంతకుముందుదన పేరుతోఁ స్వయముగ రచించిన గ్రంథ మొక్కటియుఁ గన్పట్టదు. మేనల్లుఁడు పెద్దవాఁడై, చదివి, పాండితిగడించి కవితాధురంధరుఁడై తనతోఁ గలసి గ్రంథరచన మొనర్చుటకు వచ్చునంతదనుక నేల నిరీక్షించుచుండ వలసివచ్చెనో తెలియరాదు. దీనినిఁబట్టి మల్లన కొకించుక కవితాశక్తి యున్నను స్వయముగ గ్రంథరచనఁ జేయుపాటవము లేమికి నాతఁడు మేనల్లునితోఁ గలసి పేరు ప్రకటించుకొన వలసి వచ్చెననియు, పెద్దవాఁడను గౌరవముచే మేనమామకుఁ గీర్తి సంపాదించుతలంపున సింగన మల్లన యిచ్చచొప్పున జంట కవియగుట సంభవించెననియు నూహింప వచ్చును. లేనియెడ నాకాలమునఁగాని యంతకుఁ బూర్వముగాని యాంధ్రకవులయందుఁ గనరాని జంటకవులపద్ధతి వీరికిఁ గలుగఁగారణ ముండదు. మఱియు మల్లనకు "సంగీతనంది" యని యొకవిశేషణము వారిపద్యమునఁ గలదు. దీనినిబట్టి యాకాలమునమల్లన సంగీతముచే రాజసముఖమునఁ గొంతపరిచయము సంపాదించి యచట నివసించి యుండి మేనల్లునిఁ దనయొద్దకుఁ బిలిపించుకొని యాతనిఁ (మలయమారుతుని) బ్రయోజకునిఁ గావించియుండుననియు, తన నంతవానిఁగా నొనర్చిన మేనమామయెడ విధేయుఁడై సింగయ, మల్లనకుఁ గీర్తిప్రతిష్ఠలు సమార్జించు తలంపున సాధారణపాండితిగల మేనమామతో జంటకవియై కావ్యరచన మొనర్చెననియుఁ దలంప నవకాశము గలదు. ఇది నిజమైనను కాకున్నను, ఆకాలమున మలయమారుత కవీంద్రుని ప్రజ్ఞావైభవము విశేషించి పండిత జనశ్లాఘాపాత్రమై వ్యాప్తిఁగాంచి యుండ వచ్చును. మల్లన మేనల్లునివలెఁ బేరుగాంచనివాఁడై యుండును. కాఁబట్టి తిమ్మనార్యుఁడసాధారణమనీషావిశేషాంచితుఁడగు మేనమామను స్మరించి యాతనిమూలమునఁ గవి యను పేరుగాంచినవాఁడు గాన తాతయగు మల్లన నుజ్జగించియుండును. సామాన్యుఁడగు దనతాతను గొప్పకవిగాఁ జెప్పకున్నచో సమకాలికులు యథార్థ మెఱుంగుదురు గాన లేని గొప్పతనము తనతాతకుఁగూర్పక యుచితజ్ఞుఁడగు తిమ్మన మిన్నకుండెను. కావునఁ బారిజాతాపహరణమున మల్లయపే రుండమికిఁ గారణ మీపైన వివరింపఁబడినవాటిలో నేదియేనిఁ గావచ్చును. ఈ కారణము మల్లయ తిమ్మనల తాతమనుమలవరుసను బాధింపఁ జాలదు.

---

వేంకటకాళిదాస కవులు (ఆం. గీ. సా. పరిషత్తు)

## వెనుకచూపు

ఈమృదుశయ్యమీఁదనె శయించితి వోలలితాంగి, నీఘన
శ్యామలకుంతలంబులకుఁ జంద్రికలై వికసించినట్టి మ
ల్లీమసృణప్రసూనముల రేకులువాడిన తీయవాసనల్
నామది నావరించినవి నాఁటికి నేఁటికి నొక్కరీతిగా.

నిదురనొ రెప్పమూఁతపడు నీ నయనమ్ముల మూగయందముల్,
హృదయపరిభ్రమానుగతలీలనొ నీనునుమోవి నల్లన

ల్లఁదనపు నవ్వుసొంపులు; పరస్పరభిన్నత లభ్యసించు నీ
వదనము నా మనఃపదముఁ బాయదు నెమ్మొగమున్మనోహరీ!

పరిచితముల్ చిరప్రణయభావమనోజ్ఞము లైన మత్పద
స్వరములు సోఁకఁ దత్తరిలి చక్షువు లెత్తుచు నీవు నన్ విక
స్వరగతిఁ గాంచుచో, విసరఁ బారిన మల్లియపూలవెంబడిన్
బరువిడెనో కదా భ్రమరపంక్తులె చాలఁగ నానతాననా!

ఎత్తిన నెమ్మొగమ్మున బహిర్గతమౌ మెడసొంపు, మోవి రే
కెత్తిన మందహాసమున నేర్పడు చెక్కులసోయగమ్ము, క
న్నెత్తిన ముగ్గచూపున రచించిన బొమ్మల విభ్రమమ్ము, నా
చిత్తము హత్తుకొన్న వెడసెందని గాటపుఁ గూర్మి నెచ్చెలీ!

ఈమెడఁ బాటు చీఁకటులనే తలఁపించిన నీదు వేణికా
చ్ఛాయలలోనో, యీవిరహసంభృతరాగమె జ్ఞప్తిసేయు నీ
చేయి మెరుంగు లోననో, కృశిల్లిన మల్లియ నన్నుఁ గొట్టి తే
మో, యపరాధశిక్షయొ, వియోగతపస్వికిఁ బ్రేమభిక్షయో.

నేలకు వాలికల్ గొనిన నీ కనుసీకలలో, భుజమ్ముపై
వ్రాలిన నీమెడన్ మెరుఁగువారిన సొంపులలోఁ, గపోలపా
ళీలవవిస్తృతమ్ములగు లేనవుచాయలలో, నెహోసుధా
శాలలె నామెడందకుఁ బ్రసన్నమతీ, వసియింపఁ గోటులై!

నీకనురెప్పయంచునకు నీటుగ దిద్దిన యంజనమ్ము తా
రాకమనీయనీలమణులన్ బ్రభవించిన యంశురేఖ యే
మో, కడలేని దుర్భరవియోగతమస్సుదాయ మీమెడన్
సోఁకఁగఁ జేయునో మలినశోభల చెల్మికతంబునన్ సఖీ!

తెలియఁగరాని పూవుటెదఁ దీయని ప్రేమమయమ్ము లౌతలం
పులుగొని కేలనూదిన కపోలమొ, నీదు భుజద్వయమ్మునన్
గళమున వ్యాప్తమౌ కబరికాభరమో, యెదురానలేని నీ
వలితి విలోకనమ్మొ తలపించెద విష్ణు వియోగశాలినీ!

నీమెడ దొంగిలించి యవినీతికిఁ బాల్పడినట్టి నాకు నీ
వీమెడ నేమిశిక్ష విధియింతువొ? శాశ్వత తావకీన బా
హాయుగశృంఖలార్పణమె యర్హమొ, నీ నిశితేక్షణావళీ
సాయకఘాతకల్పనమె చాలునొ నవ్యవయోవిలాసినీ!

---

# తెలుఁగులిపియుఁ దత్సంస్కారణమును

యం. యస్. వెంకయ్య గారు

తెలుఁగు లిపిసంస్కరణవిషయమై యీవఱ కెందఱో మహాశయులు వ్యాసములు వ్రాసి పత్రికాముఖమునఁ బ్రకటించియున్నారు. అట్టి లిపిసంస్కరణప్రియులలో నేనొక్కఁడనుగాన, నాకుఁ దోఁచిన వాటిని కొన్నింటి నిటఁ దేటపఱచెద.

ఈలిపియందు లోపము లున్నవని పలువురిచేఁ దలంపఁబడుటకుఁ గలకారణములఁ గొన్నింటి నీక్రింద నిచ్చుచున్నాఁడ:—

౧. రోమకాక్షరములవలె స్వరవర్ణములను, వ్యంజనవర్ణములను విడివిడిగా నొకదానిప్రక్క నొకటిగా వ్రాయుపద్ధతి లేకపోవుట.

౨. ఒత్తులనెడి ప్రత్యేకచిహ్నములను హల్లులతోఁ గలిపి సంయుక్తాక్షరములని వ్రాయుట.

౩. సంయుక్తాక్షరము లుచ్చారణానుసారము గాక యక్రమపద్ధతిని వ్రాయఁబడుట.

౪. వర్ణమాలయం దధికసంఖ్యాకము లగు నక్షరము లుండుట.

౫. ఆంగ్లేయాద్యన్యభాషావర్ణమాలలయందలి యపూర్వవర్ణములు కొన్ని యిందు లేకపోవుట.

౬. ఇతరస్వరముల రూపాంతరములను వ్యంజనాక్షరములతోఁ గలిపి వ్రాయునపుడు సైతము అకారరూపాంతరమును తలకట్టు చేర్చి వ్రాయఁబడుట.

౭. సవర్ణములగు వ్యంజనాక్షరముల యాకారము లొక్కపోలికగా నుండకపోవుట.

౮. ముద్రాక్షరమంజూష (Type Case) యందలి యక్షరములు దాదాపు ౯౦౦ కు పైననే యుండుట వలన ముద్రాక్షరసంయోజకుల (Compositors) కు మిక్కిలి శ్రమము గల్గుట.

౯. ముద్రాక్షరవిలేఖనయంత్రము (Typewriter) లినోటైపు(Linotype), మొనోటైపు (Monotype) మున్నగు యంత్రములను నిర్మించుట కనుకూలింపకపోవుట.

ఈకారణముల నిఁక యథాక్రమముగా విమర్శించి చూతము.

మనభాషయందు స్వరవర్ణములు వ్యంజనవర్ణములతోఁ గలియునప్పుడును, వ్యంజనవర్ణములు వ్యంజనవర్ణములతోఁ గలియునప్పుడును, వాటికిఁ గల రూపాంతరములను వ్యంజనవర్ణములతోఁ గలిపి వ్రాయుట యొకపద్ధతియైయున్నది. ఇట్లు కలిపి వ్రాయుట మన తెలుఁగుభాషయందుమాత్రమే గాక మనదేశమునందుఁ గల యన్ని భాషలలోను నాచారమైయున్నది. మనపూర్వు లొకవేళ వెఱ్ఱిలోఁబడి యిట్టిపద్ధతిని దెచ్చిపెట్టి యుండవచ్చునని మనమనుకొనిన ననుకొనవచ్చును గాని, దేశమందలి యన్నిభాషలవారికిని ఇట్టివెఱ్ఱి పట్టినదని చెప్పుటకు వీలుపడదుగదా? కావున, నిట్లు కలిపి వ్రాయుట కేదేని యొక ప్రధానకారణ ముండవలయును. దాని నారయుదము.

మనభాషయం దక్షరమనునది ఆంగ్లేయుల *సిల్లబిలుకు (Syllable) సరిపోవుచున్న దని చెప్పవలసియున్నది. ఎట్లనిన:— ఉదాహరణముగాఁ బెద్దబాలశిక్షయందలి కొన్ని పదములను దీసికొని పరీక్షించి చూతము. రెండక్షరముల పేళ్లక్రింద అక్క, కీర్తి, గుడి, భ్రమ, పెండ్లి, వృద్ధి ఇత్యాదులు వ్రాయఁబడియున్నవి. మూఁడక్షరముల పేళ్ళక్రింద అన్నము, ఆకులు, ఒబ్బట్లు, ఓర్పరి, చంద్రుఁడు, గొంగడి, ఘృతము - అను నిత్యాదులును, నాల్గక్షరముల పేళ్ళక్రింద అగసాలి, ఉదరము, ఏకాంతము, ఒడ్డాణము, జొన్నపాలు, పిన్నతల్లి, చుక్క

* సిల్లబిలు అను నాంగ్లశబ్దమునకు సరియైన తెలుఁగుపదము గానరానందున నిందంతటను సిల్లబిలు అనియే వాడియున్నాఁడను.

బొట్టు, సిద్ధాంతము-ఇత్యాదులును వ్రాయఁబడియున్నవి. అక్క అను రెండక్షరములపదమున అ అనున దొకయక్షరముగను, క్క అనున దొకయక్షరముగను దీసికొనినట్టులు తెలియుచున్నది. అట్లుగాక, ఆంగ్లేయుల పద్ధతిచొప్పున అ+క్+క్+అ అని అచ్చులను హల్లులను విడివిడిగా వ్రాసినచో నాల్గక్షరములపద మనవలసివచ్చును. అన్నము-అను మూఁడక్షరములపదమున అ-అనున దొక యక్షరముగను, న్న-అనున దొకయక్షరముగను, ము - అనున దొక యక్షరముగను గ్రహింపఁబడియున్నట్టుల తెలియుచున్నది. అట్లుగాక, అ+న్+న్+అ+మ్+ఉ - అని వ్రాసినచో ఆఱక్షరముల పదమగును. ఇటులనే అగసాలి యను నాల్గక్షరములపదము ఏడక్షరముల పదముగను, భ్రమ—యను రెండక్షరములపద మైదక్షరములపదముగను, పెండ్లి యనునది ఆఱక్షరములపదముగను, ఒబ్బట్లు ఏడక్షరములపదముగను, జొన్నపాలు - తొమ్మిదక్షరముల పదముగను, చుక్కబొట్టు పదియక్షరముల పదముగను బరిగణిల్లును. ఇట్లచ్చులును హల్లులును విడివిడిగా వ్రాయఁబడక, అచ్చులరూపాంతరములును, ఒత్తులును గలిపి వ్రాయఁబడియుండుట నాలోచింపఁగాఁ బ్రతి పిల్లబిలును ఒక ప్రత్యేకాక్షరముగాఁ బరిగణింపఁబడినట్టులును, వర్ణములసంఖ్య పెరిగిపోక సంగ్రహించి వ్రాయుట కనుకూలముగా నుండునట్టు లీసంయుక్తాక్షర లేఖనపద్ధతి ప్రవేశపెట్టఁబడి యుండునట్టులును దెలియవచ్చుచున్నది.

బాలశిక్షయందలి పదము లొక ప్రమాణములా యనిన, నానార్థరత్నమాల యను సంస్కృతనిఘంటువు నుండి కొన్ని పదములను దీసి పరీక్షించి చూతము.

“గం గీతే గాతు గాథాయాం గోగంధర్వ గణేశయోః” అను నీయేకాక్షరకాండశ్లోకమునందు గ - గా - గో - అను శబ్దములలో నొక్కొక్కటియు నొక ప్రత్యేకాక్షరముగా గ్రహింపఁబడినట్టులు తెలియుచున్నది.

“వీణా లటిచ్చ ఘోణాతు నాసికా రథకర్ణికా” అను నీశ్లోకమున వీణాఘోణాశబ్దములు ద్వ్యక్షరయుత పదములుగాఁ బఠింపఁబడియున్నవి.

“పినాకో౽స్త్రీ పాంసువర్షే త్రిశూలే శివధన్వని,
ప్రతీక స్స్యాదవయవే ప్రతికూలే త్వయం త్రిషు.
వల్మీకో౽స్త్రీ రోగభేదే ప్యనీకో౽స్త్రీ రణే బలే.”

అను నీశ్లోకమున పినాక-ప్రతీక-వల్మీక-అనీక- శబ్దములు త్ర్యక్షరయుతపదములుగాఁ బఠింపఁబడి యున్నవి.

“క్రియాసమభిహార స్స్యాత్ పౌనఃపున్య భృశార్థయోః.” అను నీశ్లోకమున ‘క్రియాసమభిహారః’ అను శబ్దము సప్తాక్షరపదము క్రిందఁ బఠింపఁబడియున్నది. పైఁగనిన శబ్దములయందలి యక్షరములనుగమనించి చూచితిమేని, ప్రతిపిల్లబిలు నొక ప్రత్యేకాక్షరముగా గ్రహింపఁబడి యున్నట్టులు వ్యక్తము గాఁగలదు. ‘క్రియాసమభిహారః’ అను పదమును ఆంగ్లభాషా లేఖన పద్ధతి ననుసరించి క్+ర్+ఇ+య్+ఆ+స్+అ+మ్+అ+భ్+ఇ+హ్+ఆ+ర్+అ+ః - KRIYASAMABHIHARAH అని వ్రాయుదుమేని పదునాఱక్షరముల శబ్దమని చెప్పవలసియుండును. శబ్దముగూడ వ్రాఁతయందుఁజాలదీర్ఘముగాఁ గన్పట్టును.

ఇదియుఁ బ్రమాణము గాదనిన, శ్రీమద్వాల్మీకి మహర్షి వదనవినిర్గతమగు

“మా నిషాద ప్రతిష్ఠాం త్వ
మగమ శ్శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచమిథునా దేక
మవధీః కామమోహితమ్.”

అనుశ్లోకమును దీసికొందము. ఇయ్యది అనుష్టుప్ శ్లోకము. ఇందు ప్రతిపాదమునకును ఎనిమిదియక్షరముల చొప్పున ముప్పదిరెండక్షరము లున్నయవి. ఇందులకుఁ బ్రమాణముగా నామహర్షి యే

“పాదబద్ధో౽క్షరసమ
స్తంత్రీలయసమన్వితః,
శోకార్తస్య ప్రవృత్తో మే
శ్లోకో భవతు నాన్యథా.”

అని వచించియున్నాఁడు. ఈశ్లోకమునకు గోవిందరాజ వ్యాఖ్యయందు “పాదబద్ధః చతుర్భిః పాదైర్యుక్తః.

అక్షరసమః ప్రతిపాదం సమాక్షరః" అనియు, తనిశ్లోకి వ్యాఖ్యయందు "అక్షరైః ప్రతిపాద మష్టభి రక్షరైః సమః. తేన వర్ణాధిక్యాదిదోషరాహిత్యం వ్యంజితం" అని యును వ్యాఖ్యానము చేయఁబడి యున్నది. దీనినిఁబట్టి చూచినచోఁ బైఁగనిన "మానిషాద" యను శ్లోకము నందలి

"మా-ని-షా-ద-ప్ర-తి-ష్ఠాం-త్వ
మ-గ-మ-శ్శా-శ్వ-తీ-స్స-మాః,
య-త్క్రౌం-చ-మి-థు-నా-దే-క-
మ-వ-ధీః-కా-మ-మో-హి-త-మ్."

అను ప్రతిసిల్లబిలు నొక ప్రత్యేకాక్షరముగా గ్రహింపఁబడి యున్నట్టులు స్పష్టమగుచున్నది. దీనినే ఆంగ్లేయుల పద్ధతిచొప్పున అచ్చులను హల్లులను విడివిడిగా నొకటి ప్రక్కన నొకటిగా వ్రాసినచో అలువదినాల్గక్షరము లగు, గొన్ని సమయముల నింక నధికము నగును. పైశ్లోకమునే రోమకాక్షరములతో నీక్రింద వ్రాసి చూపెట్టెదము:—

"Ma nishada pratishtham tva
Magama ssavatissamah,
Yatkrounchamidhunadeka
Mavadhih kamamohitam."

ఈపద్ధతిని వ్రాసినచో "ప్రతిపాదం సమాక్షరః" "ప్రతిపాదం అష్టభిరక్షరైః సమః" అను నియమమునకు వ్యతిరేకముగ 23, 20, 22, 19 అక్షరములగును; అనఁగా పాదమున కిన్ని యక్షరములని నిర్ధారణచేసి చెప్పుటకు సాధ్యము గాకుండును. అప్పుడు వర్ణాధిక్యాదిదోషములు తప్పక కల్గును. కాని, ముప్పదిరెం డక్షరములకు మారుగా "అనుష్టుప్ శ్లోకమునకు ముప్పదిరెండు సిల్లబిల్లు అని చెప్పికొనిన సరిపోదా? అప్పుడు ప్రతిపాదమునకు నెనిమిదిసిల్లబిల్లుండునని నిష్కర్షగాఁ జెప్పుటకు వీలుగనుండునుగదా?" అనిన, ఆపద్ధతిని వ్రాయుటగాని చదువుటగాని చాలకష్టము. హల్వర్ణముతోఁగూడిన ప్రతిసిల్లబిలుకును అధమపక్షము రెండక్షరము లుండితీరవలయును. అట్టులొక యనుష్టుప్ శ్లోకమును వ్రాయుట కెంత లేదన్నను అలువదినాల్గక్షరములు వ్రాసి తీరవలయును. అనఁగా రెండనుష్టుప్ శ్లోకములకు సరిపోవునన్ని యక్షరము లొక్క యనుష్టుప్ శ్లోకమునకు వ్రాయవలసియుండును. వ్రాయువానికిని జదువువానికిని తప్పక విసుగుపుట్టును. పైనిఁ దెలుఁగక్షరములతోడను, రోమకాక్షరములతోడను ముద్రింపఁబడిన "మా నిషాద" యనుశ్లోకమును జూచిన, చదువుటకును వ్రాయుటకును అనుకూలమగుపద్ధతి యేది యనుట తెల్లమగును. త్రిలింగభాషాక్షరముద్రితశ్లోకమునకన్నను, రోమకాక్షరముద్రితశ్లోక మెంత పొడవుగాఁ బెరిగిపోయినదో చూడనగును. ఇవన్నియుఁ బర్యాలోచించి చూడఁగా, అచ్చులను హల్లులను విడివిడిగా ప్రక్కనప్రక్కన నుండునట్టులు వ్రాయుపద్ధతి మన భాషాస్వభావమున కెంతయు విరుద్ధముగా నున్నదనియే చెప్పవలసియున్నది. మఱియు, నీరోమకాక్షరపద్ధతి మన తెలుఁగు ఛందశ్శాస్త్రమునకును విరుద్ధముగా నున్నది. ఉదాహరణము:

మహాస్రగ్ధరావృత్తము

"అని దిగ్వేదండశుండా-యతపృథుల భుజో-దగ్ర దం
భోళి కేలన్, గొని రోధోమండలిన్ మి-న్గానదులు
గుములుగా - గుప్పసారించి యుద్య, ద్ఘనశిక్తిన్
ద్రిప్పఁ గొండల్-గడగడవడఁకం-గల్పవిభ్రాంతివేళా,
జనితామర్షోగ్రకాలస్మరహరు క్రియనాస్థాని దిగ్గంచు
లేపన్."

అను నీపద్యమునఁ బ్రతిపాదమందును స-త-త-న స-ర-ర-గ- అనుగణము లున్నందునఁ బాదపాదమునకును ఇరువది రెండక్షరము లుండితీరవలయునన్న నియమ మేర్పడియున్నది. ప్రతిపాదమునందును 9-వ, 16 వ యక్షరములు యతిస్థానములని చెప్పఁబడి యున్నది. ఈ యతుల నించుక గమనింతము.

ఈపద్యమందలి చతుర్థపాదాద్యక్షరము జ-కారము. దీనికిఁ దొమ్మిదవదియగు స్మ-అనునక్షరమును, పదునాఱవదియగు స్థా-యనునక్షరమును యత్యక్షరములుగా వాడఁబడియున్నవి. దీనినే సంయుక్తాక్షరయతి యందురు. ఇందుఁ బాదాద్యక్షరమగు జ-కును, స్మ-అను సంయుక్తాక్షరమునందలి స-వర్ణమునకును, స్థా-యను సం

యుక్తాక్షరమునందలి స-వర్ణమునకును సాజాత్యము స్వీకరించి యతి సమర్థింపఁబడియున్నది. ఈపద్యమును రోమకాక్షరపద్ధతిని వ్రాసినచో నీఛందోనిబంధనలకుఁ దప్పక భంగము గల్గును. ఉదాహరణముగా నీపద్యమందలి నాల్గవపాదమును రోమకాక్షరములతో నీక్రింద వ్రాసి చూపెదను :—

Janitamarshograkala - smaraharukriya nasthani digganchu levan.

(a) Ja ni ta mar sho gra ka la-sma ra ha ru kri ya na-stha ni dig gan chu le van.

(b) Ja ni ta mar sho gra ka las-ma ra ha ru kri ya nas-tha ni dig gan chu le van.

ఈపద్యపాదమును పిల్లబిల్లగా విడఁదీసి చూపియున్నాను. అందు a లోఁ జూపినవిధముగా విడఁదీసినచో 'a'-అనుపిల్లబిలుకును, sma-అనుపిల్లబిలుకును, stha-అనుపిల్లబిలుకును యతి సరిపోవుచున్నదని తలంపవచ్చునుగాని, 'b' లోఁ జూపినట్టుల పిల్లబిల్లు విడఁదీసినచో ja-కును, ma-అను పిల్లబిలుకును, tha-అనుపిల్లబిలుకును యతి కుదరకపోవును. కాని, యిదియంత యసాధ్యమైన పనిగాదు; పిల్లబిల్లను క్రమముగా విడఁదీసికొనిన సరిపోదా ? దీని కింతయేల యందురా ? పిల్లబిల్లీవిధమున విడఁదీయవలయునని నిర్ధారణచేయుటయే చాల కష్టమైయుండును. ఎవరికిఁ దోఁచినట్టుల వారు పిల్లబిల్లను విడఁదీయుదురు. అప్పుడు ఛందశ్శాస్త్రసిద్ధాంతములఁ దెలిసికొనుటకు సాధ్యము గాక పోవును. పాదమున కిన్నియక్షరములని నియమ మేర్పఱచుటకు వీలుగాకుండును. ఇట్లెన్నియోచిక్కు లుండఁగా, నీరోమకాక్షరపద్ధతిని వ్రాయుటలోఁ గల మఱొక్క పెద్ద చిక్కును జూడుఁడు. ఉదాహరణముగా Factor అను ఇంగ్లీషుపదమును దీసికొందము. దీనిచివరగల or -అనక్షరముల నింపుక స్థలము వదలి Fact or-అని వ్రాసినఁగాని ముద్రించినఁగాని అప్పుడు Factor-అని యేకపదముగాఁ జదువుటకుమారు, Fact or-అని రెండుపదములుగాఁ జదువవలసివచ్చును. ఈశబ్దమునే మనసంయుక్తాక్షరపద్ధతిని ఫేక్టర్-అని వ్రాసినచో నొకవేళ క్ట-కును, ర్-కును మధ్య నింపుకస్థలము వదలిపెట్టి ఫేక్ట ర్-అని యిట్లుంచినను, ఫేక్టర్-అనియే చదువుదురుగాని వేఱువిధముగాఁ జదువుటకు వీలుపడదు. ఫేక్ట్ ఆర్-అను నీ రెండుపదములకును మధ్య స్థలము వదలిపెట్టఁబడకపోయినను, ఫేక్ట్ ఆర్-అని రెండు ప్రత్యేకపదములుగాఁ జదువవలయునేకాని, ఫేక్టర్-అని యేకపదముగాఁ జదువుటకు సాధ్యము గాదు. దీనినిబట్టి యాలోచింపఁగా మనసంయుక్తాక్షరపద్ధతియే చాల మేలయినదని తోఁపక పోదు.

ఈరోమకాక్షరపద్ధతిని మనభాషాపదముల వ్రాసినను నీచిక్కులు గల్గుచున్నవి. చూడుఁడు :—

సంస్మరణము-అనుపదమును రోమకాక్షరములతో వ్రాసిన Samsmaranamu-అని యగునుగదా ? దీనిని పిల్లబిల్లగా విడఁదీసినచో Sam sma ra na mu-అని విడఁదీయవలయును. కొందఱు Sams ma ra na mu-అనియును పిల్లబిల్లు విడఁదీయవచ్చును. అప్పుడు శబ్దస్వరూప మిట్టిదని యెఱుంగుటయే చాల కష్టమగును. Sam-smaranamu (సం-స్మరణము)- అని చదువవలయునా? లేక Sams-maranamu (సంస్‌మరణము) అని చదువవలయునా ? అనుసందియము గల్గును. దీనినే మన సంయుక్తాక్షరములతో సంస్మరణము అని యిట్లు వ్రాసినచో నప్పుడు పైని మొదట విడఁదీసినపిల్లబిలువలె సంస్మరణము అనియే చదువుదురు. దానిని రెండవవిధమున విడఁదీసిన పిల్లబిలువలె తొలు మాఱుగా విడఁదీసి చదువుటకుఁగాని, వ్రాయుటకుఁ గాని వీలుండదు. ఒకవేళ వ్రాయునప్పుడుగాని, ముద్రించునప్పుడుగాని యీశబ్దము సంస్మరణము అని యీతీరున స్మ-కును, ర-కును నడుమ నింపుక స్థలము వదలిపెట్టఁబడి యున్నదనుకొందము. అప్పుడును నీశబ్దముచ్చారణమునందుఁగాని స్వరూపమునందుఁగాని విరూపముఁ జెందదు. ఒకవేళ యెవ్వరేని యెఱుంగక తప్పుగా నీశబ్దమును జదివినను, సంస్మరణము అని యగునేగాని, పైరోమకాక్షరములందుండునట్లు సంస్‌మరణము మాత్రము గాఁజాలదు. చూడుఁడు, మన సంయుక్తాక్షరపద్ధతియందలివి శేషము! పై శబ్దమందలి స వర్ణము మ వత్తుతోఁగూడి యొక ప్రత్యే

కాక్షరముగా నుండుటవలన, దానిని తెలుఁగుగాఁ జేసి చదువుటకు సాధ్యము గాకున్నది. స్మృ అనిదే యెల్లరు నాయక్షరమును (పిల్లబిలువు) చదువుదురు. తన్మూలమున నాశబ్దోచ్చారణము చెడకుండ రక్షింపఁబడు చున్నది. ఇట్టి యొక ప్రధానమగుశక్తిగల మన సంయుక్తాక్షరపద్ధతి శ్రేష్ఠమో, రోమకాక్షరపద్ధతి శ్రేష్ఠమో చదువరులే యూహింతురుగాక! మఱికొన్ని యుదాహరణముల నిచ్చుచున్నాఁడను.—

సంస్పర్శము, సంస్థానము అను శబ్దములను దీసికొందము. ఈశబ్దములయందలి స్ప యను నక్షరమును, స్థా అను నక్షరమును సంయుక్తాక్షరముగా నుండకపోయినచో, సంస్-పర్శము **Sams parsamu**, సంస్థానము **Sams thanamu** అని కొందఱుచ్చరింతురు. అప్పుడు శబ్దములు విరూపములఁ జెందుచున్నవిగదా? స్పర్శము, స్థానము అని యుచ్చరించినచేగదా యాశబ్దముల స్వరూపము స్పష్టముగాఁ దెలియును? ఇట్టి పట్టుల నెట్టిసందేహమునకును నెడమీయక పామరుఁడు సైతము విస్పష్టముగాఁ జదువుకొనుటకు నుపకరించున వీసంయుక్తాక్షరములే యనవలయును. ఈక్రింద నుదాహరింపఁబడిన శ్లోకమును జూడుఁడు:—

"వర్గాః పృథ్వీపురక్ష్మాభృద్వనౌషధిమృగాదిభిః,
నృబ్రహ్మక్షత్రవిట్ఛూద్రైః స్వాంగోపాంగై రిహోది
[తాః."

ఈశ్లోకమునందలిసమాసఘటితపదముల క్రింద గీట్లు గీచియున్నాఁడను. ఈసమాసములందలిశబ్దములు సంయుక్తాక్షరములతో వ్రాయఁబడకపోయినచోఁ జదువునప్పు డుచ్చారణములో ననేకదోషము లేర్పడును. "పృథ్వీపురక్ష్మాభృద్వనౌషధిమృగాదిభిః" అను నీ సమాసమును దప్పుగాఁ జదువుట యటులుండ, నీ "నృబ్రహ్మక్షత్రవిట్ఛూద్రైః" అను సమస్తపదమును జదువునప్పు డుచ్చారణమునందు దప్పక చిక్కు గల్గును. ఎట్లనిన: ఈపదము "**Nribrahmakshatravitchudraih**" అని యిట్టుల రోమకాక్షరములతోఁగాని, లేక యిట్టిపద్ధతిని గల్పింపఁబడిన వేఱొక్క లిపితోఁ గాని వ్రాయఁబడి యుండునేని, **Nrib-rahmak-shat-ravit-chud-raih**-(నృబ్-రహ్మక్-షత్-రవిట్-ఛూద్-రైః)అని యిట్లు కొందఱు మహనీయులు చదువుదురు. అప్పుడు వారల నడ్డుపెట్టుటకుఁగాని, శబ్దోచ్చారణమునందలి లోపములను జెప్పి దిద్దుటకుఁగాని బ్రహ్మదేవునికైనను సాధ్యము గాకపోవును. ఈపదమే మనసంయుక్తాక్షరపద్ధతిని వ్రాయఁబడి యుండునేని, చదివెడివాఁ డెంతమూఢుఁ డైనను బ్ర-అనుసంయుక్తాక్షరమును, హ్మ-యనుసంయుక్తాక్షరమును, క్ష-అనుసంయుక్తాక్షరమును, ట్ఛూ-అనుసంయుక్తాక్షరమును, ద్రైః-అనుసంయుక్తాక్షరమును నుండుటవలన, నృ-అనునక్షరము నుచ్చరించినవెంటనే బ్ర-అను సంయుక్తాక్షరమును, అనంతరము హ్మ-అనుసంయుక్తాక్షరమును, అట్లులే యాపైనిఁగల యితరసంయుక్తాక్షరములను విస్పష్టముగా నుచ్చరించి తీరవలయును. అట్లుచ్చరించుచుండఁగా, వాచకుని కాశబ్దము లర్థముకాకపోయినను, వినువానికైనను నృబ్రహ్మ-అని స్పష్టముగా వినఁబడి, సమాసమునందలిశబ్దము లీయవి యని చక్కఁగా బోధపడఁగలదు. ఇట్లే యితరశబ్దములు నని యెఱుంగవలయును. ఇట్టిసంయుక్తాక్షరలేఖనమునకు ఒత్తులు-అనఁగా హల్లులరూపాంతరములును, అచ్చులరూపాంతరములును నెంతయు నావశ్యకము లైయున్నవి. అవి లేకపోయినచో, సంయుక్తాక్షరములను బ్రత్యేకాక్షరములుగాఁ బ్రదర్శించుటకు సాధ్యము గాకపోవును. ఇంకొక విషయమును గమనింపుఁడు:—

"తదాకర్ణ్య నీహారకరకిరణనికరసంపర్కలబ్ధావబోధో మాగధోఽగాధరుధిరచిరక్షరణనష్టచేష్టో దేవీ వాక్యమివ నిశ్వస్వాన స్తన్వానః ప్రియవదనాని శస్త్రైసా మాహ్వయత్."

ఇట్టిదీర్ఘములగు సమాసములను జదువుటకుఁగాని, వ్రాయుటకుఁగాని ప్రతిపిల్లబిలు వొక ప్రత్యేకాక్షరముగా నుండినచే సులభముగా నుండును. ఈవాక్యముచే మన పూర్వులనుసరించిన సంయుక్తాక్షరపద్ధతిని గాక, రోమకాక్షర పద్ధతిని అచ్చులను హల్లులను విడివిడిగా ప్రక్కన ప్రక్కన వ్రాయఁబూనినఁ గాని, లేక యట్లు వ్రాయఁబడినదానినిఁ జదువుటకుఁ దలపెట్టినఁగాని, ఒకనికిఁ గల

యోర్వంతయును మాయమై నిశ్చయముగా తలనొప్పి పుట్టును. ఇట్టి యుదాహరణము లెన్నియేని నీయవచ్చును. విస్తరభీతిచే నింతటితో మానుచున్నాఁడను.

పైనిఁ జెప్పినవిషయము లన్నియును జక్కఁగా విమర్శించి చూచినచో, మనపూర్వులు దీర్ఘముగా నాలోచన సల్పి, మనభాషాస్వభావము (Genius of the Language)న కనుకూలముగా నుండునట్టులును, లేఖనమునందుఁగాని, పఠనమునందుఁగాని కష్టము గల్గకుండునట్టులును నుండవలయునని తలంచియే యిట్టి సంయుక్తాక్షరపద్ధతిని మన తెలుఁగులిపి కేర్పఱచి యున్నారనుట తెల్లము గాకపోదు. ఎన్ని విధముల నాలోచించి చూచినను నీరోమకాక్షరపద్ధతి మనదేశభాషల కెంతమాత్రమును బనికిరాదనియే చెప్పవలసియున్నది. విషయ మిట్టులుండ " మనపూర్వు లేర్పఱచిన లిపి చాల చిక్కులను గల్పించుచున్నది; చాల ననాగరికముగా నున్నది; సర్వవిధముల మనకన్నను నాగరకతగల యాంగ్లేయుల పద్ధతిని మన మేల యనుసరింపరాదు" అని యిట్లు కొందఱు చెప్పుచుండుట మిక్కిలి హాస్యాస్పదముగా నున్నది. పాశ్చాత్యవిద్వాంసు లెందఱో మనలిపుల లోని ప్రాశస్త్యమును గొనియాడియున్నారు. చూడుఁడు మెక్డానలు (A. A. Macdonnell, M. A., Ph. D.) ఏమనుచున్నాఁడో:—

"This complete alphahet, which was evidently worked out by learned Brahmins on phonetic principles, must have existed by 500 B. C. according to the strong arguments adduced by Professor Buhler. It not only represents all the sounds of the Sanskrit language, but is arranged on a thoroughly scientific method, the simple vowels (short and long) coming first. Then the diphthongs, and lastly the consonants in uniform groups according to the organs of speech with which they are pronounced. We, Europeans, on the other hand, 2,500 years later, and in a scientific age, still employ an alphahet which is not only inadequate to represent all the sounds of our languages, but even preserves the random order in which vowels and consonants are jumbled up. ................................ From the southern variety of the Brahmi-writing are descended five types of scripts, all in use south of the Vindhya range. Among them are the characters employed in the Canarese and the Telugu Country."

దీనినిఁబట్టి చూడఁగా ఐరోపాఖండము నందలి యున్నిలిపులకన్నను మన దేశపులిపులే శ్రేష్ఠతమములని తేలుచుండలేదా? ఇట్లు విదేశపు పండితులు సైతము మన దేశపులిపులఁ బ్రశంసించుచున్నను, మనము మాత్రము మన లిపులయందలి విశేషము తెలియఁగఁ జాలక, మన లిపులు చాల ననాగరికముగా నున్నవని చెప్పుచుండుట మన యనాగరికతనే వెలిపుచ్చుచున్నది. ఇట్లుపాశ్చాత్య పండితులు మనలిపులపై నొసంగియుండు నభిప్రాయము లన్నియు నిచ్చట వ్రాయఁబూనినచోఁ బ్రకృత ముద్దేశించినవిషయమును దడవుటకు సాధ్యము గాకపోవును గాన నింతటితో దీనిని మానుచున్నాఁడను.

మొదటి రెండుకారణములను విమర్శించి చూచితిమి. స్వరవర్ణముల రూపాంతరములను వ్యంజనవర్ణములతోఁ గలిపి వ్రాయుపద్ధతియును, సంయుక్తాక్షరలేఖనపద్ధతియును దీసివేయుటకు వీలుపడదని తేలినది.

ఇఁక మూఁడవకారణమును విచారింతము.

సంయుక్తాక్షరము లుచ్చారణానుసారము గాక యక్రమపద్ధతిని వ్రాయఁబడుట తెలుఁగులిపియం దొక గొప్పలోప మనియు, అట్టి లోపము నాగరలిపియందు లేదనియుఁ గొందఱు తలంచుచున్నారు. అయ్యది కేవలము పొరపాటనక తప్పదు. అట్టి లోపము నాగరలిపి యందుఁగూడఁ గలదు చూడుఁడు:—

**प्रकृति:** :—ఈశబ్దమునకు ప్ + ర్ + అ + క్ + ఋ + త్ + ఇ + ః అని గదా వర్ణక్రమము. లిపిని బరీక్షింపుఁడు. శేషముపై నుండవలసిన ఋకార చిహ్నమును (తలకట్టుకు సమానమును) అడ్డుగీటు పకార

మునకుఁ గలిపి తెలుఁగునందువలెనే ప్ర-అని వ్రాయఁబడి యున్నది. ति: (త్ + ఇ + ః) - అను నక్షరము నందు ఇ-కారచిహ్నము వ్యంజనాక్షరమగు త-కారమునకు ముందుఁ జేర్పఁబడియున్నది. **शुक्लः, गङ्गा, राष्ट्रः, द्वादशी, श्रीमद्भगवद्गीता** - ఈశబ్దములయందుఁ గ్రిందగీట్లు పెట్టిన క్లః, ఙ్గా, ష్ట్రః, ద్వా, శ్రీ, ద్భ, ద్గీ - అను సంయుక్తాక్షరములను జూడుఁడు. ఇందు నాగరముఁ గూడ తెలుఁగుపద్ధతినే యనుసరించియున్నది. ఇది యక్రమపద్ధతిగాక మఱేమగును? ఇట్టియుదాహరణము లెన్నియేని యిచ్చుచుండవచ్చును. విస్తరభీతిచే నింతటితో వదలెదను. కాని, **अध्ययन, च्यवन, पुस्तक, मूल्य** - అనునిత్యాదిశబ్దములు నాగరలిపియందుఁ గ్రమపద్ధతినే వ్రాయఁబడుచున్న వందురా? చెప్పెదను, వినుఁడు:

ఈశబ్దములే బెంగాలిలిపిలో వ్రాయఁబడినచో

# অধ্যয়ন, চ্যবন, পুস্তক, মূল্য-

అని యగుచున్నవిగదా? వీటినే మన తెలుఁగులిపిలో వ్రాసినయెడల అధ్యయన, చ్యవన, పుస్తక, మూల్య- అని యగుచున్నది. ఇందుఁ గ్రిందుగీట్లు గీచిన సంయుక్తాక్షరములను గమనింపుఁడు. నాగరీలిపియందు నీసంయుక్తాక్షరము లుచ్చారణానుసారముగా నుండినను, వంగభాషాలిపియందవి తెలుఁగునందువలె ఒత్తులుగా మార్పుఁ జెందియున్నవి. వంగభాషాలిపియందలి సంయుక్తాక్షరములను, తెలుఁగులిపియందలి సంయుక్తాక్షరములను నించుక గమనించి చూచితిమేని, తెలుఁగు ్య-వడి ్ర-వత్తులకును, బెంగాలి ্য-వడి ্র-వత్తులకును గల పరస్పరసంబంధము తేటపడఁ గలదు. శ్రీఅచిన్త్య కుమారసేనగుప్త అను నామమును వంగలిపిలో వ్రాసినచో

# শ্রীঅচিন্ত্যকুমার সেনগুপ্ত-

అని యగుచున్నది. ఇందలి శ్রী, ন্ত্য, প্ত అను సంయుక్తాక్షరములను జూడుఁడు. నాగరమునందలి రేఫరూపాంతరము బెంగాలిలో నెట్లు మారి తెలుఁగున క్రారావడిగా చేర్పడినదియు, అట్టులే ্য-వడియును, ্র-వత్తును చేర్పడినదియుఁ దెలియఁగలదు. সৈ-అను బెంగాలి యక్షరము నందలి ఏకారచిహ్నమును, మన ప్రాచీనపు తెలుఁగుశాసనములందలి ఏకారచిహ్నము నొక్కటియె యను విషయము ప్రాచీనశాసనములను బరిశీలించిన వారికిఁ గ్రొత్తగాదు. ఇట్లు తెలుఁగక్షరములకుఁ బోలికగల యక్షరము లెన్నియో బెంగాలిలిపియందుఁ గలవు. పైయుదాహరణములవలన తెలుఁగు ఒత్తులకును, బెంగాలి యొత్తులకును సంబంధము గలదని తేలినది. ఇట్టులే కర్ణాటక-గ్రంథ-కేరళలిపులకును, తెలుఁగులిపికిని బరస్పరసంబంధము గలదు. ఆలిపులయందును తెలుఁగులిపియందువలెనే యొత్తులను జేర్చి సంయుక్తాక్షరములు వ్రాయఁబడుచున్నవి. ఇవన్నియుఁ బరిశీలించి చూడఁగా, లిపిమాతయని తలంపఁబడు నాగరియందలి పోలికలు గొన్ని నాగరిలిపికి జ్యేష్ఠపుత్రికయగు బెంగాలియందును, బెంగాలియందలి పోలికలు గొన్ని దాని ముద్దుచెల్లెలగు తెలుఁగునందును, అట్టులే తెలుఁగునందలిపోలికలు గొన్ని కర్ణాటకకేరళాదిలిపుల యందును చేర్పడియున్నవని తెలియుచున్నది. ఒక్కతల్లి గర్భమున జనించిన యక్కచెల్లెండ్రకుఁ బోలిక యుండకపోవుట యెట్లైనఁగలదా? కావున, నీ యక్రమపద్ధతి కల్పితముగాక పుట్టుకతోడనే యన్ని లిపులయందును చేర్పడినట్టుల తేటపడుచున్నది. విషయ మిట్టులుండఁగా, కేవల మొక్క తెలుఁగులిపియందుమాత్ర మిట్లు దోషారోపణము చేయుట యేటిన్యాయము?

ఇఁక నాల్గవకారణము నారయుదము.

మనవర్ణమాలయం దధికసంఖ్యాకములగు నక్షరము లున్నవని కొందఱాక్షేపించుచున్నారు. ఈయాక్షేపణ కాధారము గానరాదు. మనవర్ణమాలయందు మనభాషకు వలయునన్ని యక్షరము లున్నవేగాని, యనవసరములగు నక్షరములు లేవనియే చెప్పవలయును. ప్రస్తుతము మన వర్ణసమామ్నాయమునందుఁ గల యక్షరములసంఖ్యను తగ్గించుటయనఁగా భాషను తాఱుమాఱొనరించుటయే

యగును. అప్పుడు కట్టు-గుట్టు అనుటకును, కరము-ఖరము-గరము అనుటకును, తిట్ట-దిట్ట అనుటకును, ఆట-ఆడ అనుటకును, మాట-మాడ అనుటకును, పోటి-బోటి అనుటకును, షరము-శరము అనుటకును, పాట-బాట అనుటకును, తనము-ధనము అనుటకును, మతము-మదము అనుటకును, పలము-ఫలము-బలము అనుటకును, అర్థము-అర్ధము అనుటకును భేదము తెలియకపోవును. ఏశబ్దము నెట్లుచ్చరింపవలయునో తెలియుట కష్టమగును. ప్రతి శబ్దమునకును జరుపునప్పుడు, "అయ్యా! ఇ దెట్లుచ్చరింపవలయును?" అని యొకరి నడిగి యాశబ్దోచ్చారణమును (Pronunciation) దెలిసికొనునంతటి దుర్గతి మనభాషకును బట్టును. ఇట్టిమహాభాగ్యము ద్రవిడాంగ్లోర్ధ్వ (Tamil, English and Urdu) భాషాలిపులకుఁ గలదు. "ఋ, ౠ, ఌ, ౡ" ఈస్వరవర్ణములును, విసర్గానుస్వారములును తెలుఁగున వాడఁబడుట లేదనియు, 'థ' అను వ్యంజనాక్షరముగూడ వాడుకనుండి తొలఁగి పోవుచున్నదనియు, ఈయక్షరముల నేల తెలుఁగువర్ణమాలయందుండి తొలఁగింపరాదనియు నిట్లు మఱికొందఱు వాదించుచున్నారు. ఇదియును పొరపాటనక తప్పినది కాదు. పైఁగనిన స్వరములతోఁ గూడిన సంస్కృతశబ్దములు తెలుఁగున వాడఁబడుచుండుటవలనను, సంస్కృతభాషాగ్రంథములు తెలుఁగులిపియందు ముద్రింపఁబడుట వలనను, ఆస్వరవర్ణము లీతెలుఁగువర్ణమాలయం దుండుట యత్యావశ్యకమైయున్నది. ఎవ్వరో కొందఱు తెలియక "అర్థం లేనిచదువు వ్యర్థం, గ్రంథం, రథం, వీథి" అని యిట్లుచ్చరించినమాత్రాన థ-కారమునకుఁ బని లేదనియు, దానిని ఆంధ్రభాషామతల్లి సేవనుండి తొలఁగింపవలయుననియు, హుకుము సాదరుచేయుట న్యాయ్యమగునా? థ-కారయుక్తములగు పదములు పేరాశిముగా మన తెలుఁగుగ్రంథములందుఁ బ్రయోగింపఁబడియున్నవి. ఇదానీంతనులలోను విద్యావంతు లెల్లరును నాయక్షరముగలపదములను వాడుచునే యున్నారు. కావున, నదియును గూడ నితరాక్షరములవలెనే యాంధ్రభాషాసేవ కావశ్యకమై యున్నది. అట్టిదానిని వర్ణమాలనుండి తొలఁగించుట కెవ్వ రంగీకరింతురు? శబ్దములందలి వర్ణములను విస్పష్టముగా నుచ్చరింపకపోయినఁ జాల దోషమని మన ప్రాచీనశబ్దశాస్త్రజ్ఞులు శాసించియున్నారు. అట్టులుండుటంబట్టి యీతెలుఁగులిపిలోని యక్షరములసంఖ్యను తగ్గించుట కెంతమాత్రమును వీలుపడదు. అట్లక్షరముల సంఖ్యను తగ్గించుటకుఁ బూనుకొందుమేని, లిపిని సంస్కరించుటకుమాఱుగా దానినిఁ జెడిపినవారమే యగుదుము.

ఇక నైదవకారణమును విచారింతము.

ఆంగ్లేయాద్యన్యభాషావర్ణమాలలయందలి యపూర్వవర్ణములు గొన్ని తెలుఁగునందు లేకపోవుట యొక గొప్పలోప మనియుఁ, దెలుఁగువర్ణమాలయందలి యనవసరములగు నక్షరములను దొలఁగించి యాస్థానమున నాంగ్లేయాద్యన్యభాషలయందలి యపూర్వాక్షరములను బ్రవేశపెట్టవలయుననియు, నట్లొనరించినచో నాంగ్లేయాద్యన్యభాషాపదములను స్వరూపము చెడకుండ మనభాషలోనికి పేరాశిముగాఁ జొప్పింపవచ్చుననియు, నప్పుడీతెలుఁగులిపి సకలభాషాలేఖనక్షమ మగుననియుఁ, దన్మూలమునఁ దెలుఁగుభాషకును, దెలుఁగులిపికిని మహోన్నతపదవి లభించుననియు నిట్లు కొంద ఱూహించుచున్నారు. ఈవిషయము నించుక విమర్శించి చూతము. భాషాభివృద్ధికి అన్యభాషాపదములను స్వీకరింపవలసినది యావశ్యకమే. ఆపనిని మనపూర్వకవులే యాచరించి మనకు మార్గదర్శకులై యున్నారు. కాని, అట్లన్యభాషాపదములను మన తెలుఁగునందుఁ బ్రయోగించునపు డాశబ్దములు తెలుఁగువర్ణమాలకు లొంగియుండునట్టులు జూడవలయును. అయ్యదియే యుత్తమమైనపద్ధతి. నేఁటికాలమునకుఁ గొన్ని యూర్ధ్వభాషా (Urdu) పదములును, గొన్ని యింగ్లీషుపదములును దెలుఁగునఁ గలిసినవి. ఇట్టులే ఫ్రెంచి, జెర్మని మున్నగు నితరభాషాపదములును నావశ్యకతనుబట్టి తెలుఁగునఁ గలియవచ్చును. ఇట్లన్యభాషాపదములు చేరఁడికొలఁది నూతనాక్షరములను మనవర్ణమాలలోనికిఁ జేర్చుచుండవలసినదేనా? అట్లు చేయఁదలపెట్టినచో దానికి మితి యెక్కడిది? వర్ణమాలకొక వ్యవస్థ లేకపోవును. ఈవఱకే తెలుఁగునఁ గలిసియుండెడి యాంగ్లేయాద్యన్యభాషాపదములు మన వర్ణమాలకు లొంగియుండునట్టులే మార్పుఁజెందియున్నవి.

ఆచారములు స్వభావతః యేర్పడినవేగాని ప్రయత్నపూర్వకముగాఁ దెచ్చిపెట్టుకొనినవి కావు. చూడుఁడు.— Road, Park, Rail, Mile, Mail, Factory, Doctor, Motor-ఇత్యాదిశబ్దములు రోడ్డు, పార్కు, రైలు, మైలు, మెయిలు, ఫ్యాక్టరి, డాక్టరు, మోటారు-అనియే యెల్లరచేతను బ్రయోగింపఁబడుచున్నవి. హలంతములగు నీ యాంగ్లశబ్దము లన్నియును దెలుఁగులోనికి వచ్చునరికి అజంతములుగాఁ దమంతటనే మారి తెలుఁగురూపముఁ దాల్చినవి. ఇది స్వభావమునకు తప్పదు. ఇఁక నాంగ్లేయభాష మన భాషాపదములను గైకొనినప్పు డేమిచేసినదో చూడవలసియున్నది. శివః, వేదః, ధర్మః, బుద్ధః, శాస్త్రం-ఇత్యాది శబ్దములను (Siva, Veda, Dharma, Budha, Sastra.) సివా, వేడా, ధర్మా, బుడ్ధా, సాస్ట్రా-అని యాంగ్లమునఁ బ్రయోగింపఁబడుచున్నవి. ఇవి యాంగ్ల వర్ణమాల ననుసరించి స్వాభావికముగా నేర్పడినమార్పు గాక మరేమగును? మఱియొక్కవిశేషమును జూడుఁడు.—Pith అనునాంగ్లశబ్దమును దెనుఁగునఁ బ్రయోగించిన పిత్తు అగుచున్నది. ఆంగ్లభాషాకోవిదులగు మనవారెవ్వరేని, "ఏదీ నాపిత్తు టర్బను" అని యిట్లు ప్రయోగించిన వినుట కెంత ఇంపుగా నుండునో యాలోచింపుఁడు. ఇట్లు కొన్ని యన్యభాషాపదములు మన భాషలోనికి వచ్చునప్పు డిట్టియశ్లీలముల కడమియుఁ గలదు. మనభాషాశబ్దముల నాంగ్లేయులు వాడునప్పుడును గూడ నిట్టి యశ్లీలము లేర్పడుచున్నవి. చూడుఁడు.—శివ-శబ్దమును సివా-అనుట యటులుండ, వేదశబ్దమును వేడా-అనియును, బుధ-శబ్దమును బుడ్ధ-అనియు నుచ్చరించునపుడు వినుట కెట్లు లుండునో యోచింపుఁడు. వేడా-అనునప్పు డెవ్వఁడేని మహారాష్ట్రుఁడు వినిన వెఱ్ఱివాఁ డనుకొనును. బుడ్డ-అనునది మనకుఁ దెలిసియే యున్నది. ఇట్టి యశ్లీలశబ్దములు రాకుండునట్టు లాంగ్లేయు లేల తమవర్ణమాలను సంస్కరించుకొనరాదు? మీఁదుమిక్కిలి మనవారిలోనే కొంద ఱాంగ్లభాషావిదులు, "That is what our Veda says. This is Siva's temple, This is Budha,s statue." (వేడా, సివా, బుడ్డా) అనియిట్లుచ్చరించుచు విద్యావంతుల మైతిమని విఱ్ఱవీఁగుచున్నారు. మనయూళ్ల పేళ్లనుసైత మాంగ్లేయులు దమవర్ణమాలకు లొంగునట్టులు మార్చివైచెదరు. చూడుఁడు.—విశాఖపట్టణము=Vizag, మథురా=Muttra, తిరువల్లిక్కేణి=Triplicane అనియిట్లర్థరహితములగు పేళ్లనుసైతము తమయిచ్చ వచ్చినట్టు లాంగ్లేయులు మార్చుకొనిరి. ఈశబ్దములే చాల రమ్యముగా నున్నవని తలంచి మనవారును గొందఱు, "Well Mr. Sastry, I am going to Vizag" అనియిట్లు "సాస్ట్రి", "వైజాగ్" అని యుచ్చరించుచు నాగరికాగ్రేసరులైనట్టులు మురిసిపోయెదరేగాని, యాంగ్ల భాషా వర్ణ మాల ను సంస్కరించుటకుఁగాని, సంస్కరింపుఁడని యాంగ్లేయులఁ గోరుటకుఁగాని యేల తలపెట్టరో తెలియకున్నది. లోపభూయిష్ఠమగు నాంగ్లవర్ణమాలయం దేవో కొన్ని నూతనధ్వను లున్నంతమాత్రమున నది మనవర్ణమాలకన్న శ్రేష్ఠమగునా? ఆ నూతనధ్వనులను దెలియఁజేసెడివర్ణములు గొన్ని లేనంతమాత్రమున సర్వలక్షణయుక్తమగు మన తెలుఁగువర్ణమాల కొక లోపము వాటిల్లునా? ఆంగ్లవర్ణమాలలో మాత్ర మాధ్వనులకుఁ బ్రత్యేకచిహ్నములు గలవా? Man, Mat, tail, Oil ఇత్యాదిస్వరములను వ్రాయుటకుఁ దగిన ప్రత్యేకస్వరవర్ణము లందున్నవా? ఆంగ్లభాషకు వలసినన్ని వ్యంజనాక్షరములు లేనందుననే రెండు రెండు హల్వర్ణములను జేర్చి, ch=చ అనియు, sh=ష అనియు, th=త, ద అనియు నిట్లు లెన్నియో ధ్వనులను వ్రాసికొనుచుఁ గష్టపడెదరు. ఆవర్ణమాలయందలి లోపములను వివరింపఁ బూనిన నది యొక చిన్న గ్రంథమగును గాన నింతటితో వదలెదను. మనభాషలోఁ దగినశబ్దములు దొరకనప్పు డాంగ్లేయాద్యన్యభాషాపదములను స్వీకరించుట యుక్తమగుఁగాని, అనవసరముగా "పిత్తు టర్బను" వంటి పదములను దెనుఁగునఁ బ్రయోగించుట భాషాభివృద్ధికరమగు పని యేనాటికిని గానేరదు. అట్లావశ్యకమైనప్పు డన్యభాషాపదములను మన వ్యాకరణశాస్త్రమునకును, వర్ణమాలకును లొంగి యుండునట్టులు మార్చి మన విభక్తిప్రత్యయములను జేర్చి తెనుఁగునందు వాడుకొనుటయే

భాషనువృద్ధిపఱచుట యగునుగాని, తలఁచినపుడెల్ల నొక క్రొత్తయక్షరమును మనవర్ణమాలలోనికిఁ జేర్చుచుండుట కానేరదు. కావున, తెలుఁగువర్ణసమామ్నాయమునఁ గ్రొత్తయక్షరములను జేర్చకయే యన్యభాషాశబ్దప్రయోగములకు వలసిననియమములను గొన్నిఁటిఁ జేర్పఱచుకొని వాటిని మనము పాటింపుచుండుటయే యుత్తమ మార్గము.

ఇఁక నాలవకారణమును విచారింతము.

ఇతరస్వరవర్ణములరూపాంతరములు వ్యంజనవర్ణములతోఁ గలిసియున్నప్పుడు సైతము అకారచిహ్నమగు తలకట్టు చేర్చి వ్రాయఁబడుట తెలుఁగులిపియం దొక లోపమని తలంపఁబడుచున్నది. ఇది తెలుఁగునఁ బ్రత్యేకముగాఁ దెచ్చిపెట్టికొనినది కాదు. ఇదియును వంశపారంపర్యముగా వచ్చిన యాచారమే. చూడుఁడు.—
**कृ, कॄ, कु, चु. ङु, पु** – కృ, కౄ, కు, చు, ఙు, పు – నాగరిలిపియందును ఋ-కార-ౠ-కార-ఉకారరూపాంతరములు వ్యంజనవర్ణములతోఁ జేరునప్పుడు తలకట్టగు (అకారచిహ్నమగు) అడ్డుగీ టుంచఁబడుచునే యున్నది. నాగరియందలి యడ్డుగీట్లును, తెలుఁగునందలి తలకట్లును నొక్కటియే యనుట లిపితత్త్వశాస్త్రజ్ఞు (Paleographists) లెఱింగినవిషయమే గావున, విశేషించి యిట వ్రాయుట యనవసరము. ఇట్లే వంగ-కర్ణాటక-గ్రంథ-కేరళాది లిపులయందును వ్రాయఁబడుచున్నది. తలకట్టు అకారచిహ్నమైనను, ఇతరస్వరముల రూపాంతరములు వ్యంజనవర్ణములతోఁ జేరునప్పు డది లేనట్టు భావింపఁబడుట యన్నిలిపులయందు నాచారమైయున్నది. ఈ విషయమునే బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులుగారు తమ శిశువ్యాకరణమునందు స్థిరపఱచియున్నారు. కాని, "ఇట్లు వ్రాయుట లోపము గాదా? ఈ యాచారము నేల మనము తొలఁగింపరాదు?" అందురా? చెప్పెదను వినుఁడు. లిపియొక్క స్వభావమును గూడ కొంత గమనింపవలసియున్నది. నాగరియందుఁ గాని తెలుఁగునందుఁగాని, కన్నడమునందుఁగాని, ప్రతియక్షరమును వ్రాయునప్పుడు క్రిందివైపున నారంభించి పైవైపున ముగింపఁబడుచున్నది. అందు కనుగుణముగా వానితలకట్టు చేర్పఁబడియున్నవి. అవి లేకున్నచో వ్రాయుట చాల కష్టమగును. ఉదాహరణముగా గురువు, పురుషోత్తముఁడు-అను నీరెండుపదములను దీసికొందము. ఈశబ్దములను వ్రాయునప్పుడు ఉకారచిహ్నమగు కొమ్ములను ఆయా వ్యంజనాక్షరములతలకట్టుల నంటియే వ్రాసెదము. అట్లు వ్రాసిననే కలము ధారాళముగా నడచును. ఇట్లే యితరస్వరముల రూపాంతరములును కలము ధారాళముగా వెళ్లుట కనువుగా నేర్పడియున్నవి. ఇట్లు తలకట్టులఁ జేర్చి వ్రాయుట లోపమే యైనను, వ్రాఁతయందలి యానుకూల్యమునుబట్టియును, లిపియొక్క స్వభావమునుబట్టియును, మానుటకు సాధ్యము గాకున్నది.

ఇఁకను నేడవకారణమును విచారింతము.

సవర్ణములగు వ్యంజనాక్షరముల యాకారము లొక్కపోలికగా నుండకుండుట యొక లోపముగాఁ దలంపఁబడుచున్నది. ఇదియుఁ బరంపరాగతమైన యాచారమే. ఈవిషయమునఁ దెలుఁగే నాగరలిపికన్నఁ జాల మేలనవలసియున్నది. చూడుఁడు.—చ ఛ, డ ఢ, ద ధ, ప ఫ, బ భ—ఈయక్షరములకుఁ దెలుఁగునందే కొంత పోలిక యున్నది. నాగరమునందు పోలిక యంతఁగా నుండదు. ఉదాహరణముగా నీయక్షరములనే నాగరలిపియందు వ్రాసి చూపెట్టెదను:— **च छ, ड ढ, द ध, प फ, ब भ**. చూచితిరా? ఇందు ప ఫ-లకుఁ గొంత పోలిక యున్నను, ఇతరవర్ణములకుఁ బోలిక లేకపోయినది. ఇట్లే గ్రంథ-కేరళ-వంగ-కర్ణాటకాది లిపులయందును సవర్ణములగువ్యంజనాక్షరములకుఁ బోలిక లేకపోయినది. ఈలోపమున కాయాలిపులవా రేమిచేసిరి?

పైఁగనిన మూఁడు, ఆఱు, ఏడుకారణములందుఁ జెప్పఁబడిన లోపములు లేకయును, ఆంగ్లేయాది సకలభాషలను నిర్దుష్టముగాను, యథోచ్చారణముగాను లిఖించుట కనువుపడునట్టులును నుండు నొకలిపి కావలయునన్నఁ గ్రొత్తగాఁ గల్పింపఁబడవలసినదే.*

* నే నట్టిలిపుల రెంటిని చాలకాలముగా శ్రమపడి నిర్మించియే యున్నాను. మన్మిత్రులు పలువురు చూచియున్నారు. ధనాభావమువలన నా రెండులిపులను బ్రకటింపనేరకున్నాఁడను. భాషాభిమాను లెవ్వరేనిఁ జేయూఁత నొసంగినవెంటనే ప్రచురింపుటకు సిద్ధముగా నున్నాఁడ.

# తెలుఁగువర్ణమాల

అచ్చులు ౧౬

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ

ఎ ఏ ఐ ఒ ఓ ఔ

ఉభయాక్షరములు ౩

ం ఁ ః

హల్లులు ౩౮

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట

ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ

య ర ఱ ల ళ వ శ ష స హ క్ష

అంకెలు ౧౦

౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭ ౮ ౯ ౦

BY M.S. VENKAYYA.

చిత్రము ౧

## గుణితము

సూచనః— ఇ, ఋ, ఎ, ఐకారయుత చ బలు, తెలుగునందు వాడఁబడక పోయినను, వాటిగుణితము దెలియుటకై ఇందుఁ జేర్పఁబడియున్నవి.

| స.నం. | (౬) + | క | ఘ | జ | చ | బ | ఝ | ఙ | వ | ఫ | మ | య | ర | వ | ష | న | మ | హ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ʼ | క | ఘ | జ | చ | బ | ఝ | ఙ | వ | ఫ | మ | య | ర | వ | ష | న | మ | హ |
| ఆ | ా | కా | ఘా | జా | చా | బా | ఝా | ఙా | పా | ఫా | మా | యా | రా | వా | షా | సా | మా | హా |
| ఇ | ి | కి | ఘి | జి | చి | బి | ఝి | ఙి | వి | ఫి | మి | యి | రి | వి | షి | సి | మి | హి |
| ఈ | ీ | కీ | ఘీ | జీ | చీ | బీ | ఝీ | ఙీ | వీ | ఫీ | మీ | యీ | రీ | వీ | షీ | నీ | మీ | హీ |
| ఉ | ు, ు, ు | కు | ఘు | జు | చు | బు | ఝు | ఙు | వు | ఫు | ము | యు | రు | వు | షు | ను | ము | హు |
| ఊ | ూ | కూ | ఘూ | జూ | చూ | బూ | ఝూ | ఙూ | వూ | ఫూ | మూ | యూ | రూ | వూ | షూ | నూ | మూ | హూ |
| ఋ | ృ | కృ | ఘృ | జృ | చృ | బృ | ఝృ | ఙృ | వృ | ఫృ | మృ | | | వృ | షృ | నృ | మృ | హృ |
| ౠ | ౄ | కౄ | ఘౄ | జౄ | చౄ | బౄ | ఝౄ | ఙౄ | వౄ | ఫౄ | మౄ | | | వౄ | షౄ | నౄ | మౄ | హౄ |
| ఌ | ౢ | కౢ | | | | | | | | | | | | | | | | |
| ౡ | ౣ | కౣ | | | | | | | | | | | | | | | | |
| ఎ | ె | కె | ఘె | జె | చె | బె | ఝె | ఙె | వె | ఫె | మె | యె | రె | వె | షె | నె | మె | హె |
| ఏ | ే | కే | ఘే | జే | చే | బే | ఝే | ఙే | వే | ఫే | మే | యే | రే | వే | షే | నే | మే | హే |
| ఐ | ై | కై | ఘై | జై | చై | బై | ఝై | ఙై | వై | ఫై | మై | యై | రై | వై | షై | నై | మై | హై |
| ఒ | ొ, ొ | కొ | ఘొ | జొ | చొ | బొ | ఝొ | ఙొ | వొ | ఫొ | మొ | యొ | రొ | వొ | షొ | సొ | మొ | హొ |
| ఓ | ో, ో | కో | ఘో | జో | చో | బో | ఝో | ఙో | వో | ఫో | మో | యో | రో | వో | షో | సో | మో | హో |
| 23 | 3 | కౌ | ఘౌ | జౌ | చౌ | బౌ | ఝౌ | ఙౌ | వౌ | ఫౌ | మౌ | యౌ | రౌ | వౌ | షౌ | సౌ | మౌ | హౌ |
| | | | | | | | ఽ | | వ | ఫ | | | | | ష | న | ౧ | |

*M.S.Venkayya.*

చిత్రము ౨

...ప్రమాణము]

బాలకుఁడు:—నేను దీనిలో దూరు నప్పుడు పారిపోయినవి.

కాపు:—దీనిలో నేల దూరవలెను?

బాల:—నీవు చంపెదనన్నావుకాదా?

కాపు:—ఛీ! దొంగా! నీవు నా కెప్పుడగ ...తివి?

బాల:—అగపడలేదు. పట్టణపుఁబిల్లను ...చ్చెదనని నీవు యింటిలోననుచున్నావు. ...టవిని నన్ను చంపెదవని యిక్కడ ...గికొన్నాను.

కాపు:—(కొంత గ్రహించి) మీదే ...ూరు?

బాల:—పిఠాపురము.

"ఓహో యిదియా కారణము. ఓ వెఱ్ఱి పిల్లవాఁడా! భయపడకు. నిన్నేమియుఁ జేయను. మాయూరిసంతలో నిన్ననొక కోడిపిల్లను గొనితెచ్చితిని. నేఁడు దానిని గూరచేసికొనఁ గోరి పట్టణపుఁబిల్లను బలియిచ్చెదనని యంటిని. నీవును బట్టణఁపువాఁడవగుట నిన్నుఁ జంపుదునని భ్రమించితివి. రమ్ము" అనిచేరఁదీసి వాని వృత్తాంతము సవిస్తరముగఁ దెలిసికొని యాబాలకుని తలిదండ్రుల దాపునకుఁ దర ...లించెను.

గీ. ఒకని నిర్దోషవాక్యంబు నొకఁడు కపట
వచనముగనెంచి యాత్మను వందు రొకఁడ...
కయ్యమును బెంచు నొక్కఁడు కష్టవితతి...
గాంచు విభ్రాంతమతిని నిష్కారణముగ.

---

# పూలకన్నె

ఏనుఁగు లక్ష్మీరాజు గారు

పువ్వులన్ని పైఁడి
బుట్టలోఁ బెట్టి
బుట్ట చేతఁ బట్టి
...గాఁ తియుటు రాగ
...గంద
...కించి




విశ్వనాథ సత్యనారాయణ గారు

మహాశ్వేత సహజసుందరి. ఆమెసౌందర్యము మసృణమృణాలమధురము. ఆమె కెందుచేతనో కృత్రిమసౌందర్యమునెడల వైముఖ్యము. తస్మాత్ నగలమీాద నామెకు నిరాకరణ.

నిరాభరణసుందరమైన యామె శరీర
[illegible]యను చూచి లోకము మెచ్చుకొన లేక
[illegible]యునది. ఏో. అమంగళవాక్యములు కూడ
[illegible]లికినది. పాప మది యామెకు తప్పక తగిలినవి.

నీలలోచనుడు బ్రదికియున్నపుడు మహాశ్వేత సుమంగలివలె కన్పించలేదు. నేడు భర్తృవిహీనవలెను కన్పించుటలేదు. సౌమంగల్యము కన్న వైధవ్యముకన్న విభిన్నమైన రెూకలక్షణమామె మొగమున నిండియున్నది. అది సౌందర్యమేమొ! ఆమెవంక చూచిన నడ విపూవులు వికసించినట్లుండును.

[illegible]శ్వేత కృత్రిమసౌందర[illegible]
[illegible]యా బ్రదికియ[illegible]
[illegible]ందర్యము [illegible]

కది కంటగింపు. ఎప్పుడైన భర్త బలవంతపె[illegible]
నామె రంగుచీరకట్టి, నగలుపెట్టుకొ[illegible]
యతడు కాలు గడపకదిపిన వెంటనే[illegible]
లన్నియు తీసి తన తెలిపట్టుచీర కట్టుకున్న[illegible]
న్మేఘముచాటు చంద్రశలాకవలె పూ[illegible]
టలో విహరించుచు నూపిరి తీసికొనును.

మహాశ్వేత గొప్పయింటిబిడ్డ,ఆమె తం[illegible]
యామెను సంస్కృతాంధ్రములయందు చక్క[illegible]
ని పండితురాలిని చేసినాడు. ఆమె రసగ[illegible]
పారీణ. విద్యావికాసముచేత,[illegible]
పాటు,-ఆమె మనస్సుకూ[illegible]
లేతయరటి,యూ[illegible]
నది. ఆమెమన[illegible]
నావ వలె విహ[illegible]

ఆమెకు నా[illegible]
సూత్రములు [illegible]
ర్యవిష[illegible]

# తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచు...

నుసర్ల సూర్యప్రకాశము గారు

"అబ్బబ్బా!! బడిబడియని మాయమ్మ నన్నుఁజంపితినివేయుచున్నది. బలవంతముగఁ బుస్తకములు చేతిలోఁ బెట్టి ప్రతి దినము నన్ను బడికి సాగనంపుచుండును. ఆమె కేమి తెలియును నాకష్టము. బడికిఁబోవుట యనఁగా గోలీలాడుటా? గోపురాలెక్కుటా? లెక్కలఁట. పాఠములఁట. ఛీ ఛీ! వాటి మాటయన్న నాకుఁ దలనొప్పి. పూర్వమొకటి ...లియు రెంటికనియు వంకఁ బెట్టుకొని వీథులలోఁ దిరుగు జటగాళ్లతో దాగుడు మూతలాడుకొనుచుండెడివాఁడను. ఇదియేమి కర్మమో యీదొంగతనము కనిపెట్టి కాఁబో ...ట్టెట్టు కదలకుండఁ బట్టుపట్టికూర్చుండఁ బెటుచున్నారు. అయ్యో! ఈమాయ చదువెక్కడి నుండివచ్చెను నాయనా! ఇఁక నేను వెళ్లను. ఈరోజు మొదలుకొని బడికిఁబోయినఁ గోమటి ...డుకును కాను" అని యొట్టుబెట్టుకొని చేతి ...ని పుస్తకము లాకరి దొడ్డిలో మూల ...న్న మునగచెట్టు మొదట జాగ్రత పెట్టి ...ల్లిదండ్రులతోఁ జెప్పకుండఁ దనయక్కగారి ...వారికిఁ బ్రయాణమై పోవుచుం... ...మటికొట్టువాఁడు.

... నా

యూరుకాదని తెలిసికొనినతో... జొచ్చెను. ఆకటిచేఁ గడుపు న... డెను. నిద్దుర ముందువెనుకలకు ... చుండెను. తిరిగితిరిగి తుదకొక ... మేడయరుఁగుపైఁ బండుకొనియుం...

"ఓసీ! తెల్లవారిపోవచ్చెనే... కువ రాకపోయెఁగదా! జాము... ఇప్పుడెక్కడ ప్రయాణము. త... ప్రయత్నము చేయుము. ... ప్రయాణమయ్యెదను" అని ... భార్యతోననెను.

"వంటయనవెంత? కూర... రాకున్నది." అని యాతనిభా...

"అట్లయిన బట్ట... దను" అని చేతఁ గ... లో సమర్పఁబడిన కో...

"నేను...

చం...

చక్కగా తెలియుచున్నట్లు బాలవ్యాకరణములోని పెక్కుస్థలములనుబట్టి మనకు విశదమగుచున్నది. వీరు కొన్ని సందర్భములలో సిద్ధాంతకౌముదిలోను దద్వ్యాఖ్యానములలోను గల పంక్తులను ప్రత్యయములు మాత్రముమార్చియీదిగువ నుదహరింపఁబడిన రీతిని బాల వ్యాకరణములోఁ జొనిపియున్నారు.

1. నియతోపస్థితికము ప్రాతిపదికార్థము—(బాల వ్యా-కారక-1 సూ)

2. ధాత్వర్థఫలాశ్రయంబు కర్మ నాఁబడు. (బాల-కారక-2 సూ)

3. ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాఁబడు. (బాల-కారక-3 సూ)

4. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. (బాల-కారక-4 సూ)

5. ప్రకృతిజన్య బోధంబునందుఁ బ్రకారంబు భావంబు. (బాల, తద్ధి-1 సూ)

6. వర్తమానంబు నాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు (బాల-క్రి 2 సూ)

7. భూతంబు నా విద్యమానధ్వంస ప్రతియోగి. (బాల-క్రి-3 సూ)

8. భావి నా విద్యమానప్రాగభావప్రతియోగి. (బాల-క్రి-4 సూ)

ఇట్లు పెక్కుస్థలములలో సంస్కృత వ్యాకరణములోని పంక్తుల నెంతమాత్రమును మార్పక వ్రాయుటయే కాక ప్రత్యాహారములు, ఇత్సంజ్ఞలు, అతిదేశములు మున్నగు సంస్కృతవ్యాకరణపద్ధతుల ననుసరించి ... నడిపించియున్నారు. మఱియు "1. అన్య ... ర్థే. 3. యదాగమా స్త ... నై" మున్నగు సంస్కృత ...

చున్నది. ఎంతో శ్రమపడికాని తెలిసికొన ... సంస్కృతవ్యాకరణ విషయములు నిట్లు తెలు ... రణములోఁ జొనుపుట సమంజసమగునా కా ... న కేము మనకుఁ బ్రస్తుతము కాదు. పైని ... యంశములనుబట్టి సూరిగారికి సిద్ధాంతకౌముదిలో ... యమభినముగలదని యు దానిని దగ్గఱనుంచు ... యీ బాలవ్యాకరణ సూత్రములను వివరణ ... రనియు మనకు స్పష్టపడుచున్నది గదా. ఇం ... తాంశము చిత్తగింపుఁడు:

సిద్ధాంతకౌముది

సూ:— యతశ్చనిర్ధారణమ్;— జా ... క్రియా సంజ్ఞాభిః సముదాయా దేకదేశస్య పృథ ... నిర్ధారణం యతః తతః షష్ఠీ సప్తమ్యౌ స్తః.

1. ఉదా. నృణాం నృషు వా ... శ్రేష్ఠః.

2. గవాం గోషు వా కృష్ణా బహుక్షీరా ...

3. గచ్ఛతాం గచ్ఛత్సు వా ధావన్ శీఘ్ర ...

4. ఛాత్రాణాం ఛాత్రేషు వా మైత్రః ...

బాలవ్యాకరణము

సూ:—నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకంబ ... జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబున ... దేశంబునకుఁ బృథక్కరణంబు నిర్ధారణం బ ... ఎద్దానివలన నిర్ధారణంబగు నద్దాని షష్ఠికి లోపల ... బగునని యర్థము.

1. ఉదా:— మనుష్యులలోపల క్షత్రి ... శూరుండు.

2. గోవులలోపలఁ గపిల బహుక్షీర.

3. అశ్వికులలోపలఁ బాఱువాఁడు శీఘ్ర ...

4. ... లలోపల మైత్రుండు సమర్థు ...

... భట్టోజిదీక్షితులు ...

... యున్నా ...

...ప్రథమముగ జాత్యుదాహరణమును మాత్రము మార్చి ...మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు' అని ...దాహరించుటకుఁ గారణము సూరిగారికిఁ గల ...బ్రాహ్మణద్వేషమే యగును.

...పై విషయమును లోకములోని కింవదంతి గలిపి ...వేయఁగా సూరిగారికిని కృష్ణమూర్తిశాస్త్రిగారి ...యొక్క ప్రబలమైన వివాదము జరిగియుండు ...నాకుఁ దోఁచుచున్నది. ఒకవేళ విద్యావిషయ ...నట్టి వివాదమేదైన వచ్చినను రావచ్చును. కాని ...జాతివిద్వేషముగఁ బరిణమించుట వింతగానున్నది. ...యములఁ జర్చించినట్లు జాతులతోఁ ...మి? సూరిగారు బ్రాహ్మణజాతివారు కారని వారు ...రించిన బాలవ్యాకరణమును నిరసించిరా? ...కారికావళీ విమర్శనములో మా గురు ...లు సెలవిచ్చినట్లు బాలవ్యాకరణములోని లక్షణ ...చాలవఱకుఁ జింతామణ్యహోబలపండితీయాథ ...కారికావళీగతములే యైయున్నను నాంధ్రభాషలో ...రచనాదికము సరళముగాను జాలవఱకు నిర్దుష్ట ...యుండుటచే నన్నిజాతులవారును బాలవ్యాకర ...గౌరవించుచుండలేదా? కావున నిట్టి యసూ ...యములు సారస్వతాభివృద్ధికిని దేశాభివృద్ధికిని ...ప్రతిబంధకములనుటయే నాయుద్దేశము. ...ప్రస్తుతము కారికారకావళీ బాలవ్యా ...ల విషయమున దాని కిది యాంధ్రీకరణమా దీని ...సంస్కృతీకరణమా యని వికల్పించుచుఁ దత్కర్త ...కిని వివాదము జరుగుట సత్యమగునా కాదా సంశయించుచు నున్న విమర్శకుల కీవిషయము ...పగునను నూహతో నాకు స్ఫురించినదానిని ...చించినాఁడను. పండితులు విమర్శింతురుగాక.

## (2) ప్రౌఢవ్యాకరణము

ఆంధ్రశబ్దచింతామణి మొదల్... బాలవ్యాకర ...ము వఱకు నున్న మన యాంధ్రవ్యాక... ...నను నాంధ్రభాషానియమము... ...

పూర్వమందున్న వ్యాకరణములలోఁ జెప్పఁబడక శేషించిన లక్షణముల నన్నిటిని సమకూర్చు నుద్దేశముతో నీగ్రంథమును రచించినట్లు దీని నామమే వ్యక్తపఱచుచున్నది.

బాలవ్యాకరణమున (సంధి - 8) "సంస్కృతీయంబులకు సంధియగు"నని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునిక కృతులం బొకానొకచోఁ స్త్రీవాచకతత్సమంబులకు సంధి గానంబడియెడు. "గంగను కాసి, నెలఁతిచ్చెను." అనియు "అనుకృతిని విడుదకుం గుఱుచయగునని యొక్కండు వలికె నది నిరాకరంబు" (బాల-సంధి-64) అనియు నిట్లనేకస్థలముల నథర్వణాచార్యులమతమునం దసాధ్వనిత్యము సూచించియు, నాముక్తమాల్యదాది ప్రబంధరాజములలోని ప్రయోగములను నిరసించియు, నప్పకవ్యాదులమతమును దూషించియు నుండుటవలన జూడఁగా భారతేతర గ్రంథములలోని లక్ష్యములుగాని వానిని సాధించు లక్షణములుగాని ప్రామాణికములు కాజాలవన్నంత యభినివేశము సూరిగారి కున్నట్లుల స్పష్టముగాఁ దెలియుచున్నది.— ఇట్టి యభినివేశము యుక్తముగాదనియుఁ, గవిత్రయేతరులలోఁగూడ మహాకవులనియుఁ బ్రామాణికులనియు లోకములో నెన్నఁబడుచున్న వారి ప్రయోగములకెల్ల మనము సాధుత్వమును గల్పించుకొనవలసినదియనియు నూహతోఁ బ్రౌఢవ్యాకరణకర్తగారు చేసిన యుద్యమ మెంతయు శ్లాఘనీయమై యున్నదనుటకు సందియము లేదు. కాని వీరికిఁగూడ నప్పటప్పటఁ జిన్నయసూరిగారి వాసన తప్పినది గాదని చెప్పవలసియున్నది.

ప్రౌఢవ్యాకరణము శబ్దపరిచ్ఛేదమున (14సూ.) "ఋ శబ్దంబు బొందు సంజ్ఞ... నంబున ... వా... బరంబుగ నగు. ఆద్య... ...సూత్ర...

...స్థానిని యతని గ్రంథ మాధునికమని నిరూపించుటెంత వింతగానున్నది.

ఇవన్నియు నిట్లుండఁగాఁ, బరుమాఁడవశబ్దము...డును లాక్షణికులచేఁ బ్రామాణికుఁడుగా నంగీకరింపఁబడినవాఁడును నగు రంగనాథుఁడు తన రామాయణమున "అన్నరో నీవు పన్నిన్న నిపిలువ, నెన్నఁడు వినఁ...కపీనులకు" (ఇది లక్ష్మణుని సంబుద్ధి—యుద్ధకాం) "సిగ్గులజ్జయు లేని చెనఁటిరో నన్ను, బగ్గించుచు...పగతు లిబ్బంగి" (ఇది రావణుని సంబుద్ధి—యుద్ధకాం.) అని యిట్లు రోశబ్దమును బహువచనవాచకముఁ బ్రయుక్తముగాఁ జేసియున్నాఁడు. ప్రాచీన ప్రయోగములు చూచియే రోశబ్దప్రయోగము వ్యవస్థితము గాదనియు నయ్యది...వాచకసంబోధన స్థలములందేకాక తదితర స్థలములందుఁ గూడ రావచ్చుననియు నథర్వణాచార్యులు తలంచినట్లు "అన్యత్రాపి క్వచిద్రో స్యాత్ ప్రౌఢదేశ్య ప్రయోగకే" అనుకారిక వ్యక్తపరచుచున్నది. దీనిని బట్టి తిమ్మకవి ప్రయోగములను సాధించుటకు మిక్కిలి యవకాశము కన్పట్టుచున్నది. ఇట్టి స్థితిలోఁ బ్రామాణిక కవులలోఁ బరిగణింపఁబడుచు లోకప్రసిద్ధి వడసిన కూచిమంచి తిమ్మకవీంద్రుని బైకీతిని నిరాకరించుట యెంతమాత్రమును సమంజసము కాదని తోఁచుచున్నది.

మన యాంధ్రవ్యాకరణములోఁ గల యిట్టి యవ్యవస్థలను నసంపూర్ణతను దొలఁగించి, యిప్పటికిఁ గల యాంధ్రవాఙ్మయమునంతను బరిశీలించి, తత్తత్కవుల ప్రామాణికత్వముల నిర్ణయించి, యాంధ్రభాషా స్వరూపమును సాకల్యముగ బోధింపఁజాలిన యొక సంపూర్ణవ్యాకరణమును రచించు భారము మన యాంధ్రపండితులపై నిలిచియున్నది.



# స్వప్నగత వేణుగానము

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

...రెక్కలు దాల్చి భావగతి దివ్యవన మేఘపథంబు ద్రొక్కి, పై
దిక్కుల త్రోవ దాటి మొదలీతల నీ కలికాలవాహినిన్
ధిక్కరణంబు జేసి యొకతెంపున ద్వాపరవేళ జొచ్చి యా
చక్కని యామునీతటవిశాలవనాంతము జేరి వ్రాలితిన్.

పూర్వపు గాథలే మరచిపోయితి శారదచంద్రచంద్రికల్
పర్విన యావిసీలకకుబంతములన్ దిలకించునంత, నా
సర్వము నొక్కయుజ్జ్వల రసాంబుధి దెప్పున దేలిపో
త్సర్వము చేయుచుండె నవవద్యమనోహర రూప...

...నారికేళతరు, లోక్కె... ...పోక...

ఎక్కడ కూచుంటే నే నొక్కడినీ యివి తిన గలనా?"

"రావుగా! నా సుగ్రీవుడవు కావు నువ్వు, రా, యీ మాటురా, నాకు కోపం లేదులే."

"పోనీ ఒకపాట పాడతావస్తావా? రా, మరిరా, పాటపాడనా?"

కోతి ఒక్క గంతువేసి భిక్షువు ఒడిలో కూచుంది. ఆ గుప్పెడిలో బియ్యం అది తింటోంది. భిక్షుకుడు రెండు గుప్పెళ్లి బియ్యం తిన మొదలుపెట్టినాడు. కొంత సేప టికి యిద్దరూ భోజనము ముగించినారు.

"ఇంకా ఆకలేస్తోంది ఏమి చెయ్య మం టావు అన్నాడు భిక్షువు."

కోతి అతని పెదవులు పట్టుకుంది.

"పాడమంటావా? పాడితే ఆకలి తీరు తుందా? ఒకప్పుడు నేను ప్రణయ గీతాలు రాసే కాలంలో పాటవల్ల ఆకలి తీరేది. ఆ మాట వాస్తవమే కాని యిప్పుడు."

కోతి చింతచెట్టు ఎక్కింది. అప్పుడప్పుడే పుట్టుచున్న వామన కాయలు, చింత రెమ్మలు కిందకు పడవేసింది. దిగివచ్చి అవి తన యజ మానికి యిచ్చింది. అతగాడు ఆ కాయలూ ఆ ఆకూ తిన్నాడు.

"సరే యీవేళకు భోజనం, ఫలహారం, అయినవి. ఇం కేం చేద్దాం."

కోతి గోదావరి కేసి చూసింది.

"అవును, ఆమాట నిజమే. కడుపు నిండకపోతే నీళ్లతో

పద; తాగుదాం వారి."

భిక్షువూ, కోతి నీటిని సమీపించి కడుప మళ్లీ వచ్చి చింత చూచి అక్కడ వున చిరిగిన బట్ట వేసుకొని

కోతి అతనిగడ్డమ తోంది.

"ఉండు, కొంచెం ఏంతొందరవచ్చింది. కింక పనేమిటి?"

దాహము తీర్చుక ఆసమీపానికి వచ్చి గింది. కోతి కేకలు వేసిం విసిరినాడు. కుక్క ఆకా కొని ఏమోఫిర్యాదు చేస పోయింది.

కొంతసేపు యి కూర్చున్నారు.

"అయితే సుగ్రీవు పాట పాడమంటున్నావు చెప్పాలని వుంది. క

కోతి న

"

కూడా

...డు. అయితే ఎందుకు
...జ మొక్క కూచుని తల
... వెలువడు మాటలు
... సంతోషమును నెలి
అయితే విను కథ."
...జుట్టుపట్టుకుని వెనక్క
...ప్పమంటావా. సరే అలా
కథ చెప్పేటప్పుడు అల్లరి
...?"
...ల క్రింద పెట్టుకొని వెల్లి
...కోతి అలిసి పక్కను
...కొండలలో కృష్ణానది
ఆ కృష్ణ బాగుందా? ఈ
... నీకు మనోహరము. స్థ
...జాతికీ మాజాతికీ సమా
...కు గోదావరిమీద ఎక్కువ
...ంటావా ?
...ప్రేమం నిరంతరమూ గోదా
...వుస్నది. దీనికి
...లి పాప
...ిసంలో
...లె

వున్న కాలంలో ఒకనవనాగరికుడు పెళ్ళి చూపులకి పోలవరంనుంచి ఒకస్నేహితుడితో కూడావచ్చాడు. పిల్లను చూచుకున్నాడు. ఒకరి నొకరి చూచుకున్నారు. ఆమెకన్నుల నుండి వెలువడ్డ కాటుక కాంతులు యితగాడి హృదయాన్ని వలవేసి పట్టుకున్నవి. ఆనవ నాగరీకుడగు యువకుడు యీ బాలికను పెళ్ళి చేసుకున్నాడు. ఆకాలంలో ఇతడు ఎన్నో పద్యాలు పాటలూ రాసేడు ప్రేమతత్వాన్ని గురించి. ప్రకృతి అంతా ప్రేమమయమని లోకానికి చాటిచెప్పేడు. ముసలివాళ్ళు పండితకవులూ యితగాడి భావగీతాలు చూసి చిరునవ్వు నవ్వుకున్నారు. పిండ్లికాని బ్రహ్మచారులు యీతని పద్యాలు అనుకరించడం మొదలు పెట్టేరు. ఇట్లాకొంతకాలం గడిచింది.

* * * *

ప్రేమానుభవము కలుగు చున్నప్పటి నుంచీ ఆయువకుడు భావగీతాలను వ్రాయడం మానివేసినాడు. భార్యాభర్తలిరువురూ కాపురం చేస్తూవున్న కాలంలో సంసారతాపత్రయం ఎక్కువై పోయింది. భార్యకు వంటా పిల్లలూను. భర్తకు భూమీ బుట్రా, సంసారము దిద్దుకోవడమూను. ఈ రీతిగా కాలం గడిచి పోతూవున్నది. ప్రేమబీజా లంకురించినప్పుడు వస్తుందనుకొన్న స్వర్గము సంసారసాగరముగా మారింది. యువకుడు ఆలోచించ మొదలు పెట్టినాడు.

...ప్రేమానుభవముకన్న, ప్రేమను అను ...నే ప్రతీక్షయే ఎక్కువ హాయి

ఆలోచించాడు. భార్యతో వున్నప్పుడుమాత్రమేనా సౌఖ్యముంట, యితరత్రా మాత్రము లేదా? పోలవరము నొరసిపారుచున్న గోదావరీ పులినతలముల సాయంకాలములందూ వెన్నెలలలోనూ, తాను సంచరించేటప్పుడు సౌఖ్యము ననుభవించ లేదా? గౌతమీ మధ్య భాగమున చిన్నపడవపై తానొక్కడూ విహారము చేస్తూవున్నప్పుడు తాను సౌఖ్యమనుభవించ లేదా?. గోదావరిమధ్య తలయెత్తి, లోకాన్ని ఆకర్షిస్తూవున్న పట్టిసపు దేవాలయ శిఖరమును విలోకిస్తూవున్న సమయమున తాను ఆనందమును పొందలేదా? ఇంతకీ జీవితానికి పరమావధి ఆనందమే అయినట్లయితే ఆ ఆనందము ఒక్క భార్యవద్దనే వున్నదా? ఎక్కడ లేదు అనుకొన్నాడు.

ఒకనాడతడు గోదావరిదాటి ఏనుగు కొండమీదకెక్కి కూర్చున్నాడు. ఎదురుగా గోదావరిమీద వాయువుపీచి, చిన్నచిన్న తరంగములను లేపి, వాటితో ఆడుకొనుచున్నవి. ఒకప్రక్కనుపట్టిసము దేవాలయము గోదావరి మధ్య నిలిచి నీటిలో ప్రతిబింబించిన తనసాకారమును చూచు కొనుచున్నది. ఇంకొకప్రక్క మేఘమాలికలు తమపై నాడుకొనుచుండ కొండలు కూర్కు జెందియున్నవి. అతని మనస్సునకుకూడ సంతోషముకలిగినది. గోదావరిని తేరిపార, తనివితీర, చూచిచూచి, సంతోషం ఆపుకొనలేక సంగీతమును పాడినాడు.

ఆనాడు యింటికివచ్చినాడు. రాత్రి

భార్యవడ్డిస్తోంది. అతడ
పెట్టినాడు.

"లోకంలో మానవ
మూలకంగానే కల
కూడా కలగవచ్చునా

"ఆప్రశ్నే కొం

"అంటే ?"

"లోకంలో ఒక
మూలకంగానే కలుగుచున్న
సంబంధం లేకపోయినా క

"నీవూహా ఏమిటి ?

"మావూహ చెప్ప

"ఒకకాలంలో
సౌఖ్యం తన ఆప్తులవల్లనే
కొన్నాను."

"ఇప్పుడో?"

"ప్రకృతిని అనగా
వర్గములో చేర్చాను."

"అంటే, ప్రకృతివల్ల
తుందనా? ప్రకృతివల్లకూడా

"ప్రకృతివల్ల ఎక్కువ

"ఇకముందు ఈ అభి
ర్చబోతారేమో?"

"ఏవిధంగా మార్చబో

"ఇందాకా చెప్పేగా.

"లోకంతో సంబంధ
మానవుని మనస్సుకు సంతో

...కేమి సమాధానం
...లో ఏముందో ఎవరు

...రు చెప్పేరుగా."
...దాన్ని మాత్రమే

...జోడిస్తే, నేచెప్పినట్లు

...గాని—అనుభవమే మన
...స్తుంది."
...హాలన్ని ఎందుకొచ్చేయి

...ధంలేనిదే మానవుడుండే
...లిగి అడుగుతున్నాను."
...మారేగదా చెప్పగవిన్నా
[ను."
...పిపీలికాదులకువలెనే మను
...వని."
...న్యమనుష్యులకు."
...స్పిది ఎవరికి?"
...నములను మించి ఊహించ

...ంటివారా?"
...వ్రా?"
...వి ప్రూహాలుంటే మొట్టమొదట
...సంబంధం కల్పించుకోకూడదు.
...దుకున్నతరువాత దానిని త్యజించి
...ఆధారపడేవాళ్లు దుఃఖం

"ఆకాలానికి యిటువంటి ప్రూహాలులేవు కాబట్టే సంబంధం కల్పించుకోవలసివచ్చింది అనుకో."

"ఇప్పుడు వదులుకుంటే తనవారి మాటేమిటి?"

"అతడే తమకందరకూ ఆధారమనే పిచ్చి అభిప్రాయం తనవారికి పోతుంది"

"ఊరుకోండి, ఎవరేనా చెప్పిపోయారు? ఎవరు నేర్పేరు ఈఊహాలన్ని మీకు? భగవంతు డిచ్చింది కాస్తో కూస్తో కాలిమీద కాలు వేసుకుతినకుండా ఈపెడర్థాలూ, పెడతలపులూ ఎక్కడవచ్చేయిమీకు. అందుచేత నే పురుషులు ఉద్యోగంలేకపోతే వెఱ్ఱిమొఱ్ఱి ఆలోచనలు చేస్తూంటారట."

"మొదలెట్టేవ్రా సాధింపు?"

"అవును, నేనేమన్నా సాధింపే, మీర న్నమాటలు బాగున్నాయి కాబోలు. పిల్ల లతో కలకలలాడుతూవున్న యింట్లో పచ్చ పచ్చగా నే తిరుగుతూండడం మీకిష్టంలేదు కాబోలు. నే నేమన్నా మీకుకోపం. నేను వూరుకుంటాను. నాకెందుకమ్మా యీసొద."

భోజనాలైనతర్వాత అందరూ పండు కున్నారు. మనస్సునను కలత బెట్టుచున్న నూతన భావతరంగములను అణచుకోలేక యువకుడు సంకటపడుచున్నాడు. ఒకప్రొద్దువేళలేచి ఒక వుత్తరమును వ్రాసిపెట్టి కొంత డబ్బుతీసికొని అతడు యిల్లు విడిచి పోయినాడు. తెల్లవారి భార్య ఉత్తరం చదువుకొని కడుపు చెరువై పోయాగ పడ్డింది.

## సంస్కృతము

అచ్చు.

### శ్రీమద్రామాయణమ్

చతుర్థః సర్గః.

ప్రాప్తరాజ్యస్య రామస్య
వాల్మీకిర్భగవానృషిః,
చకార చరితం కృత్స్నం
విచిత్రపదమాత్మవాన్. ౧
చతుర్వింశత్సహస్రాణి
శ్లోకానాముక్తవానృషిః,
తథా సర్గశతాన్ పంచ
షట్కాండాని తథోత్తరమ్. ౨
కృత్వాపి తన్మహాప్రాజ్ఞః
సభవిష్యం సహోత్తరం,
చింతయామాస కోన్వేతత్
ప్రయుంజీయాదితి ప్రభుః. ౩
తస్య చింతయమానస్య
మహర్షేర్భావితాత్మనః,
అగృహ్ణీతాం తతః పాదౌ
మునివేషౌ కుశీలవౌ. ౪
కుశీలవౌ తు ధర్మజ్ఞౌ
రాజపుత్రౌ యశస్వినౌ,
భ్రాతరౌ స్వరసంపన్నౌ
దదర్శాశ్రమవాసినౌ. ౫
స తు మేధావినౌ దృష్ట్వా
వేదేషు పరినిష్ఠితౌ,
వేదోపబృంహణార్థాయ
తావగ్రాహయత ప్రభుః. ౬

చేతివ్రాత.

### శ్రీమద్రామాయణమ్

చతుర్థః సర్గః.

ప్రాప్తరాజ్యస్య రామస్య
వాల్మీకిర్భగవానృషిః,
చకార చరితం కృత్స్నం
విచిత్రపదమాత్మవాన్. ౧
చతుర్వింశత్సహస్రాణి
శ్లోకానాముక్తవానృషిః,
తథా సర్గశతాన్ పంచ
షట్కాండాని తథోత్తరమ్. ౨
కృత్వాపి తన్మహాప్రాజ్ఞః
సభవిష్యం సహోత్తరం,
చింతయామాస కోన్వేతత్
ప్రయుంజీయాదితి ప్రభుః. ౩
తస్య చింతయమానస్య
మహర్షేర్భావితాత్మనః,
అగృహ్ణీతాం తతః పాదౌ
మునివేషౌ కుశీలవౌ. ౪
కుశీలవౌ తు ధర్మజ్ఞౌ
రాజపుత్రౌ యశస్వినౌ,
భ్రాతరౌ స్వరసంపన్నౌ
దదర్శాశ్రమవాసినౌ. ౫
స తు మేధావినౌ దృష్ట్వా
వేదేషు పరినిష్ఠితౌ,
వేదోపబృంహణార్థాయ
తావగ్రాహయత ప్రభుః. ౬

*By. M.S. Venkayya.*

# తెలుఁగు

అచ్చు.

## శ్రీకాళహస్తిమాహాత్మ్యము

తృతీయాశ్వాసము.

ఈశ్వరుఁడు తిన్ననికిఁ బ్రత్యక్ష మగుట.

ఆ. కన్నుఁదివిచియుఁ బూను కన్నప్పతివ్రత
కన్ను మున్నుగాఁగ ఖండపరశు
నాశుగంబుఁ జేత నంటంగఁ బట్టుక
నిలువు నిలువు మనెడు నెలుఁగు తోడ. ౧

సీ. కిరియర విందము కెమ్మును
లష్టదిశాపతులు వేగ వేయ
చ్చురు తిరు వంకల న్నాలుగ
నత్వరత న్నిజలింగనిర్మలాం
తరమున నుండి శివతను
ధాధర కన్యక ముద్దుఁ గొలుఁదు
మరకత వ్రేలు వాల్గుకాని
మన్ననఁ దిన్ననికిం బ్రసన్నుఁ డై. ౨

క. శివగాఢవర! యీ భక్తుని
యతిరళతరభక్తిమహిమ యాద్యంతముగం
జివిగద సద్భక్తుం డితఁ
డవుఁగద నీమనసు వచ్చునా యిఁక ననుచున్.

క. దరహాసము నెరపుచుఁ దన
పరిసరమున కాలువిడుని బ్రాహ్మణభక్తుఁ
గరుణించి పిల్చుక మోకో?
వరమింపన వారు కృత్తివాసునితోఁడన్. ౪

చేతివ్రాత.

శ్రీకాళహస్తిమాహాత్మ్యము

తృతీయాశ్వాసము.

ఈశ్వరుఁడు తిన్ననికిఁ బ్రత్యక్ష మగుట.

ఆ. కన్నుఁదివిచియుఁ బూను కన్నప్పతివ్రత
కన్ను మున్నుగాఁగ ఖండపరశు
నాశుగంబుఁ జేత నంటంగఁ బట్టుక
నిలువు నిలువు మనెడు నెలుఁగు తోడ. ౧

సీ. కిరియర విందము కెమ్మును
లష్టదిశాపతులు వేగ వేయ
చ్చురు తిరు వంకల న్నాలుగ
నత్వరత న్నిజలింగనిర్మలాం
తరమున నుండి శివతను
ధాధర కన్యక ముద్దుఁ గొలుఁదు
మరకత వ్రేలు వాల్గుకాని
మన్ననఁ దిన్ననికిం బ్రసన్నుఁ డై. ౨

క. శివగాఢవర! యీ భక్తుని
యతిరళతరభక్తిమహిమ యాద్యంతముగం
జివిగద సద్భక్తుం డితఁ
డవుఁగద నీమనసు వచ్చునా యిఁక ననుచున్.

క. దరహాసము నెరపుచుఁ దన
పరిసరమున కాలువిడుని బ్రాహ్మణభక్తుఁ
గరుణించి పిల్చుక మోకో?
వరమింపన వారు కృత్తివాసునితోఁడన్. ౪

*By M.S. Venkayya.*

ఇప్పుడు వాడుకలోనుండు తెలుఁగులిపినిగాని మఱే యేయితరలిపినిగాని పైమూఁడు, ఆఱు, ఏడుకారణములందుఁ జేర్కొనినలోపములు లేక యుండునట్లులును, సకలభాషాలేఖనక్షమముగా నుండునట్లులును సంస్కరింపఁ బూనుట యసాధ్యమైనపని యనకతప్పదు. అం దెన్నియో చిక్కులున్నవి. అట్టు లెవ్వరేని సంస్కరింపఁ దొడంగిన, ఉన్నలిపి తాఱుమాఱై విరూపముఁ జెంది నాశమొందుటతప్ప లాభ మేమియు నుండఁ బోదు. అట్టి సంస్కరణమునఁ గల లాభనష్టములను నిట వ్రాయఁబూనినచో గ్రంథము పెరిగిపోవునుగాన నింతటితో నిలిపెదను.

"అట్టులైన నీలిపిని సంస్కరింపవలసినపనియే లేదా? ఇంతింతపెద్ద టైపుకేసులతోఁ దమకార్యాలయముల నిండించుకొని ముద్రణాలయాధికారు లెక్కువ యింటియద్దె యిచ్చుచుండవలసినదేనా? కంపోసిటరుపని నేర్చుకొనువా రక్షరములుండుస్థలములను కేసులలోఁ గనిపెట్టి తెలిసికొనుట కిట్టులే శ్రమపడుచుండవలసిన దేనా? టైపురైటరక్కర లేదా? లినోటైపు, మొనోటైపు మున్నగునవి యుండవలదా? సర్వవిధముల మన మాంగ్లేయులతోఁ దులదూగవలదా?" అని యందురేని, మనవిచేయుచున్నాఁడను:

సంస్కరణమాత్ర మత్యావశ్యకమనియే నే ననుచున్నాఁడను. అసలు లిపిసంస్కరణప్రసక్తి యేర్పడుటకుఁ గల ముఖ్యకారణము మనముద్రణవిధానమునందలి కొన్నిలోపములేగాని, మఱేయొండు గాదు. ఆసంస్కరణ మెట్టులుండవలయును? మనము ప్రస్తుతము వాడుచుండులిపిని తాఱుమాఱుగా మార్చి మూలచ్ఛేదము గావింపక యున్నలిపినే ముద్రణమునకును, టైపురైటరు, లినోటైపుమున్నగు యంత్రనిర్మాణమునకును, అనుకూలించునట్టుల సూక్ష్మములగు కొద్దిమార్పులతో సర్దుబాటుకుఁ జూడవలయును. అట్లొనరించినచే సంస్కరణ మనిపించుకొనును.

ఈతెలుఁగులిపి బ్రాహ్మీనాగరలిపుల మాఱురూప మనువిషయము ప్రాచీనములగు తెలుఁగుశాసనములను జూచినవారికిఁ గ్రొత్తగాదు. ఆశాసనలిపి ముద్రాక్షరనిర్మాణమునకును, ముద్రణసౌకర్యమునకును నెంతయు ననుకూలించునట్టులే యున్నది. ప్రథమమునఁ దెలుఁగునకు ముద్రాక్షరములను జేసినవా రాప్రాచీనశాసనములను విమర్శించి మాఁది తెనుఁగుణముగా నక్షరములను జెక్కించియుండిన, నీవిషయ మింతదూరము విమర్శించు పనియే లేకపోయియుండును. ప్రాచీనశాసనలిపియందు హల్వర్ణములపైఁగల తలకట్లు నాగరలిపియం దుండునట్లు అడ్డుగీట్లుగానే యుండి, క్రమక్రమముగాఁ గొంచె మెట వాలుగాఁ బైకెక్కి తాళపత్రములందు వ్రాయునప్పటి కిప్పుడు మనము వ్రాయునట్టి తలకట్లేర్పడినట్టులు దెలియుచున్నది. దీర్ఘము, కొమ్ము, కొమ్ముదీర్ఘము, సుడి, సుడిదీర్ఘము, ఎత్వము, ఏత్వము, ఒత్వము, ఓత్వము, ఔత్వము—ఈపదియును హల్వర్ణములకుఁ బ్రక్కనె చేర్చి వ్రాయఁబడుచుండినట్లు తెలియుచున్నది. గుడి, గుడిదీర్ఘము, ఐత్వము—ఈమూఁడు మాత్రము హల్వర్ణములకుఁ బైనను, క్రిందను జేర్చి వ్రాయఁబడుచుండినట్టులు దెలియుచున్నది. కాలక్రమమున ఎత్వ ఏత్వములుసైతము హల్వర్ణముల తలలపైకి నెక్కినట్లు తెలియుచున్నది. పదపడి యీలిపి తాటియాకులపై వ్రాయఁబడునప్పటికి దీర్ఘ - ఒత్వ - ఓత్వ - ఔత్వములు గూడ హల్వర్ణముల శిరస్సుల నలంకరించినట్టులు దెలియుచున్నది. ఈలిపియొక్క పుట్టుపూర్వోత్తరములను విచారింపక కేవల మొకతాళపత్రలిపినే యాధారముగాఁ జేసికొని ప్రతిహల్వర్ణముతోడను స్వరవర్ణములకుఁ గల రూపాంతరములను గలిపి ముద్రాక్షరములను జెక్కింప నందువలనే ముద్రాక్షరమంజూషయందలి యక్షరముల సంఖ్య దాదాపు ౯౦౦ వఱకుఁ జేరి చూచువారికి భయము గల్గించుచు అనాగరికలిపియని కొందఱిచే ననిపించుకొనునంతటి దుర్గతి మన యీ తెలుఁగులిపికిఁ బట్టినది. ఇఁక ఒత్తు లున్నవిగదా! వానిమాట యేమందురా? ముప్పదియేడు హల్వర్ణములకును ముప్పదియేడు ఒత్తులను జేయింపవలసి యుండునేగాని, దానివలన ముద్రాక్షరసంఖ్య పెరుగదు. అక్షరములసంఖ్య పెరిగినదానికంతయును గారణము స్వరవర్ణముల రూపాంతరములను

హల్వర్ణములతోఁ గలిపి పోయించినదియేకాని మఱి యొండు గాదు. ఇప్పుడును మించిపోయిన దేమియును లేదు. దానిని సంస్కరించి యక్షరములస్వరూప మేమాత్రమును మార్పుఁజెందకుండ ముద్రణ (Printing) మునకును, ముద్రాక్షరవిలేఖన (Type writing) మునకును ననుకూలించునట్లుగ సర్దుటకు వీలుండుటంబట్టి యిట్లొనరించుచున్నాఁడను.

చూడుఁడు ఒకటవ పటము. ఇందు అచ్చులను, హల్లులను ప్రదర్శించి యున్నాఁడను. ఈయచ్చులలో ఔ-అనువర్ణమునందలి యొక చిన్నమార్పుతప్ప వేఱొట్టి మార్పును జేయఁబడలేదు. ఋ, ౠ, ఌ, ౡ, ఔ-అను నీనాలుగక్షరములను ప్రత్యేకముగాఁ జేయింపవల సిన యావశ్యకత యుండదు. బ-కు రెండుకొమ్ముల నతికించిన ఋ-అగును. ఆ ఋ-కు దీర్ఘము నతికించిన ౠ-అగును. ఌ-కు దీర్ఘము నతికించిన ౡ-అగును. ఒ-కు ఔ-కారచిహ్నము నతికించిన ఔ-అగును. ఇందువలన అ ఆ, ఇ ఈ, ఉ ఊ, ఌ, ఎ ఏ, ఐ, ఒ ఓ, -అనునీ ౧౨ అచ్చులును, ఉభయాక్షరములు మూఁడును గలిసి ౧౫ అక్షరములే చేయింపవలసి యుండును.

ఇఁక హల్వర్ణములను జూడుఁడు: ఇందు ఘ, ఝ, మ, య, హ-అను నీక్రిందియక్షరములను ప్రత్యేకముగాఁ జేయింపవలసిన యావశ్యకత యుండదు. ఫ-కు కొమ్ము నతికించినచో ఘ-అనునక్షర మేర్పడును. అట్లులే ర-కు కొమ్ముల నతికించిన ఝ-అగును. వ-కు కొమ్ము చేర్చిన మ-అగును. ౦-కు కొమ్ములను జేర్చిన య-అగును. వ-కు దీర్ఘమును జేర్చిన హ-అగును.

చె జె-లకు పైని ౕ వ్రాయుటకన్నను, పటమునందుఁ జూపఁబడియుండునట్లుగ కొద్దిమార్పుతో వ్రాసికొనినచోఁ జాల ననుకూలముగా నుండును.

ఞ ట - ఈయక్షరములలో ఞ-కుఁ బ్రక్కన నుండు లంబతిర్యగ్రేఖలును, ట-కుఁ బైనుండు లంబరేఖయును నీక్రొత్తపద్ధతిని జేయఁబడుస్వరవర్ణములరూపాంతరములను జేర్చుటకుఁ బ్రతిబంధకములుగా నున్నందున, పటమునఁ జూపినట్లుగ మార్పఁబడినది.

క్ష-అనునక్షరము నిందుఁ బ్రత్యేకముగాఁ బ్రదర్శించి యున్నాఁడను. కొందఱమతమున నిదియు నొక ప్రత్యేకాక్షరముగాఁ బరిగణింపఁబడియుండుటంబట్టి యిట్లొనరించితిని. టైపురైటరునందు దీనికిఁ బ్రత్యేకాక్షరము చేయవలసిన యావశ్యకత యుండదు. కాని, యిది ప్రత్యేకాక్షరముగా నుండినచో కొన్నివిషయములం దెంతయు ననుకూలముగా నుండును.

ఇఁక మిగిలియుండునక్షరము లన్నియును మార్పుఁ జెందక యెప్పటివలెనే యున్నవి.

ఈహల్వర్ణములందలి తలకట్టింపుక మార్పునొంది యుండునట్లుగ తోఁచును. కొన్నిశాసనములం దిట్లులే యుండియున్నందువలనను, ఈతలకట్లయందలి పైకిఁబోవురేఖను మాత్రము ప్రత్యేకముగాఁ జేయించుకొనినచో దానిని హల్వర్ణములకుఁ బ్రక్కన నతికించుకొనుట కనుకూలముగా నున్నందువలనను, తలకట్లయాకారము నీతీరున మార్చితిని. ప్రస్తుతము కాగితములమీఁదు వ్రాయఁబడులిపిలోఁ జాలమంది కు తలకట్టు లిట్లుండుటను నేఁ జూచియున్నాఁడ. ఇట్లీమార్పు చేయఁబడనిచో, ముద్రణవిధానమునందు సౌకర్యముగాని, టైపు రైటరుయంత్రనిర్మాణముగాని, యేనాఁటికి నీతెలుఁగున కేర్పడుటకు వీలుండదు.

ఈహల్వర్ణములలో ఘ, ఝ, మ, య, హ అను నక్షరములు ప్రత్యేకముగాఁ జేయవలసిన యావశ్యకత లేనందున ౩౩ హల్వర్ణములే చెక్కింపవలసి యుండును.

ఇఁక రెండవపటమును జూడుఁడు. ఇందు అచ్చులును, వాటికిఁగల రూపాంతరములును ఆరూపాంతరములెట్లు హల్వర్ణములతోఁ జేర్పఁబడునదియుఁ బ్రదర్శింపఁబడియున్నవి. ఇందు మొదటివరుస (Column)లో స్వరవర్ణములను, వాటికిఁ గల రూపాంతరములను వ్రాసియున్నాము. దానిని గొంత గమనింపవలసియున్నది.

హల్మాత్రసంజ్ఞ — ఇయ్యది వ్యంజనాక్షరమున అ-కారము లేదనియు, కేవలము అర్ధాక్షరమే యనియు, సూచించుటకై హల్వర్ణములకుఁ బ్రక్కన వాని శిరముల

నంటియుండునట్లు చేర్పఁబడునది. ఇందు నే వాడిన రూపమే చాల ననుకూలముగా నున్నది. దీనినే నేఁటికిని కర్ణాటకులు వాడుచున్నారు. మనము ప్రస్తుతము వాడు రూపమును గుండలీకరణముచేసి చూపియున్నాను.

తలకట్టు — ఇయ్యది ప్రతి హల్వర్ణమునకును బ్రక్కన శిరోభాగము నంటియుండునట్లు చేర్పఁబడు చున్నది.

దీర్ఘము— ,,—,,—

గుడి—ఇయ్యది ప్రతిహల్వర్ణమునకును పైని శిరోభాగము నంటునట్లు చేర్పఁబడుచున్నది.

గుడిదీర్ఘము—ఇందు దీర్ఘమును దెల్పెడి చిహ్నము మాత్రము హల్వర్ణమునకుఁ బ్రక్కన చేర్పఁబడును.

కొమ్ము—ఇయ్యది ప్రతిహల్వర్ణమునకును బ్రక్కన చేర్పఁబడును.

కొమ్ముదీర్ఘము—ఇందు దీర్ఘచిహ్నము మాత్రము కొమ్మునకుఁ బ్రక్కన చేర్పఁబడును.

వట్రువసుడి—ఇదియును బ్రతి హల్వర్ణమునకును బ్రక్కన చేర్పఁబడునదియే.

సుడిదీర్ఘము— ఇందు దీర్ఘచిహ్నము మాత్రము సుడికిఁ బ్రక్కన నతికింపవలయును.

ఎత్వము—ఇయ్యది హల్వర్ణములకు శిరోభాగమున చేర్పఁబడుచున్నది.

ఏత్వము—ఇందు దీర్ఘమును దెల్పెడి చిహ్నము మాత్రము హల్వర్ణమునకుఁ బ్రక్కన చేర్పఁబడును.

ఐత్వము—ఇందు ఐ కారచిహ్నము ప్రతిహల్వర్ణమునకును ముందుగాఁ గ్రిందిపైపున నుంపఁబడును.

ఒత్వము — ఇయ్యది ప్రతి హల్వర్ణమునకును బ్రక్కన చేర్పఁబడుచున్నది.

ఓత్వము—ఇందుదీర్ఘమును సూచించు చిహ్నము ఒత్వమునకుఁ బ్రక్కన చేర్పఁబడును.

ఔత్వము— ఇయ్యది ప్రతి హల్వర్ణమునకును బ్రక్కన చేర్పఁబడును.

ఇఁక నీయచ్చులరూపాంతరములందలివిశేషముల నించుక తెలిసికొనవలసి యున్నది.

ఇందు తలకట్టు, దీర్ఘము, కొమ్ము, కొమ్ముదీర్ఘము, సుడి, సుడిదీర్ఘము, ఒత్వము, ఓత్వము, ఔత్వము ఈతొమ్మిదియును బ్రతి హల్వర్ణమునకును బ్రక్కన చేర్చుట కనువుగా నున్నందున ముద్రణమునందుఁ గాని టైపురైటరునందుఁ గాని, సులభముగా వాడుకొనవచ్చును.

గుడి-ఎత్వము—ఈరెండును మాత్రము ప్రతిహల్వర్ణమునకును శిరోభాగమున నుండి తీరవలసియే యున్నది. ఈరెండుచిహ్నములనుగూడ హల్వర్ణములకుఁ బ్రక్కల చేర్పఁబడినచో, ముద్రణమునం దెంతయో సౌకర్యమేర్పడఁగలదు. కాని, యట్లొనరించినచో నీలిపియొక్క యాకారము చెడిపోవుటవలనను, ఎల్లరు నీలిపిని బోల్చుకొనుట కష్టమగుటవలనను, ఇప్పు డుండునట్టులే హల్లులపైభాగమున నుంచవలసియున్నది. ఈరెండు చిహ్నములను హల్వర్ణముల శిరోభాగమున నుంచుటవలన నంతగా కష్టముండదు. ఫ్రెంచి, గ్రీకు మున్నగు భాషలయందు సైతము వర్ణములకుఁ బైనను, గ్రిందను గొన్ని చిహ్నములను ముద్రించుచుండుట మనము చూచుచున్నారము. కొన్ని ఫ్రెంచి శబ్దముల నుదాహరించు చున్నాఁడను. La mère, La Française, La fenêtre. ప్రతి విషయమునకును ఆంగ్లేయుల నాదర్శముగాఁ దీసికొని విమర్శింపఁబూనుట వెఱ్ఱిపని. మనభాష యాంగ్లము గాదు గదా. ఎట్టులైన క్రమమున కోర్చి యీయిత్వ యెత్వముల న పటమున జూపినట్టులే మనము వ్రాసికొనవలయును.

ఈగుడినిగురించి మఱియొక్క విశేషము వ్రాయవలసియున్నది. ప్రాచీనశాసనములయం దీచిహ్నము ప్రతి హల్వర్ణమునకును శిరోభాగమునఁ బ్రత్యేకముగా నతుక పెట్టినట్టులే వ్రాయఁబడుచుండెను. ఇప్పటికిని కి-జి-డి-ణి-తి-టి ఇత్యాద్యక్షరములందుఁ బ్రత్యేకముగా నతుకఁ బెట్టినట్టులే వ్రాయఁబడుట మనము చూచుచున్నారము. ని-లి-వి-బి- ఇత్యాదులయందుఁ బ్రత్యేక చిహ్నముగా వ్రాయఁబడుటలేదు. ఇయ్యది తాళపత్రలేఖకులు తమ సౌకర్యమునకై చేసినమార్పుగాని వేఱొండుగాదు. నేఁ డీ

చిహ్నమును బ్రాచీనపుఫక్కినే యున్న యక్షరములకును శిరోభాగమున నతికించుట కనువుగా మార్చితిని.

ఈ ఇ-కార ఎ-కారములకుఁగల దీర్ఘచిహ్నములు ప్రక్కనవ్రాయుట కనువుగా నున్నవి. అందును నేను పటమున బ్రదర్శించిన రూపమే మనము ప్రస్తుతము వాడెడిరూపమునకన్నను నన్నివిధములఁ జాల ననుకూలముగా నున్నది. ఇట్టి రూపమునే యించుక భేదముతో నేఁటికిని గర్ణాటకులు తమ లిపియందు వాడుచున్నారు. ఈమార్పువలన ముద్రణమునందుఁ గాని, టైపురైటరునందుఁగాని యెంతయో సౌకర్య మేర్పడుచున్నది.

కొమ్ము—ఇయ్యది మూఁడు విధములుగాఁ బటమునఁ జూపియుండునట్లుగఁ జేయింపవలసి యున్నది. మొదటిరూపము కు-గు-చు-డు-భు-రు—అను నిట్టి తలకట్టుతోఁ గూడిన హల్వర్ణములతోఁ జేర్చుట కనువుగా నుండును. రెండవ రూపము ఖు-ఘు-టు-ణు-ము-యు-ఇత్యాద్యక్షరములకుఁ జేర్చుట కనువుగా నుండును. మూఁడవరూపము పు-ఫు-వు అను నీమూఁడు హల్వర్ణములకుఁ జేర్చుట కనువుగా నుండును. ప-ఫ-వ-లకు మొదటి రూపమునందలి కొమ్ము నతికించినచో షు-ము అను వర్ణములుగా మారిపోవునుగాన, నట్లు గాకుండుటకై యీ కొమ్మిట్లు క్రిందికి దింపఁబడియున్నది. దీనిని మార్చుటకు వీలుపడదు గాన, నీమూఁడువిధములగు కొమ్ములుండవలసినది యావశ్యకమై యున్నది.

ఋ-ౠ-కారములు—ఈ రెండువర్ణముల రూపాంతరములును హల్వర్ణములకుఁ గ్రింద వ్రాయఁబడునవి. ఇతరములగు ఒత్తు లెట్లు హల్వర్ణములకుఁ గ్రిందఁ జేర్పఁబడునో యట్లులే వీనిని జేర్పవలయును.

ఐత్వము—ఇయ్యది మనము వాడెడి దానికన్నను గర్ణాటకులు వాడెడిది చాల ననుకూలముగా నున్నది. చూడుఁడు. స్థైర్యము అని వ్రాయునప్పుడు రెండుఒత్తులను గ్రిందవ్రాయవలసియున్నది. ఇదియే కర్ణాటకులు వ్రాయునట్టుల "స్థ్యైర్యము" అని యిట్లు ఐత్వమును హల్వర్ణములకుఁ బ్రక్కన నుండునట్టుల మార్చికొనిన వ్రాఁతయందును, ముద్రణమునందును, టైపురైటింగునందును జాలవఱకు శ్రమము తగ్గిపోవును. కాని, యీ కర్ణాటక ఐకారమును గొందఱు తొందరగాఁ జదువునప్పుడు వట్రువసుడి యని భావింతురు గాన, మనము ప్రస్తుతము వాడెడి ఐకారమునే ప్రతి యక్షరమునకును ముందుప్రక్కఁ గ్రిందిపైపున నుంచుట కనువుగా నుండునటులు మార్చితిని.

ఔత్వము—ఇది విశేషముగా మార్పుఁ జెందినట్లులఁ గన్పట్టును. కాని, ఇది నేఁజేసిన క్రొత్తమార్పు గాదు. ఇట్టులే ప్రాచీన శాసనములయందుఁ గనఁబడుచున్నది. ఇది ముద్రణమునకును, టైపురైటింగునకును జాల ననుకూలముగా నున్నందున గ్రహించితిని. ఇయ్యది యాకారమున నేమి, సౌకర్యమున నేమి, మనము ప్రస్తుతము వాడురూపమునకన్న నెన్నియో రెట్లు మేలైనది. ఈక్రొత్త ఔకారమునందును నీవరకుఁ బ్రచారమునందలి ఔకారమునందుగల భావము ద్యోతితమగుచునే యున్నది. ఈక్రొత్త ఔకారమును స్వీకరింపక పోయినచో, మనకు ముద్రణమున సౌకర్య మేనాఁటికిని గలుగనేరదు. కాన, నెల్లరు నిందలి సౌకర్యముల నాలోచించినవారైన దీని నంగీకరింతురని తలంచెదను.

ఇఁక గుణితమును గమనింతము. ఇందు ఘ-జ-చ-జ-ఝ-ఞ-ప-ఫ-మ-య-ర-వ-ష-స-హ అను నక్షరములకు గుణితము వ్రాయునపుడు కొన్ని విశేషాంశములు దెలియవలసియున్నందున, నవి సులభముగా బోధపడుటకై వాటికిమాత్రము సంపూర్ణముగా గుణితము వ్రాసితిని. ఈగుణితమును ఓపికతోఁ బరిశీలించిన ఫ అను వర్ణమెట్టులు ఘ అనువర్ణముగా మార్పఁబడినదియు, ర ఎట్టుల ఝ గా మార్పఁబడినదియు, వ ఎట్టులు మ గా మార్పఁబడినదియు, ం ఎట్టుల య గా మార్పఁబడినదియు, వ ఎటులు హ గా మార్పఁబడినదియుఁ దేటపడఁగలదు. క- అనునక్షరమునకును గుణితము సంపూర్ణముగా వ్రాసియున్నాఁడను. అం దీక్రొత్తమార్పులు తప్ప విశేషమేమియు లేదు. ఈగుణితమునఁ బ్రదర్శింపఁబడని యక్షరములకెల్లను క కారమునకు గుణిత మెట్లు వ్రాయఁబడియున్నదో అటులే వ్రాయవలయు నని యెఱుంగవలయును.

ఝ-ప-ఫ-మ-ష-హ అను నీవర్ణములకుఁ బ్రత్యేకముగాఁ జేయింపవలసిన కొన్ని చిహ్నములను నాయీవర్ణముల ఔకారగుణితముక్రింద ప్రదర్శించియున్నాఁడను.

ఈపటమునందు రెండువిధములగు హ వర్ణములకును బూర్తిగా గుణితము వ్రాసి చూపియున్నాను. ఇందేది చాల నిమిడికగా నుండునది, ఏది విశేషస్థలము నాక్రమించుకొనుచుండునది, దీనిని జూచినఁ దెలియఁగలదు. మనము ప్రస్తుతము వాడెడి హ వర్ణమునకన్నను గర్ణాటకులు వాడెడి యీ రెండవ రూపముగల హకారమే సర్వవిధముల నిమిడికగాను, సౌకర్యముగాను నున్నదనుట విమర్శించి చూచెడివారికిఁ దోఁపకపోదు.

పైని నేను సూచించిన మార్పులన్నియు నాస్వకపోలకల్పితములు గావు. శాసనములం దుండుటం బట్టియే గ్రహించితిని. పాఠకులకు సులభముగా బోధపడుటకై కర్ణాటకులు వాడెడిరూపములని యచ్చటచ్చట వ్రాయుచు వచ్చితినిగాని, యవి యొక్క కర్ణాటకులకుమాత్రమే గాక తెలుఁగువారికిని సొంతమైయున్నవి. తెలుఁగువారు వాడెడిరూపములను గర్ణాటకులును, గర్ణాటకులు వాడెడి రూపములను తెలుఁగువారును వాడుకొనుచుండినటులును, త్రిలింగకర్ణాటకలిపులకు భేదమే లేకుండినటులును గొన్ని కారణములనుబట్టి తెలియుచున్నది. ఈవిషయము లిపితత్త్వ (Paleography) శాస్త్రమెఱింగినవారికిఁ గ్రొత్త గాదు. ఈతీరున సంస్కరించినచో నీలిపియాకార మట్టే విశేషముగా మార్పుఁజెందదు. ముద్రణమునం దన్నియో సౌకర్యము లేర్పడఁగలవు. నే నీ సంస్కృత మగులిపిని బలువురకుఁ జూపితిని. ఎల్లరును సులభముగనే చదివెదరు. కావున నీక్రొత్తలిపిని సామాన్యజనులు సైతము సులభముగనే చదువఁగలరని నేను దృఢముగాఁ జెప్పఁగలను. ఈమార్పువలన నీవఱకుండెడిలిపి కెట్టినష్టమును గల్గఁబోదు. వ్రాఁత యెప్పటియట్లే సాగుచుండవచ్చును.

ఇఁక నీక్రొత్తపద్ధతిని ముద్రాక్షరములు చేయించిన నెన్నియక్షరములలో నిముడునది యీ క్రింది పట్టికలో సూచించుచున్నాఁడను:—

ముద్రాక్షరముల పట్టిక

| | | |
|---|---|---|
| ౧. అచ్చులు (ఉభయాక్షరములతోఁ జేరి) | ౧౫ | |
| ౨. అచ్చులరూపాంతరములు | ౧౫ | |
| ౩. హల్లులు | ౩౩ | |
| ౪. హల్లులకు వలసిన కొన్ని విశేషరూపములు | ౬ | |
| ౫. ఒత్తులు | ౩౮ | |
| చేరసి | | ౧౦౭ |
| ౧. ఇకారయుతమగు హల్లులు | ౩౪ | |
| ౨. ఎకారయుతమగు హల్లులు | ౩౪ | ౬౮ |
| చేరసి | ౧౭౫ | ౧౭౫ |

ఇందు ఇత్వ ఎత్వములను బ్రత్యేకముగాఁ జేయించుకొని హల్వర్ణముల శిరోభాగములం దతికించుకొనునట్లు చేసినచో ౧౦౭ అక్షరములే చేయింపవలసియుండును. ఇవియే హల్వర్ణములతోఁ గలిపిపోయించుకొనిన ౬౮ అక్షరము లధికమగుచున్నందున మొత్తము ౧౭౫ అక్షరములు చేయింపవలసియున్నది. అచ్చక్షరములలో పైకా (Pica) అక్షరములకన్నను, చిన్నవిగానుండు నక్షరములన్నియు నిట్లిత్వ ఎత్వములతోఁ గలిపి పోయించుకొనినచో నక్షరములపైభాగమున క్వాడ్లు (Quads) సర్దవలసిన శ్రమముండదుగాన, పని తేలికగాను త్వరగాను జరుగును. పైకా (Pica) కన్నను పెద్దవియగు నక్షరములకు ఇత్వ ఎత్వములఁ గలిపి పోయించవలసినపని యుండదు. అవి ప్రత్యేకముగా పోయించుకొనిన, పైఁ గనినట్టుల హల్లుల శిరోభాగమునం దతికించుకొనవచ్చును. చూడుఁడీ క్రొత్తమార్పున పూర్వముండిన ౯౦౦ అక్షరము లెట్లు ౧౦౭ అక్షరములకు తగ్గింపఁబడినదో! ఇయ్యది లాభకారి యగునో కాదో పాఠకులే యోచింతురు గాక! ఇందుఁ గన్నడపుకేసునందలి యక్షరములకన్నను నక్షరములసంఖ్య చాలవఱకు తగ్గిపోయినది. ఒక్క కన్నడలిపిమాత్రమే యననేల? నాగరము మున్నగు నితర లిపులకన్నను గూడ తగ్గిపోయినది. ఇంతకన్నను దీనిని తగ్గింప వీలుపడదు. ఒంట్లు, విరతులు మున్నగునవి ప్రత్యేకము.

ఇఁక ఒత్తులనుగుఱించి నాలుగుమాటలు వ్రాయవలసియున్నది. ఈఒత్తులలోనుగూడ రమారమి ౧౯ ఒత్తు

లవలకును హల్వర్ణములకుఁ బ్రక్కనే వ్రాయఁబడునవియే యైనందున నవి యెంతయును మన కార్యమున కనుకూలించియున్నవి. ఇఁక ౧౯ ఒత్తులు హల్వర్ణములకుఁ గ్రిందిభాగమున నుంచవలసియున్నవి. అవి మార్చుటకు వీలుపడదు. ఈఒత్తులను హల్వర్ణములకుఁ గ్రిందిభాగమున నుంచి ఖాళీస్థలమునందు క్వాడ్లునుంచి సర్దుకొనవలయును. ఇదియంత శ్రమమైనపనిగాదు. హాఫుబాడి(Half body) అను సర్ధపరిమాణముగల యక్షరములను జేయింపవలసిన యావశ్యకత లేదు. ఇప్పు డెట్లు పని జరుగుచున్నదో యింతకన్నను వేగముగనే పనిజరుగును. లినోటైపు, మొనోటైపు మున్నగుయంత్రములయం దీయక్షరముల నిముడ్చుకొనవచ్చును. టైపురైటరును జేయించుకొనవచ్చును. ఈ మన తెలుఁగులిపియందలి ఒత్తులన్నియు నాగరలిపిలోని **ग्र-द्ध-द्य-श्च-द्व-ङ्ग-द्ग** గ్ర-ద్ధ-ద్య-శ్చ-ద్వ-ఙ్గ-ద్గ- అను నిత్యాద్యక్షరములందలి యొత్తులవలెఁ గలిపి పోయించవలసిన యావశ్యకత లేక విడివిడిగా నుండుటంబట్టి, మన తెలుఁగులిపియే సర్వవిధముల శ్రేష్ఠమని చెప్పవలసియున్నది. ఒకటవ పటమునం దాయా వ్యంజనాక్షరమునకు సంబంధించినయొత్తును దానిదానిక్రిందఁ బ్రదర్శించియున్నాఁడను.

చూడుఁడు మూఁడవ పటము:— ఇందు మనము ప్రస్తుతము వాడుచుండెడి తెలుఁగు ముద్రాక్షర మంజూష (Telugu case) ను బ్రదర్శించి యున్నాఁడను. నాల్గవపటమునం దీ సంస్కరింపఁబడిన క్రొత్త యక్షరముల నుంచుట కనువుగా నుండునటుల రెండువిధములగు మంజూషలను బ్రదర్శించి యున్నాఁడను. అందు (A) మంజూష ౧౦౩ అక్షరములును, ఒంట్లు, విరతులు మున్నగునవి యిముడుటకును, (B) మంజూష ఇ కార ఎ కారయుతములగు వ్యంజనాక్షరములు గలిపిన ౧౩౫ అక్షరములును, ఒంట్లు, విరతులు మున్నగునవి యిముడుటకు ననువుగా నుండును. అంత పెద్దదగు కేసు ఇంత చిన్నదిగా మార్చఁబడినది. ఇయ్యది కంపోసిటరుల శ్రమను ఎంతయు తగ్గించును. ఇప్పుడు ఎనిమిదవ తొమ్మిదవ కారణములకు సమాధాన మీయఁబడినది. మచ్చునకు "శ్రీకాళహస్తి మాహాత్మ్యము" అను పదమును పుట ౧౯౩ చూడుడు. దానిని బరిశీలించి చూచిన నీ క్రొత్తయక్షరము లెట్లు కంపోజుచేయఁబడునది బోధపడఁగలదు.

ఇప్పుడు నేఁజేసిన మార్పులచొప్పున నీ తెలుఁగు లిపి ముద్రించినఁ గాని, వ్రాసినగాని యెట్లు లుండునో పాఠకమహాశయులకుఁ దెలియుటకై కొన్ని సంస్కృత శ్లోకములను, కొన్ని తెలుఁగుపద్యములను నైదవ ఆఱవ పటములందుఁ బ్రదర్శించియున్నాఁడను. వానిని జూచినఁ దేటపడఁగలదు.

మనము ముద్రణకలయందుఁ జాల వెనుకఁబడియున్నారము. మనలిపికి సన్నిహితమగు కన్నడలిపియం దన్నియొరకములగు ముద్రాక్షరములు చేయింపఁబడియున్నవి. వాటిని జూచియును మనవారి కీవిషయమున శ్రద్ధపుట్టకుండుట చాల శోచనీయము. మనము ప్రస్తుతము రెండుమూఁడురకములగు నక్షరములనే వాడుచున్నారము. అవి చాలవు. ఆంటిక్కులు (Antiques) మున్నగు వివిధములయిన ముద్రాక్షరము లావశ్యకములై యున్నవి. అవన్నియు నుండినఁగాని గ్రంథములను మనోహరముగా నుండునటుల ముద్రించుటకు వీలుపడదు. సంస్కృతగ్రంథములు విశేషముగా ముద్రింపఁబడుట వలన, కర్ణాటకదేశమందేమి, ద్రవిడదేశమందేమి, ఇతరస్థలములందేమి, మన తెలుఁగులిపియే కన్నడము మున్నగు నితరలిపుల కన్నను, మిక్కిలి ప్రచారము గల్గియున్నది. ఇట్లు విశేషవ్యాప్తిఁ జెందియు, ముద్రణ విధానమునందు మాత్ర మితరలిపులకన్న వెనుకఁబడి యుండుట యెంతయు నవమానకర మైనవిషయము. పెద్దపెద్ద యక్షరములు లేనందున వార్తాపత్రికల విషయ సంగ్రహములను బ్రదర్శించెడి పోస్టర్లు ముద్రించుటకు వీలుగాకున్నది. ద్రావిడాద్యన్యభాషాపత్రికల పోస్టర్లు పెద్ద యక్షరములతోఁ దద్దయు రమణీయముగా ముద్రింపఁబడుచున్నవి. మన మేల యటుల ముద్రింపఁజాలకున్నారము? మన కీ ముద్రణవిషయమునందలి నిర్లక్ష్యభావమే. ఇఁకనైన నీ విషయమున మనవారు శ్రద్ధపుచ్చుకొనవలెను.

ఇందు నే నూచించిన కొద్దిమార్పులతో సంస్కరణ మొనరించి, ముద్రాక్షరములను జేయించి గ్రంథములను ముద్రించినచో, నితోధికముగాఁ బ్రచారము గల్గి లిపులతలమానికమై యీ తెలుఁగులిపి వెలయఁగల దని చెప్పుచున్నాఁడను. భాషాభిమానులు వెంటనే యీవిషయమున శ్రద్ధవహించి, కార్యరంగమునఁ బ్రవేశింతురుగాక!

ఎవ్వరేని భాషాభిమానులు ముద్రాక్షరనిర్మాణకార్యాలయమును స్థాపించి యీమాతన ముద్రాక్షరములను జేయింపఁ బూనుకొందురేని, నా వల్లనైన శరీరకష్టము పడి యాపనిని పూర్తిగావించుటకు సర్వదా సంసిద్ధుండనై యున్నాఁడను.

అచిరకాలములోనే టైపురైటరు విషయమై కొన్ని విషయములను వ్రాసి, పత్రికాముఖమునఁ బ్రకటింప నుద్దేశించి యున్నాఁడ.

# శ్రీకాళహస్తిమాహాత్మ్యము

[సర్వస్వామ్యములు వ్యాసకర్తవి.]

---

## ప్రేమపరీక్ష

శ్రీ శివశంకరశాస్త్రిగారు

(ద్వితీయ ఘట్టము)

లోన సదనాంతరంబున వితర్దికపై నుపవిష్టయై ప్రసా
ధని గొని, భిత్తిపై నిడుదదర్పణమందు ముఖాంబుజాతముం
గనుగొని, వాలియున్న యలకల్ సవరించుచు, పార్శ్వకేశముల్
వెనుకకు దువ్వి, రాధ ఘనవేణిని దాల్చె బ్రసూనదామమున్.

తిలకము ఫాలభాగమున దీర్చి, కనుంగవ నున్నకాటుకం
జెలువుగ దిద్ది, హారములు చిక్కు తెమల్చి, విలోలకర్ణకుం
డలముల కాంతి పుంజములు నాట్యము సేయ గపోలపాళి, నా
కలికి లసత్కచాంశుకము కట్టుకొనెన్ దరహాసరేఖతోన్.

రుచిరము కానిదో నయనరోచక మైనదొ గోపకామినీ
ప్రచయ మనోధినాథునకు ప్రస్తుతమండన మించు నెంతయున్
విచలితచిత్త రాధ నిజవేషము మార్ప దలంచు నంతలో
నచటికి నేగుదెంచినది యామె సఖీమణి తొట్రుపాటునన్.

కనుగొని యామె నెచ్చెలిని కౌగిట జేర్చి "వచింపు నందనం
దను డెట నున్నవా డిపుడు? తప్పక వత్తు నటంచు దూతికం
బనిచెను జామ్ముక్రింద యమునాతటసాంద్రతమాలవాటికిం
జని నిను బంపలేదు గద చయ్యన నన్గొని పోవగా సఖీ?

అత డరుదెంచి నీవెనుక నంగణమందలి పొన్నచాటునన్
ద్రుతగతి డాగి నామనసు ధూర్తత బూని పరీక్ష సేయునా?
మఱి యొకవేళ మారి నను మాట చెవిం బడవేయ బంపెనా
కితవుడు నిన్ను నాకడకు కేవలముం గరుణావిహీనుడై?

చెలి, యిది యేమి నీవదనసీమ వివర్ణత గాంచె, దీర్ఘమై
వెలువడు నూరుపుల్, తెలుపు వేగమె వార్త" యటంచు శంకమై
బలుకగ రాధికావదనపద్మము జూడగ లేక భూమిపై
నిలిపి విలోకనంబులను నెవ్వగతోడ విశాఖ యిట్లనున్ :—

"అరుగుచునుంటి నందునిగృహంబున కేను, తదీయదాసి స
త్వరగ మనమ్ముతో నెదురు వచ్చుచు నుండగ నేను దానితో
'బిరబిర బోయె దెచ్చటికి భీతకురంగమువోలె చెప్పుమా
విరజ' యనంగ 'కృష్ణుకయి వెజ్జును బిల్వగబోదు నెచ్చెలీ!'

అనుటయు నాపె, నేను భవదంతికమం దెటో వచ్చి వాలినా
ననుగు సఖి, భవత్ప్రియున కంతతటాలున నేమి బాధయో
కను గొనగా దలం పపుడు కల్గనె లేదు విలోలమానసం
బున జనుచున్న నా, కిపుడు పోయి కనుంగొని వత్తునా చెలీ?"

ఇటు వగతోడ నామె వచియింపగ, రాధికమోము వెల్లనై
తటుకున పార్శ్వమందలి వితర్దికమీదను వ్రాలి యుష్ణమై
బొటబొట బాష్పబిందువులు భూమిపయిం దొరగంగ, గుండియల్
తటతట లాడ, శోకరసదైవతమో యన నుండె నత్తరిన్.

"నిలువగ జాల నే నిచట నెచ్చెలి, నందకుమారు జూడ బో
వలయును తత్‌క్షణం"బనుచు వ్యాకులగద్గదభుగ్నకంఠయై
పలుకగ రాధ, యామె చెలి పాణి యొసంగుచు లేపె వేదికా
తలమున నుండి గోపహిమధాముని ధామము జేర్చుకోరికన్.

---

# శబరి



చింతా దీక్షితులు గారు

రామాయ రామభద్రాయ, రామచంద్రాయ వేధసే;
రఘునాథాయ నాథాయ, సీతాయాః పతయేనమః.

౧

[మతంగమహామునివనము. అందులో ఆశ్రమము. చుట్టూ పెద్దవీ చిన్నవీ చెట్లు. చెట్ల నల్లుకొని తీగలు. అన్నిటికీ వాడనిపువ్వులు. చెట్లమధ్యకుటీరము. ఆ కుటీరము చూరుకు కట్టిన తడికాషాయవస్త్రములు. కుటీరములో కృష్ణాజినములూ, వ్యాఘ్రాజినములూ కనుపిస్తున్నవి. అరుగుమీద కమండలమూ రెండుమూడు దండములూ పడి ఉన్నవి. వాటి కెదురుగా కుటీరము ముందు ఒక నెగడులో కర్రలు కాలుతూ పొగవస్తున్నది. కుటీరముకు కుడిపక్క ఇంకో చిన్న పూరిగుడిసె. వెనుక చెట్లమధ్యనుంచి సముద్రపునీరు అవుపిస్తున్నది. దూరముగా ఆకాశము నిర్మలముగా కనుపిస్తున్నది. కుటీరములకు రెండు ప్రక్కలా కొండలు ఏటవాలుగా ఉన్నవి. వాటిపక్క చెట్లూ పెద్దపెద్దరాళ్లూ ఉన్నవి. రాళ్లమీద కోతులు ఆడుకొంటున్నవి.

కుటీరానికి ముందు పంపాసరస్సు. దానికి తూర్పుగా ఋష్యమూకపర్వతము. పర్వతముమీద నుంచి సూర్యు డప్పుడే ఉదయిస్తున్నాడు. సూర్యుని పసుపు కిరణాలు పంపాజలములమీద కుటీరములమీదా పడ్డవి.

కుటీరముల ముందుభాగ మంతా అలికి ముగ్గులు పెట్టివున్నది. అక్కడ శబరి నిలబడి ఉన్నది. శత సంవత్సరముల వయస్సుండవచ్చు. తల సగము నెరిసింది, అట్టకట్టి ఉంది. ఆడుబ్బుజుత్తు నడినెత్తిమీద ముడి వేసుకొన్నది. మొలచుట్టూ కృష్ణాజినము చుట్టుకొన్నది. మెడలో రుద్రాక్షమాల వేసుకొన్నది. మెడలో ఒళ్లు పటిమతగ్గుతూ ఉన్నట్లుంది. నల్లనిశరీరము, కోల మొగము, మొగము వెంగ సూచిస్తున్నది. శబరిముందు విభూతిబుర్రలూ రుద్రాక్షమాలలూ కావిదోవతులూ కమండలం బుర్రలూ దండాలూ ఉన్నవి. ఇంటి ముందున్న నెగడిలోకి పుల్లలు తోసి అరుగుమీది దండములూ కమండలమూ తీసుకొంటూ ఉండును.]

శ బ రి

అయ్యో, అయ్యో, ఎలాగ బతకడం! విడిచిపెట్టి ఎలాగ బతకడం! ఇక గడియకో అరగడియకో వస్తుంది కాబోలు విమానం! విమానం వచ్చాక - అమ్మయో! వచ్చాక- వచ్చాక- నే నెలాగ బతకడం!

[శబరి గబగబా కృష్ణాజినాలు చుట్టపెట్టి కట్టలుగా కట్టడం, రుద్రాక్షమాలలు వేరు వేరుగా చిక్కుపడకుండా ఉంచడం మొదలైన పనులు చేస్తుంది.]

తపస్సు అయింది కాబోలు వస్తున్నారు గురువుగారు! ఆయన వస్తువు లన్నీ ఆయనకు వప్ప చెప్పాలి. అయ్యో, ఈవేళ ఇంతే మంద మతి వచ్చిందేమిటి నాకు? అప్పుడే సూర్యోదయ మయింది. ఇంకా దర్భలూ పువ్వులూ తేనేలేదు.

[తూర్పుగా గబగబా నడుస్తూ వెళ్లుతుండగా మతంగముని పెద్దకుటీరములోనుంచి బయటికి వస్తాడు. అతడు ముసీలి పండు. తెల్లటిజడలజుట్టు నడినెత్తిమీద ముడి వేసుకొన్నాడు. తెల్లటి పొడుగాటిగడ్డం రెండుపాయలు తీసి మధ్యకు ముడి వేశాడు. కాషాయ వస్త్రం ఒకటి కట్టుకొన్నాడు. ఇంకోటి కప్పుకొన్నాడు. నల్లనిశరీరము. ముఖమునుంచి బ్రహ్మవర్చస్సూ, కళ్లలోనుంచి సాత్త్విక తేజస్సూ, బయటికి వస్తున్నవి. చేతివేళ్లకు దర్భాంగుళీయా లున్నవి. పాంకోళ్లమీద నడుస్తున్నాడు. చిరునవ్వుతో శబరిని చూచి నెగడు ముందు నిలబడి]

మ తం గు డు

శబరీ! శబరీ! ఎక్కడికి వెళ్లుతున్నావు?

శ బ రి

[కంగారుపడి వెనక్కువచ్చి మతంగుడికి సాష్టాంగ నమస్కారము చేసి]

స్వామీ! స్వామీ! అపరాధం వచ్చింది. దర్భలూ పువ్వులూ...

మ తం గు డు

లే, లేచి నిలుచో; ఈవేళ తపస్సు చెయ్యడం అయిందన్నసంగతి మరిచావు. ఈవేళతో నాకూ నీకూ సరి. ఈఆశ్రమం...

శ బ రి

[లేచి నిలుచుండి చేతులు జోడించుకొని]

అవును స్వామీ! మందమతిని. ఈవేళ వెళ్లుతారనే మీవస్తువు లన్నీ చేర్చి మూటలు కట్టి—

మ తం గు డు

[మీసం గడ్డం మధ్యనుంచి నవ్వుతూ]

అయ్యో, వెర్రితల్లి; నేటికి నాతపస్సు ఫలించింది. ఇంకో అరగడియకు నా వనాన్నీ ఈనాఆశ్రమాన్నీ నీకు నప్పచెప్పి వెళ్లుతున్నాను గదా! ఇంకా పువ్వులూ దర్భలూ ఎందుకూ!

శ బ రి

[నోరు తెరిచి శూన్యదృష్టితో మతంగుని చూచి]

స్వామీ! స్వామీ! [అని మోకాటబడుతుంది]

మ తం గు డు

[దగ్గిరికి వచ్చి లేవదీసి తల తడుముతూ]
ఇంత దిగు లెందు కమ్మా వెర్రితల్లీ!

శ బ రి

స్వామీ! చిన్నప్పటినుంచీ మీపూజకు పువ్వులు కోయడంవల్ల నావేళ్లు కాయలు కాచినవి. దర్భలు కోయడంవల్ల చేతులు కాయలు కాచినవి. నెగళ్లకు కర్రలు మోయడంవల్ల బుజాలు కాయలు కాచినవి. ఇక మిమ్మల్ని చూడకుండా ఉంటే నాకళ్లు కాయలు కాయవా?

మ తం గు డు

నీపరిచర్య నాహృదయాన్ని ఆకర్షించింది. గురువులకు పరిచర్య చేసేవారికి ఇష్టసిద్ధి కలగకుండా ఉంటుందా అమ్మా!

శ బ రి

నాభక్తికి ఇంతవరకూ మీరే లక్ష్యము.

ఇప్పుడు నాకటువంటిలక్ష్యము లేకపోతే నేను జీవించగలనా ?

మతంగుడు

అటువంటిలక్ష్యము నీకు చూపకుండా వెళ్లనులే !

శబరి

అమ్మో ! వద్దు నా కితరలక్ష్యాలు వద్దు. నాకు మీ సన్నిధానమే స్వర్గము. మిమ్మలిని విడిచి ఒకక్షణమైనా ఉండలేను.

మతంగుడు

[రుద్రాక్షమాల ఒకటి కుడిచేతితో తీసుకొని ఇటూఅటూ తిప్పి చూస్తూ]

ఎన్నిమాట్లు నీకు చెప్పలేదు భౌతిక వస్తువులమీద మోహము పెట్టుకో రాదని ? స్త్రీస్వభావాన్ని జయించలేకపోతివి గదా అని వగస్తున్నాను.

శబరి

[భయముతో] మీరు సంతోషముగా ఉన్నప్పుడు మీకు నేను వగపు తెచ్చిపెట్టి అపచారము చేస్తున్నానా! స్వామీ! మనస్సు దిటవు చేసుకొంటున్నాను. కాని—

మతంగుడు

[ఉత్సాహము చూపుతూ] కాని ?

శబరి

భౌతికవస్తువు లన్నారు. నాకు భౌతిక వస్తువులమీద కోరిక లేదే? మిమ్మలిని అందులో కలుపుకోవడం న్యాయమా ?

మతంగుడు

ఇప్పుడు నే నయ్యాను. రేపు ఇంకోటి కావచ్చు.

శబరి

నాయిష్టదైవతము కారా మీరు ?

మతంగుడు

నామీద భక్తికొద్దీ ఈరీతిగా అంటున్నావు కాని నీయిష్టదైవతము వేరు. నాద్వారా నీయిష్టదైవతము సిద్ధించవచ్చు.

శబరి

[సందేహముతో]

నాయిష్టదైవతము వేరా? వేరా? పోనీ వేరైతేనేమి? మీసన్నిధానంలోనే ఉండి నాయిష్టదైవాన్ని నే పొందరాదా? మీతోరా రాదా నేను ?

మతంగుడు

నీభక్తి యింకా ఫలించ లేదు శబరీ! సగంమట్టుకు మాత్రం నీప్రయాణ మైనది; మిగిలినసగం పూర్తి చేస్తేనే కాని......

శబరి

ఎలాగ చెయ్యడం ?

మతంగుడు

ఇక్కడ నీ వొక్కర్తెవూ ఉండి......

శబరి

అమ్మయ్యో ! ఉండలేను, ఉండలేను ! స్వామీ, రక్షించవా ?

మతంగుడు

ఏమిటి ఈపామరత్వము శబరీ ! ఇంత కాలమూ నీవుచేసిన సాధన యీరోజున మంటకలుపుతావా ?

శ బ రి

నేను మీతో రా లేకపోతే బతికే సాధనం......

మ తం గు డు

అలాగ అడుగు, చెప్పుతాను—ఇంత వరకూ నీవు పరిచర్య చేస్తూ ఉండడమువల్ల నీమనోభీష్టము సిద్ధించడానికి అవకాశము కలిగింది. పామరత్వము విడిచి ఇకముందు కూడా భక్తిశ్రద్ధలతో, పాటుపడితే మోక్షము నీ కరిచేతిలోదే అవుతుంది.

శ బ రి

గురువుగారిఆజ్ఞ నాకు అనుల్లంఘనీయము కదా!

మ తం గు డు

నన్నెడబాయడంవల్ల నీకు విచారము కలుగగూడదు సరికదా, సంతోషం పొంగి పొరలాలి.

శ బ రి

నా హృదయము విశాల మైతే మీకూ నాయిష్టదైవతముకూ అందులో చోటుండ వచ్చు గదా!

మ తం గు డు

సరే, కాని నేనే నీహృదయమంతా ఆక్రమిస్తున్నా నిప్పుడు. అందుచే నీయిష్ట దైవతానికి చోటుండదు. కాబట్టి నేను వెళ్లుతున్నప్పుడు సంతోషము చూపిస్తూ నన్ను దిగబెట్ట వలసి ఉంటుంది. తరువాత...

శ బ రి

సరే, విచారము దిగమింగుకొన్నాను. మీకు సమ్మతమైన విధముగానే ఆచరిస్తాను. కాని...

మ తం గు డు

పరార్థముకై ఆత్మార్పణము చేయడములో నీవు అగ్రగణ్యావన్నమాట ఎరుగుదును...

శ బ రి

కాని......

మ తం గు డు

నీహృదయము బోధ పడ్డది. నావసము కనిపెట్టుకొని ఉండు. ఈ ఆశ్రమము యథా విధిగా ఉంచు. నేను లేకపోయినా ఉన్నట్టే నీహృదయము గ్రహిస్తుంది. అయినా...

శ బ రి

సరే స్వామీ!

మ తం గు డు

అయినా, నాఆర్ద్రవల్కలములూ నారు ద్రాక్షలూ నాదండకమండలాలూ నా అజినములూ నీవశము చేస్తున్నాను. వాటివల్ల నీకు సంతృప్తి కలగవచ్చు.

శ బ రి

శిష్యులకు గురువు లెంతప్రియులో వారి యిష్టవస్తువులుకూడ అంతప్రియము లేకదా!

మ తం గు డు

ఇక నీవు ఇక్కడ చేయవలసిన పని సంగతి చెప్పుతాను విను.

శ బ రి

స్వామీ! తమ రాజ్ఞ యిచ్చినవిధంగా ప్రవర్తిస్తాను. కాని ఆపనులకు అంతరాయాలు కలుగుతవేమో?

మ తం గు డు

ఏలాగు?

శ బ రి

అప్పు డెప్పుడో వాలి దుందుభిని చంపి ఆ మృతకళేబరము స్వామివారి ఆశ్రమములో పడవేసి శాపము పొందినాడు.

నేను ఆడుదానను, ముసలిదానను, ఆత్మ సామర్థ్య మెరుగనిదానను.........

మ తం గు డు

ఇకముందు అట్టిపనులు జరుగకుండా రక్ష చేస్తున్నాను.

శ బ రి

మృగభయము, రాక్షసభయము, కిరాత భయము......

మ తం గు డు

నీయిష్టములేనిదే ఎవ్వరూఇక్కడికి రాలేరు.

మృగాదులు నీకార్యాలకు తోడ్పడుతవే కాని అంతరాయాలు కల్పించవు. ఇక విను...

శ బ రి

సావధానను స్వామీ!

మ తం గు డు

ఇంతదాకా న న్నేరీతిగా కొలుస్తున్నావో ఆరీతిగా నీయిష్టదైవాన్ని కూడా కొల వాలి శబరీ!

శ బ రి

మనస్సులోనా స్వామీ?

మ తం గు డు

మనోవాక్కాయాలతో.

శ బ రి

నాయిష్టదైవతం ఎవరో నాహృదయం కనుక్కోలేకుండా ఉంది స్వామీ!

మ తం గు డు

నీమనస్సులో ఎప్పుడూ ఒక్కటేమూర్తి నిలవాలి. ఒక్కమూర్తినామమే నీ వెప్పుడూ నాలుకపై నివసింప చేయాలి. ఒక్కమూర్తిని గురించే నీవు సకలకార్యములూ ఆచరించాలి.

శ బ రి

ఇంతవరకూ మీావిషయములో సంచరిస్తున్నట్లేనా?

మ తం గు డు

అంతకన్న వెయ్యిరెట్లు భక్తితో, ఆవేశముతో.

శ బ రి

ఎవరిని గురించి స్వామీ?

మ తం గు డు

సర్వకాలసర్వావస్థలయందూ ఒక్కటే పని. నిలుచున్నప్పుడు, పండుకొన్నప్పుడు, భుజించేటప్పుడు, మాటాడేటప్పుడు......

శ బ రి

మేలుకొన్నప్పుడు, నిద్రించేటప్పుడు, కల గాంచేటప్పుడు........

మ తం గు డు

జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలోఒక్కటే మూర్తి, ఒక్కటేధ్యానము, ఒక్కటేకోరిక, ఒక్కటేపరమావధి.

శ బ రి

ఎవరు నాయిష్టమూర్తి దేవా!

మ తం గు డు

ప్రకృతి యిచ్చే సౌందర్యమంతా ఆమూర్తికే ధారపొయ్యాలి. మానవహృదయంలో ఉండేమాధుర్యమంతా ఆమూర్తికోసమే వెచ్చించాలి. శరీరంలో ఉన్నఓపిక అంతా ఆమూర్తిపూజకే వినియోగించాలి.

శ బ రి

ఆదివ్యమూర్తి యెవరు స్వామీ?

మ తం గు డు

లోక మంతా నీవు వశం చేసుకోవాలి. నీమూర్తికి నీవు వశం కావాలి.

శ బ రి

ప్రేమామృతం చల్లితే వశం కాని దేమిటి? అలాగే లోకాన్ని వశం చేసుకొంటాను. కాని నాదివ్యమూర్తిపేరు చెప్పారు కారు.

మ తం గు డు

లోక మంతా నీకు ఒక్కస్వరూపమై ఉండాలి. ఆస్వరూపము ఈ దివ్యమూర్తి. లోకానికి ఆ మూర్తి నీలో గోచరము కావాలి.

శ బ రి

నేను విద్యావిహీనురాలను. నవరదాసను. నాకు సాధ్యమేనా స్వామీ యీపని?

మ తం గు డు

నీవు నా శిష్యురాలవు అన్నిటికన్న ముందు! నీకు సాధ్యము కాని దేది?

శ బ రి

ఎవరు నా యిష్టదైవతము, నా మనోహరమూర్తి, నా ప్రణయలక్ష్యము? సెలవియ్యరు స్వామీ!

మ తం గు డు

నాకు పరిచర్య చేయడంవల్ల కాయలు కాచిన నీచేతులు నీమూర్తిని పూజించడానికి సముచితములు. నాకోసము నీకళ్లు కాయలు కాయవు. నీ మూర్తికోసము నిరీక్షించడము వల్ల నీకళ్లు కాయలు కాయాలి.

శ బ రి

ఎవరు నాయిష్ట దైవతము స్వామీ?

మ తం గు డు

నిరీక్షణములో విసు గుండరాదు. ఆశలో విచార ముండరాదు. అప్పుడు నీ దివ్యమూర్తి నీకు ప్రత్యక్షమవుతాడు.

శ బ రి

ప్రత్యక్షమే! ఎంత అదృష్టవంతురాలను! ఎవరు నాదివ్యస్వామి దేవా! నా హృదయం వారి పరిచర్యకై అప్పుడే తొట్రుపడుతున్నది.

మ తం గు డు

అయితే విను. సాధురక్షణము చేయడానికీ, దుష్టశిక్షణము చేయడానికీ పరమేశ్వరుడు భూమిమీద అవతరిస్తూ ఉంటా డని చెప్పినాను, జ్ఞాపకమున్నదా!

శ బ రి

జ్ఞాపకము లేకేమి? ఆ రవతారముల చరిత్ర కర్ణ రసాయనముగా విన్నదానసే.

మ తం గు డు

ఏడవ అవతారపురుషుడు ఉదయించి నాడు.

శ బ రి

ఏమిపుణ్యం! ఏమిపుణ్యం! నాజీవితకాలంలో అవతారపురుషుడు! ఎక్కడ? ఎప్పుడు? ఎవరు?

మ తం గు డు

అయోధ్యలో, ఇరవై యెనిమిదివత్సరము లైనది. దశరథమహారాజుకు కౌసల్యాదేవికి ముద్దులకొడుకై అవతరించినాడు శ్రీమన్నారాయణమూర్తి.

శ బ రి

ఎంతటిపుణ్యపురుషులో వారు-భగవంతుని పొత్తిళ్లలో పెట్టుకు ముద్దాడ గలగడానికి!

మ తం గు డు

ఆమహాపురుషుని శరీరకాంతి ఆకాశము. కన్నులతెజము సూర్యచంద్రులు. అతనినవ్వులలో నక్షత్రపు తళుకులు. ప్రకృతి అతని విగ్రహములో ప్రతిఫలిస్తున్నది. అతనిదక్షిణ బాహువులో అమృతమూ, హాలాహలమూ కూడా కలవు.

శ బ రి

హాలాహలమే!

మ తం గు డు

దుష్టుల కది హాలాహలము, శిష్టుల కమృతము.

శ బ రి

ఆ పరమపురుషునిపేరు?

మ తం గు డు

లోకాతీతుడైనపరమాత్మ పాంచభౌతిక శరీరముధరించి వచ్చినాడు.

శ బ రి

ఆ మహాపురుషుడే నాయిష్టదైవతము. నాహృదయ మాయనకోసము అప్పుడే తొందరపడుతున్నది.

మ తం గు డు

పధ్నాలుగుసంవత్సరములు వనవాసము చేసి పితృవాక్యపరిపాలనము చేయదలచినాడు.

శ బ రి

ఎంతకష్టము! ఎందుకోసమో అవతార పురుషున కీకష్టములు?

మ తం గు డు

సర్వమూ నీకు ముందుముందు తెలియ గలదు. ఆయన నీకోసము వచ్చి నీ అభీష్టము నెరవేరుస్తాడు.

శ బ రి

నాయిష్టదైవతాన్ని ఎలా ఆరాధిస్తానో గదా! ఎలా ఆదరిస్తానో గదా!

మ తం గు డు

అతనిస్మరణ నీవెప్పుడైనా మరచినా నాఉపదేశక్రమము తప్పినా...

శ బ రి

గురువుగారి ఆజ్ఞ ఎన్నడైనా యీ సేవ కురాలు మరిచిందా!

మ తం గు డు

అతని పవిత్రనామమే నీకు శరణము. వింటివా? ఆమహామహునిపేరు శ్రీరాముడు.

శ బ రి

[ఉత్సాహముతో నవ్వుతూ గంతులు వేస్తూ]

శ్రీరాముడు, శ్రీరాముడు, శ్రీరాముడు!

మ తం గు డు

శ్రీరామనామ స్మరణము ఎల్లప్పుడూ చేస్తూఉంటే శ్రీరామచంద్రుడే నీకు ప్రత్యక్షమవుతాడు.

శ బ రి

గురువుగారికి నామీద ఎంత అనుగ్రహము!

మ తం గు డు

ఇప్పుడు ఆమహారాజు చిత్రకూటము ప్రవేశించినాడు.

శ బ రి

నిరీక్షిస్తాను ఆమహాత్ముని దివ్యసందర్శనార్థము, స్వామీ!

మ తం గు డు

మరవరాదు సుమా, చింతనమూ సేవా.

శ బ రి

నా హృదయముపైన ఆ దివ్యనామము అచ్చుగుద్దినట్లు అయింది. అప్పుడే స్వామీ, మీఉపదేశప్రభావముచేత.

మ తం గు డు

శ్రీరామపాదసేవ చేసినపిమ్మట నాదగ్గరకు స్వర్గానికి రాగలుగుతావు శబరీ!

శ బ రి

చిత్తము స్వామీ! ఉపాసనామార్గము నాకు చూపరా స్వామీ!

మ తం గు డు

శబరీ! శ్రీరామనామోచ్చారణకు మించిన మంత్రములేదు. శ్రీరామచరణసంస్మరణానికి మించినపూజ లేదు. కాబట్టి అలా చెయ్యి. పునశ్చరణ మరవకుమా!

శ బ రి

నాతండ్రి! నాతండ్రి! పునశ్చరణ మరవను స్వామీ! మరవను. మీరు నాకిచ్చిన ఈ ఆధారాన్ని వదిలిపెట్టి నేనేమి కావలసినది? శ్రీరామచంద్రమూర్తి తప్ప నాకు ఈ లోకములో కావలసినదింకేమున్నది స్వామీ?

మ తం గు డు

అదుగో వస్తోంది విమానం. శబరీ, వెళ్లుతాను.

[మతంగుడు మోకరించిన శబరితలపై చేతు లుంచి]

నీఅభీష్టము నెరవేరును, శబరీ!

[అని ఆశీర్వదించును]

[కనులు మిరుమిట్లు గొలిపే విమానము భూమికి దిగును. మతంగుడు అందులోకి ప్రవేశించును. శబరి అతడు ఎక్కేటప్పుడు బయట

విడిచిన పాదుకలు చేతితో ఎత్తి ముద్దుపెట్టుకొని శరీరమును వాటితో తాకి విమానములో పెట్టును.]

వెళ్లుతా, శబరీ. మరిచిపోకుమా నాఉప దేశము!

శ బ రి

చిరకాలపరిచయమువల్ల కలిగిన ప్రేమకు ఎడబాటు...

మ తం గు డు

చూడు, శబరీ. నేను యాగము చేసిన స్థలము లన్నీ మారకుండా ఒక్కమోస్తరుగా ఉంటవి సుమా!

శ బ రి

చిత్తము.

మ తం గు డు

అవి తపోమహిమ కోల్పోవు. నేను స్నానము చేయడానికి తెప్పించిన సప్తసాగరములూ నీవున్నంతవరకూ ఇక్కడనే ఉంటవి. నాతడి బట్టలు నీవున్నంతవరకూ ఆరీతిగానే ఉంటవి.

ఈనాడు ఏరీతిగా ఈవనములో పుష్పములూ, చిగుళ్లూ ఉన్నవో ఆరీతిగానే నీవు ఇక్కడ ఉన్నంతవరకూ ఉంటవి. అవి వాడవు, రాలవు.

శ బ రి

చిత్తము స్వామీ! వాటిలో మి మ్మెప్పుడూ చూస్తూ ఉంటాను.

మ తం గు డు

నేను నీహృదయానికి గోచరుడనే శబరీ! కాని నీహృదయం శ్రీరామమూర్తిది సుమా!

[విమానము పైకి లేచును]

శ బ రి

వెళ్లుతున్నారా, నామహాస్వామీ!

[విమానము ఆకాశానికి క్రమక్రమముగా లేచును. శబరి రెప్పవేయకుండా దానికేసి చూస్తూ కన్నీరు కార్చును.]

మ తం గు డు

వెళ్లుతున్నా నమ్మా! నావెర్రితల్లీ! శబరీ!

శ బ రి

మహాస్వామీ! మతంగమహామునీ! అప్పుడే వెళ్లిపోతున్నారా?

మ తం గు డు

[ఆకాశమునీద విమానములోనుంచి]

దిగడు శబరీ, దిగడు. వెళ్లుతున్నా దివమునకు! మరిచి పోకుమీ!... శ్రీ రామచంద్రుడు.

శ బ రి

[విమానము కేసి చూస్తూ]

శ్రీరామచంద్రుడు! శ్రీరామచంద్రుడు!

[విమానము అదృశ్యమయ్యేవరకూ దానికేసి చూచిచూచి అది అదృశ్య మయిన తరువాత కూడా అటే చూస్తూ చేతులు జోడించి]

నామహాస్వామి, నామహాస్వామి, శ్రీరాముడు, శ్రీరాముడు. నమస్కారము స్వామీ! శ్రీరాముడు.                    [తె ర]

(తరువాయి గలదు.)

# గౌతమీ!

కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులు గారు

తరుణి! గౌతమి! ఏధన్యతముని జీవ
నముల నిలుపఁగఁ దలఁచితే రమణుఁడంత
రంగమునఁజొచ్చి కలఁచె? నుత్తుంగ భూధ
రాగ్ర సానువులందుండి రయమున దిగి
విసురుగా నేగుచుంటి నీ వింతహొయలఁ
గాంచి మెటకేగెదనుచుఁ బ్రశ్నించు టసుధ
మాఁగదా? ఏమె? అని వెన కాడితమ్మ
ప్రణయలక్ష్యంబు; గమనింప బయలువడదె?

* * *

మొన్న నానాను మేఘుఁ డానన్నుఁడై న
గాగ్రపర్యంతభూముల నధివసించె
నతఁడు నీతోడ నేమేమొ ఆలపించె
నతని గంభీరభావ ణావ్యక్త కలక-
లారవమె దిగ్వితాన మలంకరించె
నద్రిగుహాలెల్ల మారుమ్రోగె నపుడమంద
మారుతకిశోరసంతతుల్ మలసెఁ బ్రియుని
ప్రేమవార్తామృతంబు వర్షించె ననుచుఁ
గాదె ఉప్పొంగి తలమెత్తి తాదరమున?

* * *

అతఁ డందిచ్చినాఁ డేదొ? అందికొంటి
వర నిముసమేనిఁ బట్ట దొయ్యారివాదు
తళ్కుమనునంతలో లోన దాఁచికొంటి
వింతనెఱజాణతనము నీచెంతఁగలదె?

* * *

ధగధగను మెఱసె మీననేత్రాంచలంబు
చకచకితభావ బంధురాశ్చర్యలలిత
కళలదీపించె కనకరేఖామయూఖ
మాలికాలోలమణి సముత్కలితాంశు-
మండలము నిండ నాకాశ మండలమున

* * *

అదియ కావచ్చు నీప్రియుఁ డంపినట్టి
కనుల మిఱుమిట్లు గొలుపు బంగారు మెఱపు
వలపుకమ్మ; అదెంతగా వ్రాసినాఁడొ?

* * *

మగఁడు రత్నాకరుండు శ్రీమంతుడౌట
అదియ కా దెంతసుభగుఁడో; అతడెంత
రసిక శేఖరుఁడో; యనురాగ మడర
జాతిరత్నంబులేర్చి కాంచనపు రేక
లకు నమర్చి సువర్ణ మాలికలు నేర్చి,
ప్రణయరసవాహినులు పొంగిపరువులెత్త
నాత్మభావంబులందు సువ్యక్తపరచి
ప్రాణినంతాపహరుఁడు జీవనప్రదుండు
నైనదూతకు నిచ్చి నీయంతికమున
కంపినాఁ డెంత వాల్లభ్య మమరె నమ్మ!

* * *

ప్రణయరసభావ బహిరభివ్యక్తలీల
లెటులేఁగి, యూహించి పలుకుట లింతెకాని;
సహజసరళ ప్రశాంత శాశ్వతనిగూఢ
నిస్తులప్రేమరసవాహినీతరంగ
మాలికాడోలికలను నుయ్యాలలూఁగు
ప్రణయిజనమాన సాంభోజ పరిమళములఁ
బట్ట నుంకింప నెవ్వరివశము తల్లి?



# ఎంత పని చేశారు!

కర్త
పూడిపెద్ది
వెంకటరమణయ్యగారు.



౧

కామేశ్వరరావు:— ఓధానులు గారూ, మీకుఱ్ఱవాడి కెన్నోయేడూ?

అవధానులు:—పదహారు వెళ్లేయి బాబూ!

కామే:—ఏమిటి చదువుతున్నాడు?

అవ:—మొన్ననే కూలిపైని ప్రాసు చేసేడు.

కామే:—అతనికి వివాహం చెయ్యారా?

అవ:—తగిన సంబంధం వస్తే చెయ్యకేంచేస్తాను?

కామే:—ఇంకాచదివిస్తారా? లేక పనిలో ప్రవేశపెడతారా?

అవ:—మఱి చదివించలేను బాబూ! ఏదో నెలకోముప్ఫయ్యైదురా ళ్లిస్తారుగదా, ఏడాదికీ నాలుగువందల యిరవైరూపాయిలన్నమాట! నాకు మునుపు భూమిమీద మూడువందలే వచ్చేవి. సంసారం మెల్లిగా "దేహీ" అని ఒకనికి చేయిచాచకుండా సాగించేనుకానూ? అధికార్ల దయ ఉంటే అదే పెద్దనౌఖరీ అవుతుంది. ఎక్కడికి? సంతుష్టి ఉండాలా?

కామే:—నౌఖరీకి యెక్కడయినా ప్రయత్నం చేస్తున్నాడా?

అవ:—ఓ! అన్ని ప్రయత్నాలూ చేస్తున్నాం. మన డిప్టీకలక్టరు రాజారావునాయుడుగారితో మనవిచేసేను. "సరే చూస్తాం దరఖాస్తిచ్చి వెళ్ల"మన్నారు. అధికార్లు! అంతకంటె యెక్కు వేమంటారు? అటుపయిని మా అదృష్టం.

కామే:—(చిరునవ్వుతో) నాతో చెప్పేరుకారేం? ఈపాటికి నౌఖరీ వేస్తునే?

అవ:—అయ్యో! మీదాకా రాకుండా అయిందీ! బాబూ! ......................
ఇంతకీ మనం మనం ఒకశాఖవాళ్లం బాబూ! కూటికి పేదరికంగాని కులానికి పేదరికమా?... చిత్తం! చిత్తం! చిత్తం!

కామే! —ఒకటి చేయండి అయితే! మాలలిత నిచ్చేస్తాను మీపిల్లవాడికి చేసుకోండి. అటుపయిని ఆతని నౌఖరీబాధ్యత నాదేను. రివిన్యూడిపార్టుమెం టంతా నాచేతిలో ఉంది. తెలుసునా?

అవ:—చిత్తం చిత్తం! నేనెరగనూ, కలెక్టరు కచేరీశిరస్తాదారు డంటే సామాన్యం పలుకుబడా? వెనకటికి వెంకన్నపంతులు శిరస్తాదారుడుగానే ఉండి ఏకచక్రం యేలేశాడు కాదూ? సుగ్రీవాజ్ఞ! అతనిమాట లేకుండా పిట్టలు నీళ్లు త్రాగేవి కావు! కలెక్టరుకూడా గడగడ లాడేవాడు అతనిముందర.

కామే:—(మూతి బిగించి తలతూచి) ఈ సంబంధంవిషయమయి మీభార్యతో మాట్లాడి నాకు చెప్పండి. మాయింట్లో కూడ చెప్తాను.

అవ:—నా భార్యతోనా? ఎందుకూ బాబూ! ఆగోడ వక్కరలేదు. అబ్బో! నేను నరసింహాదీక్షితులుకొడుకు నండో! నే నెలా చెపితే అలాగు నాకుటుంబమంతా వినవలసిందేగాని మరోలా నడవడానికి వీలు లేదు. ఆడముండావాళ్లు సలహా యేమిటి బాబూ? మీఅంతవా రొచ్చి పిల్ల నిస్తామంటే దీనికి మరివకళ్ల సలహా కూడానా? నామాటకు మరి తిరుగులేదు బాబూ! మీయిష్టమే నాయిష్టం. పిల్లవాణ్ణి చూచేరా? సెలవయితే సాయంత్రం ఇంటికి పంపుతాను. మనవాళ్లకు వాణ్ణి చూపించండి.

కామే:—ఏలా ఉన్నా సరేనండీ! ఆరోగ్యంగా ఉంటే చాలును! అంద మేలా? స్వయంవరమా యేమిటి?...... వచ్చే నెలలో ముహూర్తముందట! పెండ్లి చేసేద్దా మయితేను. సింహాచలమయితే మన ఉభయులకూ సుఖువేనూ? ఏమంటారు?

అవ:—ఓ! అభ్యంతరం యేమిటి? అలాగే కానీయండి. తూగడాని కేముంది. ఆమిగిలిన పీసం అమ్మేస్తాను. అటునుండి నరుక్కురమ్మన్నాడు మీ దయ ఉంటే ఒక్కయేడాదిలో ఎనిమిది వీసాలు మానరసింహామే కొంటాడు. (ఆనందంతో వాని మొగ మెఱ్ఱపడ్డాది.)

కామే:—సరే, వెళ్లండి. రేపు దశమి, మంచిరోజూ; మీ రొకమాటు వస్తే నిశ్చయతాంబూలం ఇచ్చేస్తాను.

అవ:—అవశ్యం! చిత్తం చిత్తం! శలవు తీసుకొంటాను. రేపు ఉదయమే వస్తాను! శలవూ!

౨

నరసింహం పాలచెక్కు లెఱ్ఱపడ్డాయి. తురాయినుండి తెగిన ముత్యాలకోవలాగు చెమటబిందువులు నొసటినుండి జారేయి. పలుచని మెఱ్ఱని వాని లేతపెదవి వడకింది. "ఉఁహూ!" యని తలయూచేడు. ఉంగరాల ముంగురు లుయ్యాల లూగేయి.

అవ:—ఏమిటీ! వద్దంటా వేమిటీకొంప దీసి! రంభలాంటి పిల్ల! పెద్దయింటి సంబంధం! సాంప్రదాయం చెప్ప నక్కరలేదు.

నరసింహం:—రంభేమిటి నాన్నా? ఆపిల్లను చూచేను. కోతిలా గుంటుంది. రంభయిలాగా ఉంటుంది?

అవ:—కోతేమిటిరా? కొంచెం నల్లగా ఉంటుందిగాని మొగం యెంతలక్షణంగా ఉంటుందో చూడూ!

నర:—ఏం లక్షణం? ఎగ నోకన్నా, దిగనోకన్నా, బత్తీముక్కా, బండ మొగం తుట్టపెదవులూ, టొంకరికాళ్లూ!

అవ:—అలా నోటికి వచ్చినట్టూ అన కురా! పెద్దయింటి పిల్ల పిలిచి పిల్లనిస్తామంటే కులంమెత్తనా? కుఱ్ఱాడివి. నీ కేం తెలియదు. పెద్దవాళ్లాలోచించి పెండ్లి చేయాలిగాని పసి పిల్లల సలహా లేమిటిరా? ఊరుకో! నేను నీమేలాలోచించి చేస్తానుగాని నిన్ను పాడు చెయ్యనుగదా? రూపంఎందుకూ? కొరుక్కో తింటా వేమిటి? కామేశ్వర రావుగారికి మిగిలే అర్థోపెద్దో నీకే ముడుతుందా? పై వాళ్ల కిచ్చేస్తాడా? అదికాక నీకు నౌఖరీ చెప్పి స్తాడా? ఇంట్లో తిండికి చాలక మలమలా మాడిపోతున్నాం! నీవు రెండు రాళ్లు తెచ్చి మమ్మల్ని పోషించాలా?

నర:— నౌఖరీ దొరక్కపోతుంటీ, నాన్నా; ఏకచేరీలోనయినా దూరేస్తాను. నౌఖరీకోసం ఆకోతిని పెళ్లాడమంటావా?

అవ:—ఒరేబాబూ! నీ వలా పదేపదే అంటే నాకు కోపం వస్తుంది సుమా! నీకెం దుకూ యీ ఘోషంతానూ? పండులాటి నౌఖరీ పాడుచేసుకుంటా వేమిటి? ఏదరిద్ర దేవతనో నీకు తెచ్చికడితే అక్కడికవుతుంది. "తిండికి మెతుకులు లేవు. తిలోత్తమనేగాని కన్నెత్తిచూడ నన్నాట్ట" వెనుకటి కెవడోను. ఒంటినిండా నగలు పెడితే ఆపిల్లే బాగుం టుంది. నగలుపెడితే తాటాకుబొమ్మవంటిది తళతళ లాడుతుంది. ఈపిల్లకిమాత్రం కన్ను గ్రుడ్డా? కాలుసొట్టా? నీవు పెద్దజీతగాడ వయితే నీపెళ్లాన్ని యిలా బంగారంమలాము చేసేదువుగాని. సాగేదేదో అది చూసుకోవాలి గాని చిన్నతనంచేత గజలక్ష్మిని కాళ్ల తంతావా?



నర:— మంచి గజలక్ష్మిలాగే ఉంది. ఆగజలక్ష్మి నాకొద్దు నాన్నా! ఇప్పటినుండీ నాకు పెళ్లెందుకూ? ఎక్కడేనా నౌఖరీ అయి నాల్గురాళ్లు తెచ్చుకుంటూఉంటే పెళ్లి కాక పోతుందేమిటి? కాదనుకో, పోనీ, నేనిలా బ్రహ్మ చారినయే ఉంటాను.

అవ:—నౌఖరీ ఎలా అవుతుందిరా? వెఱ్ఱివాడిలా గున్నావు! కామేశ్వరరావుగారి మాటకాదని యీ జిల్లాలో బతకగలవూ?

కామయ్యదగ్గరా కంయి కుంయులు? నేనింతా కష్టపడి భూమీ యిల్లూ అమ్ముకొని నీకు చదువుచెప్పిస్తే దాని సార్థకత లేకుండా చేస్తా నంటా వేమిటి? మీఅమ్మగానీ వద్దంటూం దేమిటి? అదేం చక్కగా ఉంది? నేను పెళ్లా డేశానూ? బాబూ, లేనిపోని వేషాలు వెయ్యక నేనుచెప్పినట్టూ విను; నిన్నెంతవాణ్ణి చేస్తానో చూడు; నీబాధ్యత నాదికాదట్రా!

నరసింహంవిశాలనేత్రాలు చెమ్మగిల్లేయి; ముఖం వెలవెల బొరింది. వానికి నిలువు పాటున దేనిలోనికో కూలిన ట్లనిపించింది.

అవ:—సరే. అవతలకు పోయి ఆటో, చదువో యేదో చూసుకో. నీకెందుకూ ఈ పెద్దకుండ కెసర్లూ?

3

అవధానులు:— బాబూ చూచేవా? అరవై అయింది. మీమామగారి పలుకుబడి చూచేవా? ఏడాదిలో నిన్ను శిరస్తాదారుడు గానూ, తరవాత తాసీల్దారుడుగానూ చేస్తా నన్నాడు. చేస్తాడు. మనకోసం చేస్తా డేమిటి? వాళ్ల పిల్లే సుఖపడుతుంది. రాయఘడాఅట. ఆవూరు మంచిదే అన్నాడు. మంచి కేముంది? నోరు మంచి అయితే ఊరు మంచి. వారం రోజులలో వెళ్లి చార్జీ పుచ్చుకోవాలట. నీ వక్కడకు వెళ్లి ఇల్లూ అవీ చూచి మాకు వ్రాస్తే నేనూ మీఅమ్మా వస్తాం. వచ్చేమా సంలో ముహూర్తం కుదిరితే కార్యం చేసు కొని నీభార్యనుకూడా తెచ్చుకుందువుగాని. నర సింహం అద్దాని కెదురుగా నిలబడి "టై"ముడి సవరించుకుంటున్నాడు.



తండ్రిమాటలు విని త్రుళ్లిపడి నాకింకా అర్థరు రాలేదే! నీ కెలా తెలిసింది నాకు బదిలీ అయినట్టు? అన్నాడు

అవ:— (నవ్వుమొగంతో) ఆశ్రమం ఊరికే పోతుందట్రా బాబూ! ప్రొద్దున్నే మామూలుప్రకారం మీమామగారి దర్శనా నికి వెళ్లేను. ఆయన చెప్పేరు. నాతో అబద్ధం చెపతాడా? పిన్న పెద్దమనిషి! నిజమేనూ!

నర:—రాయఘడావా?

అవ:—అవును.

నర—ఏజన్సీ నాన్నా! జ్వరం తగులు కుందంటే మరి వదలదు. అక్కడరవయిహా పాయిాలకంటె ఇక్కడ ఇరవై నయం.

అవ:—పల్లెటూరివాళ్లలా గలాటి పిచ్చి నమ్మకాలు పెట్టుకోకు. నాకు నలభైదాటి యేభయ్యోపడి వడుస్తూంది. ఎన్నిఊళ్లో తిరిగేను. ఇవాళ్ల వరకూ జబ్బని చీదలేదు. మనం జాగ్రతగా ఉంటే ఏరోగాలూ రావు. నీళ్లు పల్లిడిచేస్తే అలా అనుకుంటారు. అదికాక ఇవన్నీ మీమామగా రాలోచించేశింటారు. తెలివితక్కువపడి ఆయనతో రాయఘుడా వెళ్ల ననకేం! ఈపని నీకోసం చాలాకష్టపడి సంపాదించేడు. నీ విప్పుడు కాదంటే ఆయనకు కోపం వస్తుంది. ఒడిసా, రాయీ, కూడా పోతుంది. వెళ్లు, ఇటువైపు రావాలంటే మెంతలో మళ్లా రప్పించగలడు! అన్నీ ఆయన చేతులోనే ఉన్నాయి. వెళ్లునాయనా! ఫరవా లేదు. నామాట విను. వద్దనకు—

నర:—అలా అద్దంలో నీడ చూసుకుంటూ నిలబడిపోయాడు. ఆలేతబుగ్గలు, చొచ్చుకొనిపోయినట్లు, ఆనున్నని ఫాలం ఇగిరి ముడుతలుపడ్డట్లు, ఆమెత్తని పెదవి నల్లబడినలిగినట్టు, ఆనీలపుముంగురులు తెల్లబారినట్టు, ఆబొద్దు ముంజేతు లెండి కఱ్ఱకట్టినట్లు నీడ వానికి కనబడింది. చలిలోవలె లోపలినుండీ ఒకకుదుపు వచ్చినట్టనిపించి గడగడా వడకేడు. వానిమూపులలో నిరాశ తలచూపింది. చెక్కులు తెల్లబారేయి. తలయూచి యాతడిట్టు వితర్కించికొన్నాడు.—

౪

"ఎవరి సౌఖ్యము వారిదేగాని యెదుటివాడేమగునన్న ఆలోచన యెవ్వరికీ ఉండదుకాబోలు! ముచ్చ్వాకడబ్బులకోసం నన్ను మృత్యుముఖాన్న చొరబడమంటున్నాడు మానాన్న. పెద్దనౌఖరీఅయితే పిల్లసుఖపడుతుందని ఏజన్సీకెగబెడతున్నాడు మామామగారు. లోకం ఇలా ఉన్నప్పుడు మన మేం చేస్తాం? అంతే కాకుండా ఈపెండ్లి చేసికొన్నదగ్గరనుంచీ నాకే దేశానికేనా వెళ్లిపోవా లనిపిస్తూంది. తలిదండ్రులను విడిచి వెళితే విశ్వాసఘాతుకుడంటారేమో అని సంకోచిస్తున్నాను. కొన్నాళ్లు దూరంగా ఉంటే కళవళపడుతూన్న నామనస్సు కాస్త కుదుటపడుతుందేమో! రోగం వచ్చి శరీరం చెడుతుందన్న బెంగేలా? ఈశరీరాన్ని పెంచిమాత్రం ఏంచెయ్యాలి! అనందానికి పనికి రాని యీ శరీరం శుష్కించి, జీర్ణమయిపోతేనే మంచిది. శరీరమారోగ్యంగా ఉండి నేను తిరుగుతూఉంటే ఆపిల్లను నేను సరీగా చూడకపోతె లోకులు నన్ను నిందిస్తారు. ఈలోపుగా రోగపీడితుడ నయినానంటే నిందలేకుండా దాటేస్తాను." వాని కన్నులు నీటితో నిండిపోయేవి. కన్నీళ్లతో తెల్లనిచొక్కా తడిసింది. గోడవైపు తిరిగి కళ్లొత్తుకొని కడతేరా దుస్తులు వేసికొని కచేరీకి వెళ్లిపోయేడు.

౫

అవ:—ఔనే! అది బాబుబండీయే కాబోలు చూడు! వస్తున్నానని వాళ్లమామగారికి తంతి పంపించేడట ఇది వచ్చే వేళేను. చప్పున వెళ్లి వీధితలుపు తీసిచూడే! కదురు పంచలో పెట్టి వస్తున్నాను.

బండి నిలబడ్డది. అయిదు నిముషములయింది. ఎవరూ దిగిరారు, అవధానులు గబగబా బండీదగ్గరకు వెళ్లేడు. పొంగి వెల్లబారిన బుగ్గలూ, బూరటించి నిగనిగలాడుతూన్న కడుపూ, బొటమరించిన గుండెయెముకలూ, చర్మమంటుకుపోయిన చేతులూ కాళ్లూ, లోతుకు పోయిన కళ్లూ, లొటలొటలాడే



మోకాళ్ళూ నరసింహం ఆ బండిలోనుండి మెల్ల మెల్లగ లేచి దిగడానికి ప్రయత్నిస్తున్నాడు. ఎఱ్ఱవడిన ముక్కుపుటా లెగసిపడుతున్నాయి. పొడపొడలై పగిలి యెండిపోయిన పెదవులు తెల్ల తెల్లని నాలుకకొనతో తడుపుకొంటున్నాడు. అవధానులు చెయ్యూతయిచ్చి వానిని దింపేడు. లోనికి తీసికొని వెళ్లేడు. అవధానులు భార్యా అలా నిలబడిచూస్తూంది. త్రుళ్లిపడ్డది. పిండిబొమ్మయి వెలవెలబోయింది. భర్తను చురచురా చూచింది. గబగబా వెళ్లి నరసింహాన్ని కౌగలించుకొంటూ—

“ఏవిటండీ యిది? అయ్యో! నా వెండి మువ్వ! నా వెన్నముద్ద! నా మల్లెపువ్వు! నా మంచిముత్యం! ఏమిలా అయింది? నిజంగా నరసింహే ఇలా అయిపోయాడూ? ఎంతపని చేశారండీ! తడవులకుపుట్టేడూ! లేనికాని పిల్లవాడు! మొదట కావ్యాలు చదువుకుంటూ అగ్రహారంలో ఉంటే పనికిరాదన్నారు! ఈ పాడుముండాపట్నం తోలేశారు. వారాలు, చేసుకుంటూ బైరాగిలాగు బ్రతకాలన్నారు. అలాగే యిబ్బందిపడి చదువుకున్నాడు. ఈ దిక్కుమాలిన సంబంధం ఒకటి తెచ్చేరు. పసి చిలుకను పెంచి బావురుపిల్లి కొప్పగించేరు. కరువుల్లోకూడా పూర్తిగా పండేభూమిని కడముట్టించేరు. మూడువందలరాబడీ ముక్కలు చేసేరు. చిలుకలపంజరంలాటి యిల్లు చిదిపి తల్లిని గలిపేరు. ఎప్పుడో సొమ్ము వస్తుంది చూడన్నారు. హోదాచెలాయిస్తామన్నారు. ఏళ్లైదాటేయి. కాటికికాళ్లు చాచుకున్న మనకెందుకూ యీహోదాలు? అదికాక గడుసుమీరిన యీరోజుల్లో మీఅధికారం యెవరు పడతారు? మనకిన్నాళ్లు గడిచి యిక గడవనందా? ఎంతపని చేసేరూ! ఇదంతా వ్యవహారజ్ఞానమన్నారు. నన్ను త్రోసిరాజన్నారు. మీలోకజ్ఞానం ఇప్పుడు మందవుతుందా? ఆకామేశ్వరరావుగారి అధికారం అనుపానం అవుతుందా? ఎంత పని చేశారూ! పిల్లవాడి ఆరోగ్యం పెద్దడబ్బు కమ్మేశారు. మీఅను



౬. స్వాతంత్ర్యదేవత-వాషింగ్టన్.అమెరికా

రాగం అర్ధాంతరమ్మే శారు! నాజీవితమంతాచిల్లి గవ్వ కమ్మేశారు! ఎంత పని చేశారు! ఇప్పు డేం చేస్తారు? ఈరోగం మెలా కుదురుతుంది? ఏమిచ్చి మం దిప్పించడం? కానిముండా జబ్బు తో పిల్లవా డిలా బాధపడుతూ ఉంటే గార కాయల్లాగ మనమిద్దరము తింటూ రోజురోజు కూ పూతెక్కుతామా? ఎంతపని చేశా రండీ! ఎంతపని చేశారూ! కూలిచేసి అయి నా మిమ్మల్ని కూర్చోపెట్టి నేను పోషింతునే? మధుకరంచేసి అయినా మిమ్మల్ని మహారాజు లాగు పోషింతునే! కన్నులు విప్పని కందు నాఅడ్డాల్లో బిడ్డడు! ఎంత పని చేశారు!"

అవధానులు తెల్లబోయి అలా నిలబడ్డాడు.

---

# వెర వేల?

తురగా వేంకటరామయ్యగారు (కవితాసమితి)

౧

కష్టాలువచ్చినా? కాలమేతరిమినా
కన్నీరు రాల్చకే కలుష మెరుగనిచెలీ!
ప్రకృతి రంగస్థల
ప్రళయనాటకములో
నాడుటకు భయమేల?
పాడుటకు జంకేల?
ఆడవే పాడవే
హాయిగానాచెలీ!

౨

నాకు జయమేలనే? నీకు భయమేలనే?
వికసించితిమిమహా ప్రేమయోగాలకై
ఏకమై కరుణార
సైకమైన యనంత
జలధిలో మనచూపు
నిలిపి యొకటేపాట
నాలపింతము వీణ
నందుకోవే చెలీ!

౩

మాయలోకమునన్ను-మసిచేసి నిల్చునా?
ఎడబాటుమనప్రేమ-లెక్కజేసి గెల్చునా?
వెఱ్ఱిపిల్లా! ఇంత
వెరపేల మరుపేల
ప్రేమలీలాసుధా
స్వామి రాధాకృష్ణు
వేణువే సత్యమై
వెలసె మనకోసమే.

---

౧

పూర్వం సుధర్ముడనే రాజు ఉండేవాడు. ఆయన మహాకర్మిష్ఠి. ప్రొద్దున కోడి కుయ్యటంతోనే లేచి ముఖప్రక్షాళనాదికములు చేసికొని యోగబలంచేత ఆకాశమార్గాన్ని వారాణసి కెళ్లి అక్కడ మణికర్ణికాఘట్టంలో స్నానం చేసి మళ్లీ యింటికి వచ్చి ప్రొద్దుతిరిగేదాకా తపస్సు చేసుకుని పార్థివం చేసి భోంచేసేవాడు. బ్రాహ్మణుడు చెప్పినట్లు ఆయన యింటిలోని అవిచ్ఛిన్నాగ్నిహోత్రం నుండి వచ్చే పొగలకి ఊదరపెట్టినట్లయి ఏదో మల్లేనో వున్న కలి మటుమాయమైపోయింది. కావ్యాలు వ్రాస్తూవున్నవాళ్లు ఆయన రాజ్యంలో కలిలేదని చెప్పటమేకాని ఆశబ్దము యొక్క అశ్రవణ వల్లా అస్థితివల్లా తత్పూర్వంలో కలిఅనేదే లేదని.

ఇట్లా ఆరాజు రాజ్యం చేస్తోంటే వర్ణాలూ ఆశ్రమాలూ చక్కగా నడిచినై. వసంతకాలంలో వడగాడ్పులూ లేవు. నడివేసంగిలో వర్షాలూ లేవు. పిచ్చికలు పరిగ ఏరుకు తినైన్నిగాని గుంపులుకట్టి చేలమీదికి దాడివెడలలేదు. ఆరోజుల్లో కాకులు మర్రిపళ్లమీదనే బ్రదికేవి. వడ్లు ఎండబోసుకుంటే నడాన కాకీకలు గుచ్చక్కర్లేదు.

ఆసాయమూ ఆసంధ్యమూ అగ్నిహోత్రందగ్గర కూర్చున్న బ్రాహ్మడు క్షత్రియుడి రాజ్యాంగంలోనూ చెయిపెట్టలేదు; శూద్రుడి మేడికోలా లాక్కోలేదు. ఏమగనాలి నవ్వులూ వీధిలో తోరణాలు కట్టలేదు.

వర్షాలకోసం కప్పల్ని ఊరేగించలేదు. గ్రహణాలప్పుడు పళ్యాలల్లో నీళ్లోసి రోకళ్లు నిలపెట్టలేదు. ఆరాజ్యంలో వ్యాజ్యాలు లేవు తీర్పులూ లేవు. ఇట్లా రోజులూ, నెలలూ, సంవత్సరాలూ, యుగాలూ గడచిపోయినై. ఒకరోజున ఆరాజు రాజ్యంలో ఒకక్షత్రియుడు గుర్రాన్ని యెక్కి ఒకకాపు పొలం దున్నుకుంటూవుంటే అట్లా వెళుతున్నాడు. ఆకాపు ఎడ్లని ఆపి ఆయుద్ధవీరుడివంక చూశాడు. చూసిచూసి తలత్రాళ్లు మేడికోలకు కట్టి క్షత్రియుడిదగ్గరకు వెళ్లి అన్నాడు—"అబ్బాయీ! నీవు చాలారోజులుగా యీగుర్రాన్ని ఎక్కటం ఈకత్తి పుచ్చుకోటం చూస్తున్నాను. నేనెన్నాళ్లని యీదున్నటం. ఇహ యిక్కణ్ణుంచి నువు దున్ను, నేను గుర్రాన్నెక్కుతా —"

"క్షత్రియుడికి కోపం వచ్చింది. కోపం అపుకుని —"నీవు యుద్ధం చెయ్యలేవు. నేను దున్నాలేను. అట్లా చేసినా బాగా కుదరవు. నీవు పోయి దున్నుకో." అన్నాడు.

కాపు—'మహా నువ్వే యుద్ధం చేస్తావు లెద్దూ. అలవాటయితే సరి యెవరు పడితే వారే చేస్తారు.

తృప్తి—నిజమే. మరి నాఅంత అలవాటు నీకిప్పటికీ కాదు. కనుక ఎవరిపని వారు చేస్తే బాగుంటుంది.

ఈతగాదా తెగింది కాదు. పదమంటే పదమని యిద్దర్నూ రాజుదగ్గరకు బయలుదేరారు.

రాజుగారు ఆరోజున యెహోవ్వవిఘ్నాలు వచ్చి కాశీకి వెళ్లలేదు. దూరంగా వీళ్లిద్దరూ గంటుపెట్టిన మొగాలతో గుండెల్లోనూ కళ్లల్లోనూ రోషాలు పెట్టుకుని వస్తోంటే చూశాడు. చూట్టంతోనే సంగతి తెలిసింది.

ఆయన వాళ్లిద్దరికీ యెదురుంగా పోయి 'అబ్బాయిా! మీాతగాదా నాకు తెలుసు. నేను చాలారోజులు రాజ్యం చేశాను. ఇంక నేను అడివికి వెళుతున్నాను. మీాతగాదా మీా క్రొత్తరాజుతో చెప్పుకోండి అని వెనక్కితిరిగి చూడకుండా అడివికి వెళ్లాడు.

౨

ఆయన కొడుకు ధర్ముడు రాజ్యానికి వచ్చాడు. ఈతగాదా ఆయనదగ్గరికి వచ్చింది. ఆయన కేమీా పాలుపోక వేదవేదాంగ పారంగతులూ, నిత్యాగ్నిహోత్రులూ అయిన బ్రాహ్మల్ని పిలిపించి వారికి నివేదించాడు. వారు తపోదృష్టితో చూచి-"అబ్బాయి! అట్లా వీలులేదు. ఎవరిపని వాళ్లు చెయ్యాలిశిందే. మీారు పోట్లాడకూడదు.—"అన్నారు. రాజూ వారిమాటలతో తనకు కూడా దివ్యదృష్టి కలిగి వారన్నట్లే అన్నాడు. వాళ్లు ఎవరిదారిని వారు వెళ్లారు.

ధర్ముడు రాజ్యం చెయ్యటం మొదలు పెట్టాడు. ఆయనకు రోజూ కాశీవెళటానికి యోగశక్తి చాలక తన రాజధాని తీసికెళ్లి సీప్రానది వొడ్డున కట్టించుకుని అక్కడే స్నానం చెయ్యటం, అగ్నిహోత్రం చేసుకోటం, రాజ్యం పాలించుకోటం మొదలుపెట్టాడు.

ఇట్లాగే మళ్లీ అప్పుడప్పుడు తగాదాలు రావటం మొదలుపెట్టినై. ఆబ్రాహ్మణుల్ని పిలిపించి రాజు వాళ్లచేత తీర్పు చెప్పించుకూ వచ్చాడు. రాజ్యం మొత్తంమీాద సుధర్ముడిరాజ్యమల్లేనే నడిచింది. బ్రాహ్మణులకిమట్టుకి అగ్నిహోత్రాలమధ్యా, రాచకార్యాలమధ్యా తిరగట మయ్యింది. ఇట్లా చాలాయేళ్లు గడచినై.

ఒకానొకరోజున నొక బ్రాహ్మడు యూపదారువు తెచ్చుకుందామని కొడుకుని వెంట తీసుకుని అతనికి వేదం చెప్పుకుంటూ పూర్వపుపొలంకాపు దున్నుతున్న పొలంగట్టునే పోతున్నాడు. అప్పటికి ప్రొద్దువాటారుతోంది. కాపు దున్నిదున్ని అలసిపోయినాడు. చెమట పట్టి చెయ్యి మేడికోలమీాంచి జారిపోతోంది. కాపు బ్రాహ్మణ్ణి చూశాడు. ఇట్లా అనుకున్నాడు. "ఆబ్రాహ్మడు చూడు ఎంత ఎర్రగా వున్నాడో. నావొళ్లు సూర్యుడి వేడికి నల్లపడ్డది. ఆయన సుఖంగా ఇంట్లో కూర్చుంటోంటే దబ్బపండులా వున్నాడు. దున్నిదున్ని నారెక్కలు విరిగిపోతున్నై. ఇక నేను దున్నలేనబ్బా! ఎల్లకాలం వక్కడుదున్నటం ఎల్లాగేమిటి." అనుకుని ఆయనదగ్గరకు వెళ్లి

"ఏమండీ! నే నీపొలం చాలానాళ్లుగా దున్నుతున్నాను. ఇంక నాకు శక్తిలేదు. నేను మీాకు మల్లే వేదాలు చదువుతాను. మీా రీపొలం దున్నండి." అన్నాడు. బ్రాహ్మడు నివ్వెఱపోయినాడు. "అబ్బాయి! దానికేమి! నేను ఏదైనా చేస్తాను. నీవైనా, నేనైనా రాజు చెయ్యమన్నదికదా చెయ్యాలి. అతనిదగ్గరకు పోయి ఆసంగతి కనుక్కుందాంరా" అన్నాడు. ఇద్దరూ కదలి రాజాంతఃపురందక్కు నడిచారు. రాజు ధర్మమూర్తి కొలువుతీర్చికూర్చున్నాడు. ప్రక్కనే ప్రాడ్వివాకులూ కూర్చున్నారు.

ఈ బ్రాహ్మణుడూ, కాపూ వెళ్లారు. బ్రాహ్మణుడు రాజును చూచి-"మేమిందుకొచ్చాము. ఇదీసందర్భం" అన్నాడు. రాజు ప్రాడ్వివాకులవంక తిరిగి చూచాడు. యోగదృష్టి పెడతిరిగిందా అన్నట్లు వారి కళ్ల చివరలు చెక్కిళ్లమీాదికి వ్రాలినై. ప్రయత్నం మీాద దృష్టి భ్రుకుటికి లగించి వారు "అట్లా కాదు. ఎవరిపని వారు చేయవలసినదే"న న్నారు. రాజుకూడా అట్లాగే నన్నాడు. బ్రాహ్మణుడు కాపుని చూశి "సరేనా" అన్నాడు. కాపు అన్నాడు.-"అయ్యా! నాకు న్యాయం జరుగలేదు. ఈయనా బ్రాహ్మడే వారూ బ్రాహ్మలే. అందుచేత వారి తీర్పు ఇక్కడ పనికిరా"దన్నాడు.

రాజు—అట్లా కాదు. వారి తీర్పు తీర్పు మాత్రం; అట్లా చెప్పింది నేనేను. నాబుద్ధికి అంతేతోచింది. ఇంక వెళ్లు. అన్నాడు.

కాపు—మహారాజా! మీా అచ్ఛమైన బుద్ధి వారిబుద్ధిమూలంగా కలుషితమైంది. మీారు మళ్లీ విచారించాలి—అన్నాడు.

రాజు తటాలున లేచి నిల్చుని "నేను అడివికి వెళ్లేవే ళయింది. ఈ సంగతి తరవాత రాజుతో చెప్పుకోండి." అని కిరీటం భుజకీర్తులూ, ఖడ్గం సింహాసనంమీాద పెట్టి అడివికి నడచి వెళ్లాడు.

3

ఆయనకొడుకు ధర్మరాజు రాజ్యానికి వచ్చాడు. మళ్లా ఆయనదగ్గరికి ఈ తగాదా వచ్చింది. ఆయనా ప్రాడ్వివాకులని అడిగాడు. వాళ్లు పూర్వపుతీర్పు చెప్పారు. కాపు మళ్లీ ఆపూర్వపు అభ్యంతరం చెప్పాడు. రాజు కాపుని ఒప్పుకోమన్నాడు. కాపు ఒప్పుకోనన్నాడు. రాజు ఖడ్గము చూపించి ఒప్పుకోకతప్పదన్నాడు. కాపు వెళ్లిపోయినాడు. మళ్లీ రోజులు ఇట్లా గడచినై. ప్రతిదానికీ రాజు ఖడ్గం చూపించాలిసివచ్చింది. క్రమంగా రాజ్యంలో వ్యాజ్యాలూ ఎక్కువయినై. రాజుకూడా విసుగు పుట్టి ఎన్నిసార్లని ఖడ్గం చూపిస్తామని ఒక్కొకప్పుడు ఖడ్గాన్ని చూపించటం మానివేశాడు. ఎప్పుడూ రాజు ఖడ్గం చూపించలేదో అప్పుడు రాజు తమవేపు నున్నాడని లోకం మారిపోవటం మొదలెట్టింది.

ఈరాజుకి ముగ్గురుకొడుకు లున్నారు. పెద్దవాడిపేరు సుధర్ముడు; రెండవాడిపేరు

ధర్ముడు; మూడవవాడిపేరు ధర్మరాజు; తండ్రి పేరూ కొడుకుపేరూ ఒకటేమిటని యితన్ని 'రాజు'అన్నారు.

తన పెద్దకొడుకైన సుధర్ముడు తాత గారల్లే రాజ్యం బాగుచేస్తాడని యీధర్మరాజుకి ఆశ. రోజులు గడుస్తున్నై.

రాజుకి కొన్ని తెలిసీ కొన్ని తెలియకుండా రాజ్యంలో మార్పులు జరుగుతున్నై. బ్రాహ్మలు కొందరు పొలాలు దున్నుతున్నారు. కాపులు కొందరు వేదాలూ చదువుతున్నారు. క్షత్రియులు యుద్ధాలు మానేరు. వైశ్యులు పేరుమాత్రం మిగిలారు.

వ్యాజ్యాలు, తగాదాలు, పితూరీలు రోజుకురోజు పెరిగిపోయినై. ఎప్పటివప్పుడు లెక్కలు వ్రాయించి వాటి వయినమంతా తాటాకుల్లో నిలవచేయించారు. కొత్త వేవయినా వస్తే రాజు విచారిస్తాడు కాని ప్రాత మోస్తరు తగాదాలయితే ఆతాటాకులు తిరగెయ్యటం. తీర్పు అందులోకిమల్లే చెప్పటం. రాజు కీకష్టం ఎక్కువై యిందుకు కొందర్ని నియమించాడు. వారు తాటాకుల్లో ఒకమోస్తరుగా వుంటే. వీరు ఇంకోమోస్తరుగా చెప్పటం మొదలుపెట్టారు. దేశంలో మరి కొంత ధర్మం ఈప్రకారంగా బయలుదేరింది.

రోజుకురోజు పోను రాజుదగ్గరికి విషమ వ్యాజ్యాలు రావటం మొదలు పెట్టినై. రాజుకావ్యాజ్యాలు అర్థంకాలేదు సరికదా అటువంటి వ్యాజ్యాలు వచ్చేందుకు అల్లాంటి పరిస్థితులు ఎట్లా కలిగినవ్యోకూడ తెలియలేదు. చివరకి కనుక్కుంటే తన ధర్మాధికారులు తాటాకుపుస్తకాల వ్యాఖ్యానాలవల్ల అని తేలింది.

రాజు దీర్ఘంగా విచారించాడు. మళ్లీ రాజ్యం పూర్వంమోస్తరుగా చెయ్యటం అసంభవం అని తెలిసింది. తన తాతతండ్రులకిమల్లే అడివికి పోదామా అనుకున్నాడు. ఇంతలో రాజుకి పెద్దరుగ్మత వకటి సంభవించి దానితో కొన్నాళ్లు మంచంపట్టి మరికొన్నాళ్లకి గతించాడు. తండ్రికి నిత్యకర్మ చేసిన పదునాలుగు రోజులూ సుధర్ముడిదగ్గరకు రోజుకు వందా, వెయ్యీ వ్యాజ్యాలు తయారయినై. ఆయన అన్నీ నిలవచేసి కర్మఅయినతరవాత చూస్తానన్నాడు.

కర్మఅయినతరవాత ఒకరోజున కొలువు తీర్చాడు. మొదటి వ్యాజ్య మిది:

ఒక బ్రాహ్మణస్త్రీ యందు బ్రాహ్మణుడొకడు శూద్రు డొకడు ఇద్దరు కొడుకులను కన్నారు. ఆ బ్రాహ్మడికి ఊరి పౌరోహిత్యం వుంది. ఈ శూద్రుడికి రెండెకరాలు కొండ్ర వుంది. వాళ్లిద్దరూ పౌరోహిత్యం కొండ్రా రెండూ దానికిచ్చి చచ్చిపోయినారు. ఈకుర్రవాళ్లు పెద్దవాళ్లయ్యారు. బ్రాహ్మడికి పుట్టినవాడికి పొలముదున్నుదామని వుంది. శూద్రుడికి పుట్టినవాడికి పౌరోహిత్యం చేద్దామని వుంది. కాని యీశూద్రుడు తనపొలం పుట్రా వదిలిపెట్టనంటాడు.

ఆ బ్రాహ్మడు వ్యాజ్యం తెచ్చాడు. వాడికి పొలమూ పౌరోహిత్యమూ ఎల్లా వస్తై అని.

సుధర్ముడీవ్యాజ్యము విని తెల్లపోయినాడు. చుట్టుపట్లసందరూ 'అయ్యా! ధర్మం చెప్పాలిశింది'అన్నారు. సుధర్ముడు "ఈసంగతి ధర్మానికి అతీతమయిన విషయం. ఈధర్మం నాతరవాత రాజు చెపుతాడు. మానాయనగారు అడివికిపోదామనుకున్నాడు. కాని వెళ్ల లేకపోయినాడు. ఆయనబదులు నేను వెళ్లాలి" అని ధర్మాసనం వదలిపెట్టి అడివికేసి వెళ్లాడు. ఆయనతరువాత ఆయనతమ్ముడు ధర్ముడు రాజ్యానికి వచ్చాడు. ఈవ్యాజ్యము యథాప్రకారముగా ధర్ముడిదగ్గరకు తీర్పుకి వచ్చింది. ధర్ముడికి దానిలోని ధర్మాధర్మాలు తెలియలేదు. సరే, రేపు చెపుతానని వాయిదా వేశాడు.

ఆరాత్రి యిట్లా ఆలోచించాడు. "ఇందు ధర్మమేమిటి? వీడిపొలం వాడి కెట్లా వస్తుంది. వాడి పౌరోహిత్యం వీడి కెల్లా వస్తుంది. ఈ బ్రాహ్మడు పొలం దున్నటం ఏమిధర్మం. ఈశూద్రుడికి పౌరోహిత్యం ఎల్లా చెల్లుతుంది. వీళ్లతండ్రులు నిజంగా బ్రాహ్మణశూద్రులేనా? అయితే వీళ్ల కిట్లా విపరీతబుద్ధు లెల్లా కలిగినై. ఒకస్త్రీయందు వీరిద్దరికి సంతాన మేమిటి? వీరిసర్వవృత్తాంతమూ అధర్మమయంగా వుంది. వారి తల్లితండ్రుల యధర్మం అట్లా పెట్టి వీరికి ఆస్తివిభాగం చేద్దామా అంటే వీళ్లు ఎవ ళ్లెవళ్లకి పుట్టారో నిర్ణయ మెట్లాగా? సాక్షుల ద్వారా చేద్దామా సాక్షులు నిజము చెప్పరని విశ్వాస మెల్లాగా?" అని ఆలోచించి ఆలోచించి ఏమీ తెగక, "ఏసంగతీ నాబుద్ధి నిర్ణయించలేనప్పుడు నాకు ధర్మము ఇదీ అని గట్టిగా తెలియనప్పుడు నేను రాజ్యం చెయ్యటం ఎందుకు? నేను రాజుగా వుంటానికే తగను. మహాతపశ్శక్తివల్ల ఏమహానుభావునకు నిజం తెలుస్తుందో,ఎవడిబుద్ధి ధర్మనిర్ణయంలో నిస్సందేహంగా వుంటుందో రాజు వాడు." అని నిర్ణయించుకుని అర్ధరాత్రివేళ లేచి యెవరికి చెప్పకుండ యెక్కడికో లేచి ధర్ముడు వెళ్లిపోయినాడు.

మరునాడు ప్రొద్దున రాజుకోసం అందరూ వెదికారు. వారం పదిరోజులు తిరిగిన చోటు తిరక్కుండా,వెతికినచోటు వెతక్కుండా చూశారు. రాజు లేడు సరే; రాజు పోయినాడంటే పోయినాడనుకుని ఆయన తమ్ముడు 'ధర్మరాజు'ని (అనగా 'రాజు' అన్నవానిని) రాజుగా చేశారు.

'రాజు' రాజవటంతోటే దేశమంతా చక్కగా మారిపోయింది.

ఆవ్యాజ్యం 'రాజు' వద్దకి వచ్చింది. అందరూ అన్నారు. "అయ్యా! ఈ ధర్మం నిర్ణయించలేక మీపెద్దన్నగారు అడివికి లేచి పోయినారు. చిన్నన్నగారు ఎవరితో చెప్పకుండా పరారి అయినాడు, తమరు చెప్పాలి. లేకపోతే దేశంలో ధర్మం వుండదు."అని

రాజు పగలపడి నవ్వాడు. అన్నాడు కదా "ఛీఛీ! ఈ మాత్రానికా! వాడొక

పెద్దనాన్న వీడొక దద్దన్నానూ. మీరు నన్నే మొదట రాజునిచేస్తే ఈగోల వుండేదా! ఇదుగో చూడండి. ఈ ధర్మం రెండువిధాలగా వుంది. చూసుకోండి. ఈ బ్రాహ్మడు పొలం చెయ్యటం, ఆశూద్రుడు పౌరోహిత్యం చేయించటం. వీడు పొలంచేస్తే వచ్చే ధాన్యమూ అన్నీ ఆశూద్రుడి కిచ్చెయ్యటం; వీడు పౌరోహిత్యం చేస్తే వచ్చే బియ్యమూ, కాన్లూ ఈ బ్రాహ్మడికి యిచ్చేయ్యటం—ఇది ఒకమోస్తరుతీర్పు. రెండవతీర్పు-ఎట్లాగంటే-వినండి: వీడు సగం పౌరోహిత్యం, వాడు సగం పౌరోహిత్యం—వీడు నగం పొలంవాడు సగం పొలం చేసుకోటం—ఇది తేలిక—"అని—"ఈమాత్రం తేలికపనికి ఇంతహడావడా? దానమ్మకడుపుకాల!" అన్నాడు. సభంతా జయజయధ్వానాలు చేశారు. వాళ్లిద్దరూ రెండోతీర్పు ప్రకారం నడుచుకుంటామన్నారు.

తరవాత 'రాజు'ఉన్న వ్యాజ్యాలన్నీ సులువుగా తీర్పులు చెప్పాడు. సూత్రం ఇల్లాగోయి అనిచెప్పి తన ధర్మాధికారులకి అప్పచెప్పాడు. వారూ 'రాజు' చెప్పినట్లు, చేస్తున్నారు. ఎవడు ఎన్ని ఎక్కువవ్యాజ్యాలలో తొందరగా తీర్పులు చెప్పిపంపేస్తే వాడూ మొగాడూ ఆరాజ్యంలో. వాడికి 'రాజు'తత్త్వం బాగా తెలిసినట్లు.

'రాజు'రాజ్యం ఆదేశంలో ఇల్లా అవ్యాహతంగా సాగుతోంది.

ఎవడైనా ఎప్పుడన్నా రాజుతో "మీముత్తాతగారు సుధర్ముడని వుండేవారట. వారికాలంలో వ్యాజ్యమంటూ లేదట" అని చెపితే—రాజు—అవి అన్నీ బొల్లిబొల్లిమాటలోయి, మాముత్తాత అనేవాడు అసలులేడు. ప్రపంచమంతా మానాన్నతో మొదలెట్టి వుండాలి. నేనెరిగివున్నప్పటినుంచే ఈప్రపంచకం అసలు కన్నుతెరిచింది. ఆసంగతి నాకు తెలుసు" అంటాడు. అందరూ వూరుకుంటారు. వాళ్లూ నిజమే అనుకుంటున్నారు. ఒకరోజున మెవడో కాదంటే రాజు వాణ్ణి వురితీయించాడు.

---

## అ న సూ య

జి. జాషువగారు

౧

విజయవిలాసుని వినుతింపఁదలఁచిన జక్కన్న కోరమీసాలుదువ్వె
జక్కన్నకవనంబు చక్కనిదనిపల్క పినవీరకవినాల్క వెళ్లఁబెట్టె
పినవీరకవి పల్కు వెలఁదికిఁ బ్రియుఁ డన్న గండపెండారంబు గల్లుమనియె
పెద్దన్నయాంధ్రకవి పితామహుం డన్న రామభూషణుఁ డంబరంబు నూచె
భట్టుమూర్తికిఁ గవిరాజపట్టమీయ-దిట్టి లింగఁడు చేఁపలబుట్ట నూపె
అందఱందఱు మహనీయు లని తలంచి-యొకనమస్కార మర్పించి యూరకొంటి.

౨

నన్నయ తిక్కనాది కవినాథుల పంచమవేద మంతలో
పిన్నని నవ్వుదోఁప నగుపించి, "మహాత్ముల విస్మరింతురే
పిన్నలు, మంచి" దంచు నుశీవెం దలవాంచితి, నంత "వారిదే
మున్నది-మమ్ముఁ జూడు"మను చుండిరి భోజసభాకవిప్రభుల్.

౩

పదలాలిత్య మెసంగ దండివచియింపంజొచ్చె, "నర్థంబు సం
పద కావ్యేందిర కంగపుష్టి గలిఁగింపం జాలు" నంచున్ సభా
సదులం దుండి వచించె భారవి, స్వహస్తన్యస్తకాదంబరీ
మద మేపారగ భక్తశేష మని సంభాషించె, బాణాఖ్యుఁడున్.

౪

ఉపమానంబుల నిగ్గుదోఁప బహుకావ్యోత్పత్తిఁ గావించి, వా
ర్ధిపరీతాఖిలధారుణీతలనుత(శ్రీ) నందికొన్నట్టి, నే
రుపరిం గాంచితిఁ గాళిదాసకవివర్యున్ జెంత నక్కాళికా
చపలాక్షిన్ జపలాలతాంచితవపుస్సౌందర్యలీలావతిన్.

౫

అలకాపట్టణమార్గమధ్యమున మేఘాకారతన్ దాల్చి, "నీ
వలు కస్మన్మదభంజనంబు నొనరింపన్ సాగ, దిఙ్నాగుఁడున్
విలసత్కావ్యకళావిశారద, కృపాభితూర్థి"నం చొక్కఁ డం
జలియొగ్గం జని కాళిదాసకవి కీమత్కంఠగాద్గద్యతన్. (?)

౬

"పరిపూర్ణప్రతిభావిభాసియగు విద్వాంసుం డసూయామతిన్
బరికింపండు, పరాయికబ్బములు, దిఙ్నాగాభిధానా దిగం
తరదంతిప్రతిమానపండితమహేంద్రా! నీకుమాదృష్టి, సం
స్మరణీయం"బని మ్రొక్కె భూమిపతి మెచ్చన్ గాళిదాసాఖ్యుఁడున్.

౭

ఆపలుకు లచటి గర్వో-ద్దీపితులగు కవులమది గుదించె నసూయా
తాపములు దీరెఁ గాళీ-భూపతుల మొగాన నమరె ముసిముసినగవుల్.

---



కీ. శే. బిడారం కృష్ణప్పగారు

మైసూరు సంస్థానపు ఆస్థాన సంగీతవిద్వాంసులు.




కీ. శే. పి. టి. శ్రీనివాసయ్యంగారు
సుప్రసిద్ధ చరిత్ర పండితులు.



## పుస్తకములనుంచు అలమారు; బిడ్డల ఉయ్యేల

కో. నరసింహాచారిగారు

శీర్షికయందు గల రెండువస్తువులును ఒకదానికొకటిఏట్టిసంబంధమును కలవి కాకపోయినను, అవి రెండును ఇంచుమించుగ నొకవిధముననే చేయబడుచున్నవి. వాటిని చేయుటకు నూలుబండ్లను (చిత్రము 1) ఎక్కువగా సమకూర్చుకొనవలెను. కొయ్యపని చేయుట తెలిసినవారలు ఈవస్తువులకు గావలసిన పలకలను, బద్దలను వారే చేసికొనవచ్చును. లేనియెడల నొక వడ్రంగివద్దనుండి పలకలను, బద్దలను తెచ్చి తక్కినభాగములను తాము చేయవచ్చును. నూలుబండ్లు పెద్దవిగా నుండవలెను. అట్లయినయెడల వాటిలోని రంధ్రములు పెద్దవిగా నుండి లావైన త్రాటిని దూర్చుట కనుకూలముగ నుండును. త్రాడు లావైనయెడల ఎక్కువబరువును మోయగలదు. అలమారునకుగాని, ఉయ్యేలకుగాని అన్నిమూలలయందును సమానసంఖ్యగల నూలుబండ్లుండవలెను.

### అలమారు (Bookshelf)

పుస్తకముల నుంచు అలమారునకు 4 లేక 5 కొయ్యపలక లుండవచ్చును. ఒక్కొక్కపలకయొక్క వైశాల్యము 3'-0" × 1'-0" ఉండిన చాలును. ప్రతిపలకకును నాలుగుమూలలందును రంధ్రములు చేయవలెను (చిత్రము 2). నూలుబండియొక్క రంధ్రములో దూరగలిగినంత లావుగల రెండు నూలుత్రాళ్ల తునుకలను 7 లేక 8 అడుగుల నిడివిగలవాటినిన్ని, రెండుతాళపు చెవులువేయు ఉంగరముల(Keyrings)ను తీసికొనవలెను. పిమ్మట ఒకనూలుత్రాటి యొకకొనను ఒకపలకయొక్క మూలరంధ్రముగుండా అడుగువైపునకు దూర్చుకొని (చిత్రము 4 ర) మరల ఊడిరాకుండునట్లు ముడివేయవలెను. పిమ్మట పలకకు పైప్రక్కనుండు త్రాటికి మొదట నాలుగైదు నూలుబండ్లను దూర్చవలెను. తర్వాత త్రాటిని మఱియొక పలకయందలి యొకమూల రంధ్రముగుండానున్ను, మరల నాలుగయిదు నూలుబండ్లగుండానున్ను మరల మరియొకపలకయొక్క రంధ్రముగుండానున్ను దూర్చుకొనవలెను. అటుపిమ్మట ఒక ఉంగరముగుండా

త్రాటిని దూర్చి చిత్రము 4 నందు జూపినరీతిని పలకల రంధ్రముగుండానున్ను, నూలుబండ్ల గుండానున్ను దూర్చుచు పోయి చిత్రము 4 ల-వద్ద ముడివేయవలెను. అపుడు అలమారుయొక్క యొకప్రక్క పూర్తియగును. ఇదేరీతి రెండవప్రక్కయందుగూడా, త్రాటిని, పలకలరంధ్రములలోను, నూలుబండ్లలోను, దూర్చి పూర్తిచేయవలెను.




ఉయ్యాల

ఉయ్యెలను, అలమారును ప్రారంభించిన విధముననే ప్రారంభించవలెను. కాని అలమారునందలి పై అంతస్థులకుగాను వేసిన పలకలకు మారుగా చిత్రము 3 నందు జూపబడినట్టి బద్దలను ఒకచట్టము (Frame) వలె దూర్చవలెను. అడుగుపలకయొక్క వైశాల్యము 2'—0" × 1'—6" ఉండిన చాలును. ఈపలకకును మూలలందు రంధ్రము లుండవలెను. ఒక్కొక్కమూలకు 8 కాని, 9 కాని నూలుబండ్లుండవలెను. చిత్రము 3 నందు జూపబడిన బద్దలలో నిడుపైనవి ఒక్కొక్కటి 2'—6" × 0'—2½" ఉండవలెను. కురుచ బద్దలు, 2'—0" × 0'—2½" ఉండవలెను. నాలుగు బద్దలయొక్క కొనలయందు రంధ్రములు చేయవలెను. మొదట పలకయొక్క ఒక మూలలోని రంధ్రముగుండా ఒక నూలు త్రాటికొనను దూర్చి అడుగున ముడివేయవలెను (ఒక్కొక్క త్రాడు 8 లేక 9 అడుగుల నిడివియుండిన బాగుండును). తర్వాత త్రాటిని 8 నూలుబండ్లలోను, ఒక నిడివి బద్దయొక్కయు, ఒకకురుచబద్దయొక్కయు కొనల రంధ్రములలో (చిత్రము 5 జ) ను దూర్చి పిమ్మట ఉంగరములోను మరల ముందు కురు

చబద్దలోను, 8 బండ్లలోనున్నదూర్చి త్రాటి రెండవకొనను పలకయొక్క అడుగున ముడి వేయువలెను. ఈ విధమున రెండవ ప్రక్క కూడా త్రాటిని దూర్చి చిత్రము 5 నందు వలె పూర్తిచేయవలెను. పిమ్మట ఉంగర ములు త్రాళ్ల మధ్య భాగమున నుండునట్లు పట్టుకొని చిత్రము 6 నందు జూపిన రీతిని ఒక్కొక్క ఉంగరముక్రింద త్రాళ్లనుచేర్చి కట్టవలెను. ఇట్లు రెండుప్రక్కలను కట్టినయెడల ఉయ్యాలపలకపటవాలుగా జారకనిలువగలదు.

---

## హంస సందేశము

శ్రీమన్మహోపాధ్యాయ కీ. శే. కల్లూరి వేంకటరామశాస్త్రిగారు

శ్రీమంతుండగు దేవుఁ డాతఁడు పవిత్రీభూతమార్తాండవం
శామోదం బలర్పన్ జనించి భువి మాయామానుషుం డౌచు సీ
తామార్గాద్యృతిఁ బావనిం బనిచి జ్ఞాతస్వార్థుఁడై కోమలాం
గీమోహంబున రేయిఁ గల్పముగ వేగించెన్ మహాధీరతన్.

అతఁ డంతన్ గపినాథుసేన నడపన్ యత్నించుచో వేగ భూ
సుతకున్ దూరనివాసితూటకు మనస్తుందీభవద్వేదనా
గతుఁడై యప్పు డుషస్సునందును దటాకక్రీడితంబున్ బరా
జితరాకాదివసామృతాంశుకరరాజిన్ రాజహంసం గనెన్.

అవనిసుతాసమానగతి యామె దుకూలపటంబుఁ బోలుచు
న్నవపువు నామె నూపురపునాదము గల్గిన హంస నెంతో క
న్గవఁ దిలకించి వీరుఁ డణుకాలము మూర్ఛిలెఁ దన్మయాత్ముఁడై
యవసరమందుఁ బూవిలుతు నాజ్ఞ దురంత మటంచు నెంచెదన్.

అతియత్నంబున లక్ష్మణాగ్రజుఁడు లబ్ధాశ్వాసుఁడై యప్పు డా
సతిప్రాణంబులు నిల్పఁగోరి తమిత్రో సందేశ మంపింప నా
దృతిఁ బూజించె సరోజరాజిని బతత్త్రిన్ దూతబాధంబు దా
నతివం గౌఁగిటఁ గూర్చుకంటె బహుమోదాపాది యౌఁ గామికిన్.

హనుమానున్ బహుమానిఁ జేయు టణువంతై తోఁచ నెంతే నప
ర్య నుపాసించుచుఁ గోరె భ్రాంతమతి దాత్యావర్హచక్రాంగముల్
ఘనశైలద్రులతాదులన్ విరహదుఃఖాయన్మనోయుక్తుల
ర్థనసేయన్ సుఖదుఃఖవేది నొకటిన్ బ్రార్థించుటే మబ్రమే.

వేదాంభోధివిభాగవేదియగు నావిశ్వాత్ము సద్వంశ్యముల్
వేధోవాహనమంచు సిద్ధు లనఁగా విందు న్మను న్నిన్ను వా
ణీదేశస్థితిచే గతిప్రగుణమా నీరున్ లభించెన్ శ్రుతి
స్వాదార్థామృతమాధురీగుణముఁ దత్సావర్ణ్యముం బొందుటన్.

ఈ యిహమం దొకానొకర మేము మనుష్యులలోనఁ గేవలం
బోయి సఖా! మహాజగ మహో యనఁగా ఖగరాజ వీవు గా
దే? యయినన్ శ్రితోద్ధరణహేతువునం దగు దీవు దూత్యముల్
జేయఁగ ధాతయున్ సకలసృష్టిసమర్థుఁడు సూతుఁ డయ్యెఁగా.

జగ మన్యంబుగ స్వీయమా మహిమ నిచ్ఛామాత్ర నిర్మింపఁగాఁ
దగు నిత్వోకుల యిట్టిదుర్దశను సందర్శించి యంభోధిమ
ధ్యగరిష్ఠోర్మ్ములచేఁ ద్రికూటగిరి దృశ్యాదృశ్యమౌచోఁ దదం
కగతన్ రాక్షసరాజధానియగు లంకన్ జూడఁబోవం దగున్.

చెలువుఁడ! దివ్యతీర్థముల సీమయుఁ జందనకాననాప్తముల్
మలయసమీరమాతయును మౌక్తికసూతికి మందిరంబునై
నలువగు దక్షిణాదిశకు నాశ్రమదంబును సీతజీవముల్
దలఁచుచు రాక్షసోర్వియను తల్లవదోసము నోర్చి యేగుమీ.

[సశేషము]

# గురుశిష్య సంవాదము

కూచి నరసింహముగారు

## ౮

(నమస్కారాశీర్వచనానంతరము)

గు—ఈ సారి యింత శీఘ్రముగా వచ్చినా వేమయ్యా?

శి—ఆయభాగము లన్నియు నింకను గాలేదు కదా!

గు—అన్నిటిం గూర్చి చెప్పఁజాలఁకుకొన లేదు. భూమిపన్ను, కల్లుపన్ను, అడవులనుండి వచ్చు ఆయము, రెయిల్వేలనుండి వచ్చు రాబడి, నీటివసతుల యాదాయము, వడ్డీరూపమున వచ్చు రాబడి—వీనిం గూర్చి కొంచెముకొంచెము చెప్పి యీవిషయమును గట్టిపెట్టుదము.

శి—చిత్రము. భుక్తికిం గావలసిన పంట యుంచి రైతులనుండి మిగిలినదంతయుం బన్నురూపముగాం బరిపాలకులు పుచ్చుకొనుచున్నట్లున్నారు.

గు—అవును. అదియే చేయఁగూడని పని. కఱవు కాలములకును, గాలు సేతులు సవరించుకొనుటకును, సహాయభూతముగాం గొంత సస్యరూపధనము కర్షకుల కడ నుండనిచ్చుట ప్రభుత్వమువారికి విధి. అట్లు చేయకుండుట సేద్యకాండ్రకు బాధగా నున్నది.

శి—వీరెహో! ఆమాట నమ్మఁజాలను. అంత కష్టముగా నున్నచో, రైతులేల భూములు వదలిపెట్టిపోవుట లేదు?

గు—సుఖముచేతఁ గాదు, గత్యంతరము గానక వదలిపెట్టి వారు పోఁజాలకున్నారు. అన్నము దొరకుచో టగపడినఁగదా యెవఁడైనం దనయంబలి దిగవిడిచి పోవును! అదియుఁగాక హిందూదేశస్థు లున్న దానితో, నెంతకష్టమైనం దృప్తిపడియుండురు గాని, సుఖముకై మార్పు నపేక్షించి క్రొత్తవృత్తిని జూచుకొనరు. ఇది వారి ప్రకృతి. అందుచేతనే మనదేశపురయితు, నూతనారంభసంచలన మనుమాటయే లేక తాతలనాటినుండి వచ్చుచున్న తన ప్రాఁతభూమినిం బట్టుకొని పశువువలెం బాటుపడుచు, బహుకుటుంబియై, అప్పులపాలై, తిండి చాలక కడుపాకప్రక్క మాఁడుచుకొని, యర్ధభుక్తితోం గాలము గడపుకొనుచున్నాఁడు.

శి—ఇది యెవరి దోషము?

గు—ఉపవృత్తులు కల్పించుకొని, యున్న జీవనాధారమునకుం దోడుగాం గొంత డబ్బు సంపాదించుకొనకుండుట రయితు తప్పు. శక్తివంచన లేకుండం గరభారము తగ్గించి కర్షకుల సుఖజీవనమునకుం దోడ్పడకుండుట పాలకుల తప్పు.

శి—ప్రస్తుతపాలకులు భూమిపైం బన్ను లెట్లు వేయుచున్నారు?

గు—సర్వత్ర యొకరీతిగానున్నట్లు కాన్పింపదు. కాని, యీభూమిమీఁద నింత పంట పండవచ్చు నని యూజ్జాయించి సిస్తునిర్ణయించి, యాసిస్తు దాదాపుగా ౩౦ ఏండ్లవఱకు వసూలు చేయుచుందురు. అది ధనరూపముగాం జెల్లింపవలయును. ఆగడువు తర్వాతం గరనిర్ధారణముకై తిరుగ సంచనచేసి, అపన్ను హెచ్చించుటయో తగ్గించుటయో చేయుదురు. సాధారణముగా హెచ్చించుటయే జరుగుచుండును.

ఊహించిన పంటకును, పండిన పంటకును ఎంతయో వార యుండును. ధనరూపముగా విధించిన పన్నునకును, దానికై యుద్దిష్టమైన సస్యభాగముయొక్క విలువకును వార యుండును.

శి—పండినపంటలో రయితు చెల్లించుపన్ను సగటున నెంతభాగ ముండును?

గు—40%—అయిదు భాగములలో రెండుభాగములు అని రాధాకమలముకర్జీ పండితుఁడు వ్రాసినాఁడు.

ఈపన్నులు చెల్లించి ప్రాతయప్పులపైవడ్డిచెల్లించి,కఱవు కాలమునకుఁ గావలయు గ్రాసము నిలువచేసికొనుట, రైతునకుఁ గడుఁగష్టమని ఆయన యభిప్రాయము.

శి—పూర్వ మీ భూమిపన్ను లెట్లుండెడివి?

గు—పూర్వ మనఁగా?

శి—బ్రిటిషురాజ్యమునకు సన్నిహితపూర్వమున —మొగలురాజ్యములో.

గు—అట్లే యుండెడివనియును, పూర్వప్రభువుల ననుసరించియే, తాము భూమిసిస్తు లేర్పాటు చేసినామనియు ఆంగ్లప్రభువులు చెప్పెదురు.

శి—సరే, ఇఁక నేమి? ప్రభుత్వమువారి పన్నులు భరింపలేమని ప్రజలు మొఱ్ఱపెట్టుటకు ,వింత హేతు వేమియుఁ గానిపింపదు.

గు—సూక్ష్మదృష్టికిఁ గానిపింపకమానదు, వినుఁ—తా మనుకరించి పోవుచున్నామని యిప్పటి ప్రభువులు చెప్పుపన్నులు యుద్ధాదిసంక్షోభములచే రాజ్య మశాంతముగా నున్నప్పుడు మొగలులు తాత్కాలికముగా విధించిన పన్నులుగాని, మామూలుగా వేయు పన్నులుగావు. మనవారు వేయునవి స్థిరమైన పన్నులు. ఇది యొక భేదము.

శి—శాశ్వతకరనిర్ధారణసమయములందు హెచ్చు చేయుచుందురుగాన, నివియు స్థిరములని చెప్పఁజాలము. ఇతర భేదము లేవియో సెలవిండు.

గు—మొగలుప్రభుత్వములో రయితులు పన్నులను ధనరూపముగాఁ గాని, ధాన్యరూపముగాఁ గాని తమ యిష్టానుసారము చెల్లించుట కధికారు లొప్పుకొనెడువారు. అందేది తనకు లాభకారిగానున్నఁ గర్షకుఁ డారూపముగాఁ బన్ను చెల్లించుకొనెడివాఁడు.

శి—ఇప్పు డట్లు గాదు. ఆ పీకులాటలు పెట్టుకొనక, ప్రస్తుతప్రభువులు స్థితిగతు లెట్లున్నను సరే, పన్నులన్నియు ధనరూపముగానే గ్రహించుచున్నారు. భేదము లింకేమైన నున్నవా?

గు—ఒకటి యున్నది. దుర్భిక్షసమయములలోఁ గరుణించి, పూర్వప్రభువులు విధించినపన్నులు వసూలు చేయకుండుటయో, తగ్గించి వసూలుచేయుటయో, చేసెడువారు. ఇప్పు డాసదుపాయములు లేనందున యుక్తకాలమున సిస్తుచెల్లించుటకై యప్పులపై నప్పులుచేసికొనుచు, ఘోరమైన చక్రవృద్ధుల నిచ్చుచు, అనుకూలమైనవిక్రయకాలమువఱకు వేచియుండలేక తత్పూర్వముననే పండిన పంటలను అల్పమూల్యముల కమ్మివేయుచు, రైతు సకల బాధలు పడుచున్నాఁడు.

శి—రైతిట్టి దుస్థితిలోనున్నట్లు శ్వేతముఖుల ప్రమాణ మేమైన నున్నదా?

గు—పెద్దప్రమాణమే యున్నది. మొన్డానెల్డు మంత్రిగారిది.

శి—ఆయన యేమని చెప్పినారు?

గు—"అమితముగా పన్నులువేయుటయు, వానిని కఠినముగా వసూలు చేయుచుండుటయు నిస్సందేహముగాఁ బ్రజలను దరిద్రులఁజేయుచున్నవి. శుల్కగ్రహణపద్ధతి యథాశాస్త్రీయముగా రాజ్యతంత్రదృష్టిని నిరాక్షేపముగా నున్నట్లు కాన్పించినప్పటికిని, వ్యవహారమునందు మహాప్రజాపీడాకరముగా నుండి యతితీవ్రముగా ఖండించి దూషించుట కనువైన విషయమై పోయినది."—అని.

శి—మఱి యెవరైన దీనిగూర్చి వ్రాసినారా?

గు—బ్లంటుగా రిట్లు వ్రాసినారు:—

"భూమిపన్ను ధనరూపముగాఁ జెల్లింపవలయునని చేసిన నిర్బంధమే, నిశ్చయముగా రయితు ఋణగ్రస్తుఁడై పోవుటకంతకుఁ గారణమని నా నమ్మకము...... ఆంగ్ల పరిపాలనవలన హైందవకృషీవలవర్గమునకు వచ్చిన యనర్థములలో నిది పెద్దది...బలవన్మరణోపాయము నుండి రైతును మనము రక్షించుచున్నాము గాని, పస్తులవలన నతఁడు కృశించి మందమందముగా మరణించు నపాయ మెక్కువ చేయుచున్నామేమో యని నాకు భయమగుచున్నది."

శి—పరపతిసంఘములు స్థాపించి యిప్పుడు రైతు నప్పులవాని బారిఁ బడకుండ రక్షించు ప్రయత్నములు చేయుచున్నారు కాఁబోలునే!

గు—అది మంచిదే, కాని దానివలన నతనిబాధ పూర్ణముగాఁ బోఁజాలదు. బాధానిర్మూలనమున కమోఘమైన సాధనము పన్నుభారము తగ్గించుట యొక్కటియే. ఇఁక నీవిషయము వదలిపెట్టి కల్లు మున్నగు స్వదేశీయమాదకద్రవ్యములపై వేయు సుంకములఁగూర్చి మాటాడు కొందము.

శి—విదేశీయమద్యములపైఁ బన్నువేయరా?

గు—వేయ కేమి? మరచితివి కాఁబోలు! అది మొదటిబాపతులో—ఎగుమతి దిగుమతి పన్నులలో—చేరిపోయినది. ఆబాపతును ఇంగ్లీషులో Customs అందురు; దీనిని Excise అందురు.

శి—ప్రస్తుతదేశసంక్షోభ కారణములలో ఈకల్లు పన్నొకటి.

గు—హిందూదేశప్రజావర్గములోఁ ప్రధానులు హిందువులును, మహమ్మదీయులును. ఆమతములు రెంటును గూడ మద్యపానమును నిషేధించుచున్నవి.

శి—ఎందుచేత?

గు—పూర్వర్షులు ఆదేశరూపముగా విధినిషేధములు చేసిరిగాని, వానికి హేతువులు చెప్పలేదు. అవి మనము తేలికగా నూహింపఁగలము. ఆరోగ్యహాని, బుద్ధినాశనము, నీతినష్టము, ఇతరపాపకరణప్రవృత్తి ఇట్టివన్నియు మద్యపానమువలనఁ గలుగును గనుక, నది మహాపాతకములలో నొకటిగాఁ బరిగణింపఁబడుచున్నది. తాత్కాలికప్రమత్తతాసుఖముచే మూఢులు మద్యపానమును వదలలేకున్నారు.

శి—వారు వదలలేకున్నఁ బ్రభుత్వమువారు తమ శాసనబలముచే మానిపింపరాదా?

గు—ధనతృష్ణచే మానిపింపఁజాల కున్నారు. తాము మానిపింపకపోవుటయే కాక, దాని నణఁగింపఁ బ్రజానాయకులు చేయు ప్రయత్నములకు విఘ్నములు కలిగించుచున్నారు. పన్నులరూపమున వచ్చు నాదాయములలో నిది పరమనికృష్టమైన యాదాయము.

శి—నాయకుల బలాత్కారముచేఁ బరిపాలకులు కొన్నిపట్లఁ ద్రాగుడు తగ్గించు నేర్పాటులు చేయుచున్నారని వినుచున్నామే!

గు—అది నటన; మనదేశపు కల్లుత్రాగుడు తగ్గిన విదేశమద్యపానము హెచ్చుట కవకాశములు గల్పించుచున్నారు. "బియ్యర్ మున్నగువిదేశమద్యములు ప్రజలు త్రాగుట పెద్దపట్టనములలో హెచ్చుచున్నది." అని 1927-28 సం. బొంబాయిరాష్ట్రపరిపాలనపు రిపోర్టులో వారే వ్రాసి యొప్పుకొనుచున్నారు.

శి—నీతిభ్రంశహేతువై, ఇదియుఁ బ్రజాపదార్థోత్పాదన శక్తి తగ్గించుచున్నదన్నమాట. ఇఁక నడవి పన్నులఁగూర్చి చెప్పుఁడు.

గు—అడవులు సంరక్షించి పెంచుటవలన, అనావృష్టిబాధ కొంతవఱకు తగ్గించి ప్రభువులు దేశక్షేమమే కావించుచున్నారు. అందులకు వారి కెంతయు మనము కృతజ్ఞులమై యుండవలసినదే కాని "పరిపాలన విధానము ప్రజలకు బాధాకరముగా నున్నది; అట్లుండ నక్కఱ లేదు......చెట్లయాకులు పూర్వ మెరవుగా జను లుపయోగించుకొనెడువారు, దాని కిప్పు డాటంకము వచ్చినది. పశువులు మేయు పచ్చికప ట్లిప్పుడు తగ్గిపోయినవి. అందుచే మేఁతలేక పశువులు చచ్చిపోవుచున్నవి. ప్రజలకుఁ బూర్వము కలప యుచితముగా దొరకుచుండెడిది. మోపున కింత మూల్య మీయవలయునని యిప్పు డేర్పాటులు చేసినారు" అని బ్లంటుగారు చెప్పినారు.

శి—కనుక నీస్వల్పబాధలుకూడ జనులను సత్వహీనులను జేసి వారి వస్తూత్పాదనశక్తి తగ్గించుచున్న వన్నమాట. ఇఁక రెయిల్వేలను గుఱించి మాటలాడు కొందము.

గు—అవియుఁ బ్రజల యర్థసంపాదనశక్తి కడ్డు వచ్చుచున్నవి. పాక్షికపు బాడిగలు విధించి విదేశవర్తకుల కుపకారమును, మనదేశపు వర్తకుల కపకారమును,

గావించుచున్నారని వెనుకఁ జెప్పితిని; అది జ్ఞప్తిలో నున్నదా?

శి—ఉన్నది. వ్యయములనుగూర్చి ప్రసంగించుచుఁ జెప్పినారు.

గు—రెయిల్వేలు కేవలము అనర్థకారులని యెవరును జెప్పసాహసింపరు. మితముగా వాణిజ్యావశ్యకతను బట్టి వేసికొను అయోమార్గములు దేశమునకు లాభకారులగును. అమితముగా అనావశ్యకముగా వేయఁబడి దుర్వినియోగము చేయఁబడు రెయిలుబాటలు దేశానర్థకములు గాకమానవు.

శి—నిజమే, మితముగా జాగ్రత్తగాఁ జేసిపెట్టుకొన్న నిప్పు చలిగాఁచుకొనుటకును వండుకొనుటకును ఉపయోగించి ఇంటివారిని సుఖపెట్టును. అదియే యనర్థస్థలములందుంచినఁగాని అమితముగాఁ గూర్చినఁగాని, అజాగ్రత్తగా వాడినఁగాని, ఇంటికిని ఇంటివారికినిఁగూడ ముప్పుదెచ్చును.

గు—నీవుచెప్పినది నిజము. మనదేశమునకు రెయిల్వేలవలనఁ గలుగుకీడులు కొన్ని యితఃపూర్వము చెప్పితిని; అవి నీకు జ్ఞప్తిలో నున్నవా?

శి—ఉన్నవి. జీవనాధారములగు మనదేశపు ముడిసరకులు పరదేశములకుఁ గొనిపోవుట యొకటి. అనావశ్యకములయిన విదేశభోగపదార్థములను దేశములోఁ బ్రవేశపెట్టి ప్రజలను దరిద్రులఁజేసి, వారి పరాపేక్ష నెక్కువచేయుట యొకటి.

గు—సరియే. అవిగాక పూర్వవృత్తుల క్షీణింపఁజేయుట మూఁడవవిపత్తు.

శి—అది నాకుఁ దెన్నగా బోధపడుట లేదు.

గు—బండ్లప్రయాణములు తగ్గినవి; కావడికోఁతలు తగ్గినవి.

శి—రెయిలుకడకును, రెయిలునొద్ద నుండియును, సామానులుమోసి జీవించుకూలివాండ్రు లేరా? బండ్లు తోలుకొని బ్రతుకువారు లేరా?

గు—"తగ్గినవి" అంటినిగాని, ఇప్పుడు "లేవు" అని చెప్పలేదు.

పూర్వము వ్యవసాయము చేసికొని జీవించువాని, కతని యెద్లు వర్షాకాలమునందుఁ బొలముదున్నుట కుపయోగించెడివి; వ్యవసాయము లేని రోజులలో సవారీబండ్లులాగి, యజమానున కుపజీవికను గల్పించి, డబ్బు సంపాదించిపెట్టెడివి. పొలముపను లయిపోయినకాలమందిప్పుడు రయితు లూరక కూరుచుందురు.

శి—కనుక యేఁడాదిలోఁ గొంతభాగము రయితును అతనియెద్దులనుగూడ, దేశభాగ్యాభివృద్ధికరములగు పనులేమియుఁ జేయక సోమరులై పడి యుందురన్నమాట. దేశానర్థహేతువులలో నిదియొకటి. ఇఁకఁ గృష్యుపకారములగు నీటివసతులనుగూర్చి చెప్పుఁడు.

గు—కృషివృత్తి జలాపేక్షకమైన వ్యాపారము. భూమి యెంతసారవంతమైనను, యుక్తకాలములోఁ గావలయు నీరు రాకున్నఁ బంటలు చెడిపోక మానవు. అనాదిగా హిందూప్రభువులు తమ యన్నివిహితకృత్యములలోను ఇది ప్రధానతమమైన కృత్యముగా భావించుకొనెడువారు. ధర్మాత్ములు, పుణ్యసంపాదనముకొఱకు నూతులు చెఱువులు త్రవ్వించెడువారు; ప్రభుత్వమువారు నదుల కానకట్టలుగట్టి కాలువలు త్రవ్వించి, పొలములకు నీళ్లు పాఱించి, సేద్యకాండ్రకుఁ దోడ్పడెడువారు.

శి—ఇప్పుడు బ్రిటిషువారును అట్లు చేయుచున్నట్లున్నారే పాపము!

గు—కొంతవఱకుఁ జేయుచున్నారు. చేయవలయునంత, చేయఁగలిగినంత—చేయుచుండుట లేదు. అంత సొమ్మును రెయిల్వేలే మ్రింగివేయుచున్నవి. అవి పరిపాలకుల కనేకకారణములచేఁ బ్రియతమములైనవి. వానికిఁ బోఁగా మిగిలిన యల్పమూల్యము నీటివసతులకు వినియోగించుచున్నారు. దేశాభ్యుదయమున కది చాలదు. దేశములో సగముభూమి యింకను కేవలము ప్రజల స్వప్రయత్నమువలననే సాగుచేయఁబడుచున్నదని "షా" గారు వ్రాయుచున్నారు.




౮. "ఎంపయరు స్టేటు బిల్డింగు", న్యూయార్కు, అమెరికా
80 అంతస్తులకుపైగా కలది.

శి—ఇఁక వడ్డీవలన వచ్చు నాదాయమునుగూర్చి చెప్పుఁడు.

గు—ఈక్రిందిపట్టిక పరిశీలింపుము:—

హిందూదేశములో నిచ్చిన యప్పులమీఁద
వడ్డీమొత్తము (లక్షలలో)

| | |
|---|---|
| మ్యునిసిపల్సంఘములు సంస్థానములు మున్నగువానికిచ్చిన యప్పులపైని | 227 |
| రెయిల్వేలు, ప్రావిడెంటుఫండు మొ. వానిపైని | 42 |
| రైతుల యప్పులపైని | 31 |
| చిల్లరయప్పులపైని | 29 |
| | 329 |
| ఇంగ్లండులోనిచ్చిన యప్పులపైని | 327 |
| వెరసి | 656 |

ఎవ్వ రెచ్చట నెంతెంత వడ్డికి ఋణము లిచ్చినారో, ఆపైనను పట్టీనిబట్టి స్పష్టముగాఁ దెలియదు. ఒక సంగతిమాత్రము మన మూహించి గ్రహించుకొనవచ్చును.

శి—అది నేనును జెప్పుకొనఁగలను. హిందూదేశములో నిచ్చినఋణములకు దాదాపుగా సమానమైన మొత్తమును పరదేశస్థులకు అప్పిచ్చినారని తెలియవచ్చుచున్నది.

గు—దానివలన నష్టమేమో చెప్పఁగలవా?

శి—చెప్పలేకేమి? డబ్బులేక, ఋణము దొరకు మార్గములులేక యంతకంతకు క్షీణదశ నొందుచున్న వ్యాపారము లనేకములు మనదేశములోఁ గన్పట్టుచున్నవి. వాని పోషణమున కుపయోగింపఁబడవలయు సొమ్ము అన్యథా వినియోగింపఁబడినది.

గు—బాగుగానే గ్రహించినావు. సుప్రసిద్ధవాస్తు విద్యావిశారదుఁడును, అర్థశాస్త్రవేత్తయు నగు సర్ విశ్వేశ్వరయ్యగారు పూనాపట్టణమందలి కళాశాలలో యువజనసంఘమున కుపన్యాస మిచ్చుచుఁ జెప్పిన యీ మాట లాలింపుము.

శి—చిత్తము.

గు—"మన దేశమందలి యీభాగములోనివసించు వారు కొందఱు విద్యాసంగ్రహార్థము విదేశములకుఁబోయి కృతకృత్యులై వచ్చి యిట లాభకరములగు వ్యాపారములు బయలుదేఱఁదీయుటకుఁ బ్రయత్నించి పెక్కుపట్ల పాపము! విఫలమనోరథు లైనారు. ఎందుచేత? పరిపాలకుల యవలంబనము లేదుగనుకను, దేశస్థులనుండి ధనముఁ గూర్చుకొని దానిని జక్కఁగా వినియోగించు నేర్పాటులు చేసికొను సామర్థ్యము ప్రజలకు లేదుగనుకను. ప్రభుత్వమువా రిట్టి యుద్యమములఁ బ్రోత్సాహపెట్టుటకుఁ దగినశ్రద్ధ వహించుచున్నట్లు కాన్పింపదు; వారి నట్టి శ్రద్ధవహించునట్లు చేయుశక్తి ప్రజాభిప్రాయమునకు లేదు."

శి—అనుభవశాలిగనుక నున్నపరిస్థితులు గనిపట్టి యథార్థము చెప్పినాఁడు.

గు— ఆయన మన నల్లరాయన యగుటచేఁ బక్షపాతబుద్ధితో నట్లుచెప్పినాఁ డని కొందఱనుకొన వచ్చును. తెల్లవారిలోనే గొప్పవాఁ డగు "సర్ డానియల్ హామిల్టన్"గారి నుండి వచ్చిన యీ సూక్తులు వినుము—

"పెచ్చుగానున్న పంటలను పైకి లాగివేయుటకు మనము వారికి రెయిల్వేల ననుగ్రహించినాము; కాని వాని మూల్యములను రాఁబట్టుకొని చక్కఁగా వ్యవహరించుకొనుటకుఁజాలిన కోశిలను (Banks) బ్రసాదింప లేదు. ప్రజలసస్యము సర్వేతరప్రపంచమునకును బోవుచున్నది; డబ్బు సాహుకారుచేతులలోను వర్తకుని చేతులలోను బడుచున్నది; పాపము! ప్రజలు పైతొమపా లగుచున్నారు."

శి—ఈయనయును,ఉన్నదున్నట్లే పలికినాఁడు. ఆయమూలములన్నియును అన్యదేశముల కుపయోగపడుచున్నప్పుడును, దేశక్షేమమునకుఁ బ్రతికూలములైన సంకల్పములు ప్రభుత్వమువారి హృదయముల నాక్రమించుకొని యున్నప్పుడును, దేశప్రజలు దరిద్రులు గాక ధనవంతు లెట్లు కాఁగలరు?

గు—నేఁటికీసంభాషణము గట్టిపెట్టుకొందము.

శి—అటైన సెలవు; నమస్కారము!

గు—శుభమస్తు!

## "అన్యాపదేశశతకము"నుండి

కొమండూరు కృష్ణమాచార్యులుగారు

ఆతపఖిన్నులై పలువు రధ్వగు లొక్క మహావటక్షమా
జాతము జేరి రందొకఁడు చల్లని నీడకు మెచ్చ నొక్కరుం
డాతతశాఖలం దునిమి యప్పినమూహ మొనర్ప నెంచె దు
ర్జాతుఁ డొకండు మ్రానుగొని చక్కని చెక్కలు గోయఁ దార్కొనెన్.

గ్రామవరాహశాబకజిఘాంసువులై చను శునకకుర్కుర
స్తోమము లుర్విఁ బుట్టి వెసఁ ద్రుంగిన భంగ మొకండు గల్గునే
శ్యామలశైలసానువుల స్వైరవిహారము సల్పఁగావలెన్
భీమమదేభకుంభముల వ్రీల్చవలెన్ మృగరాజు గావలెన్.

స్వజనుల వీడి దుస్తరవిశాలజలార్ణవముల్ దరించి దు
స్త్యజనిజజీవముల్ తృణవిధంబున నెంచి పటీరలోలతన్
బ్రజ లరుదెంచి నీదు విషవహ్నుల బెగ్గిలిపోయి రింక నో
భుజగమ! స్వస్థచిత్తమునఁ బొందుము చందనగంధసౌఖ్యముల్.

కకుబంతంబులదాఁకఁ గ్రుమ్మరి మహాకాంతారమున్ జేరి దై
వికలబ్ధంబగు భూరుహాగ్రముపయిన్ విశ్రాంతికై ముక్కునన్
ఒకఁడొక్కండుగఁ బుల్ల లేరికొని గూడొక్కండు నిర్మించి యం
దిక కాకంబు వసింపఁగోర వనవహ్నిం గాలె నక్కానయున్.

తీరమునందు గాల్నిలిపి దీర్ఘకరాగ్రము సాఁచి యుచ్చమై
వారిఁ గొనంగరాదె గజవల్లభ, కూలముఁ గూలఁద్రోచి యం
భోరుహషండముల్ వెతికి పుష్కరిణీజలముల్ గలంచె దే
వ్వారల కగ్గు మత్తుఁడ పిపాస జనించిన నీకుఁ గాదొకో.

కాకమ! యెంతకాల మిటు గ్రామకుటీతటులన్ వసింప నీ
యాఁకలి దీరు హంసవయి యంబుజనాళములన్ సరోవరా
నీకములన్ భుజింపు తను నీలిమ తెల్పొనరించుకొమ్ము నీ
కాకలహంస కాపయిన నంతర ముండిన నేన దండ్యుఁడన్.

ఘాతుకసత్వదంష్ట్రికలఁ గాసిలకుండ మృగాళిఁ బ్రోతువో
నీతిపథంబుఁ దప్పక వినీతులఁ గాతువొ మిథ్యసర్వముల్
లాతిమృగంబులెల్ల వనులం దనువోమి మృగేంద్రనామవి
ఖ్యాతికి మెచ్చి వచ్చె హరిణాధిప! దర్శన మీయ భారమా?

సలిలావాన మొకింత సొచ్చితిని సుస్వాదూదకం బానితిన్
జలముల్ పైఁ జిలికించికొంటి మరలన్ స్వస్థానముల్ గంటి నా
తలఁ దప్పేమని యేనుఁగుండెను; సముత్ఖాతాబ్జినీషండమై
కలుషాంభోనివహంబునై చదిసె తత్కాసార ముత్కూలమై.

నదులకు నాయకుండ వవినశ్వరమూర్తివి సర్వదిగ్వధూ
పదముల నంటు నీయలఘువారితరంగము లింత నిక్కవం
బుదధివరేణ్య! దప్పిగొనియున్న మనుష్యు నుదన్య దీర్తువే
నది ఫల; మబ్ధి వైన గ్రహణావసరంబులఁ గ్రుంకనేకదా.

అంబుధి దాఁటి చండపవనాహతి కోర్చి జరత్తృణంబు గా
యంబని తెంపుసేసి చన నాత్మ విషాదము నొంద నేలొకో
అంబరచుంబిసౌధముల హాయిగ నిద్దురవోయి లేవ హ
స్తాంబుజసీమ నిల్చును మహాధనరాసు లటంచు నెంచెవో.

తొలకరి వానకారులును దోయజవైరి సముద్గమంబులున్
బలుమరు వోయెఁ గాని జడవారిధి వేల నతిక్రమించఁగాఁ
దలఁ కెడు నంచు నెంచకుము దైవవిధిన్ విడివడ్డ మేదినీ
వలయము శూన్య మద్రు లను వార్తలు మిథ్య దిశల్ ఖపుష్పముల్.

వచ్చు వసంతలక్ష్మి వనపంక్తుల సంపద లింక హెచ్చునం
చిచ్చకముల్ వినంబడియె నెల్లెడలన్ దెలియంగరా దహో
యెచ్చటఁ జూచినన్ దరువు లెండిన రీతిని దోఁచె మ్రోడులై
పచ్చనిచూకు లేదు సుమవారము దూర మిదేమి చిత్రమో.

---

# ఇమ్మడి అరికేసరి భూపాలుని వే(లే)ములవాడ శిలాశాసనము

భావరాజు వేంకటకృష్ణరావుగారు, బి. యే., బి. యల్.

ఈశాసన ప్రతిబింబములను నేను హైదరాబాదు ఆంధ్రపరిశోధకసంఘమువారి వద్దనుండి సంపాదించి శాసనమును చదివి ప్రకటించుచున్నాను*. వారి శాసనముల (అముద్రిత) పట్టికయం దిది ౧౧ వదిగా గుర్తుపెట్టబడియున్నది. ఈశాసనమును శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యులవారు వే (లే) ములవాడలో సంపాదించినట్లు ఆంధ్రపరిశోధక సంఘమువారి ౧౯౩౬-౩౭ సంవత్సరపరిశోధకనివేదికయందు తెలిపియున్నారు†. ఆ నివేదికయం దీశాసనము దొరకిన తావును గురించి చదువగా ఇట్లున్నది:

"వేములవాడ దర్శనీయప్రదేశము. చరిత్ర మీగ్రామమున నిమిడి యున్నది. ఆంధ్రరాజన్యుల త్యాగముచే నీగ్రామము నిత్యము నైశ్వర్యముతో తులతూగుచున్నది. దీనిని వేములవాడయని, లేములవాడ యని నాగరికులు వ్యవహరించుచున్నారు. ఇట భీమేశ్వరాలయము మిగుల గొప్పది. అందలిలింగము, పానవట్టము మిక్కిలి యున్నతముగా బురుషప్రమాణమును మించి యున్నవి. ఆలయము ముందు ముఖమండపనిర్మాణ మత్యాశ్చర్యకరముగానున్నది. పలకలు పలకలుగా బైని శిలలనుగూర్చి ఎత్తు శిలలతో దీర్చబడిన యీమండపప్రశస్తిని దెలుపుటకు జాలపుటలు పట్టును. ఈయాలయమున కెదురుగా బహిరంగస్థలములో నొక శాసనము గలదు. ఇది చాళుక్యరాజులది. శిల యంత ప్రశస్తమైనది గాదు. వర్ణములు సహితము స్ఫుటముగ లేవు. ప్రత్యంతరము దీసితిమి. ఈగ్రామము సుప్రసిద్ధుడగు వేములవాడ భీమకవి నివాసస్థానము. దక్షుడు యజ్ఞముగావించిన స్థలమగుటచేత క్షేత్రమహత్త్వమునుబట్టి యీస్థలము ద్రాక్షారము. భీమకవికి వరప్రదాత యిచటి భీమేశ్వర మహాదైవతమే. ఈకవినిగూర్చి మేము సంపాదించిన చరిత్రాంశములు ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన కవిజనాశ్రయమున జర్చితములై యున్నవి. ఇపు డేమియు నూతనాంశములు తెలియలేదు. రాజేశ్వరాలయమునకు తరువాత బేర్కొనదగినది క్షేత్రరా

---

* ప్రతిబింబముల నడిగినవెంటనే ఒసగిన సంఘమువారికి నా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను. ప్రతిబింబములను సంపాదించి చాలకాలమయినను, నే నింతవఱకు శాసనమును అనివార్యములయిన కారణములవలన బ్రకటింపలేకపోతిని. చారిత్రకప్రియుల కీవిధముగా ఎగ్గు సలిపితినని విచారించుచున్నాను.

† బహుప్రయాసల కోర్చి త్రిలింగదేశము పర్యటనము గావించి శాసనములు సంపాదించిన శేషాద్రిరమణకవులు వందనీయులు.

జము గ్రామమున కానుకొని గొప్ప తటాకము. దాని కట్టపై నొకవిశాల స్థల మేర్పరిచి యం దీయాలయమును గట్టిరి. తటాకము మధ్య నొక గుండము గలదు. దాని ధర్మగుండమందురు. దీని సోపానములకు శాసనశిలలను నెలకొల్పిరనియు, ఎండలు బాగుగా గాసినచో నీ రింకి శాసనములు బయల్పడు నని చెప్పిరి. గుండమునిండ నీ రుంటచే శాసన సందర్శనమునకు వీలు కాదయ్యె. తటాకములలో నన్నివైపుల జైనవిగ్రహములుగలవు. ఎన్నియో విగ్రహములు పూడిపోవుచున్నవి. ఇట నున్నవిగ్రహములు కొన్ని పాము పడగక్రింద నున్నట్లును, మరికొన్ని ధ్యానదృష్టితో నున్నట్లును గానవచ్చును. ముఖద్వారమువద్దను ప్రాకారమునకు లోపలతట్టును గర్భాలయములోనికి బోవుచోటనుగూడ జైన విగ్రహములు వివిధములు వివిధాకృతులు గలవి పెక్కులుగలవు. వీనిని బట్టిజూడ నీదేవళము జైనాలయమేమో యను తలంపున కవకాశము గలుగుచున్నది. ఆలయములోనికి బోవుచుండ బ్రాకారములో నెడమచేయివైపొక మహమ్మదీయుని సమాధి కలదు. మహమ్మదీయులంతవఱకు వచ్చి పూజాదు లొనర్చుట కలదు. ఇందే విష్ణ్వాలయము కలదు. ఈ రాజేశ్వరాలయములో శూద్రాదులకుశివపాదములకు బదులు పెద్దపాదరక్షలు తలపై నుంతురు. ఇట్టి యాచార మిచట నేల యేర్పడెనో కారణము విచార్యము.

గర్భాలయమున కెడమవైపు రెండు శాసనములు గలవు. ఒక విశాలమగు శిలపై నొకవైపే వ్రాయబడినది. అక్షరములు మిగుల గుంటలుగ జెక్కలేదు. పైగ తీర్థసేవకులు తమ నూనెచేతులచే దాకుటచే శిలపై మట్టి పట్టినది. చెంత మరియొక శాసనము చాళుక్యరాజునాటిది సంస్కృతశ్లోకమయమగునదికలదు. నాలుగువైపుల వ్రాయబడినది. పశ్చిమచాళుక్యులలో నొకనిచే నిది స్థాపింపబడినది. ఈశాసనశిలపై దీపారాధనచేయుటచే నక్షరములు పూడిపోవుటగాక మయినము పైన పేరుకొని శాసనశిలయని సైతము గుర్తింప వీలులేక పోయినది. చాలశ్రమచేసి ఆతిని బాగుగగీకి గుంటలజెక్కి ప్రతిదీసితిని. ప్రతి చాల బాగుగ వచ్చెను."

పరిశోధకనికేతక, పుటలు ౬, ౭.

ఇంకఁగల చర్చనీయాంశములయిన వేములవాడ, భీమకవిజన్మస్థానము, దక్షవాటికానిర్ణయము, భీమేశ్వరుడు, మున్నగువాటితో నిపుడు నాకు ప్రసక్తి లేకపోయినను రెండు మాటలు మాత్రము దెలుపవలసి యున్నది. ఇక్కడశివాలయములనున్న దేవరకు భీమేశ్వరనామము ప్రాచీన కాలమునుండియు నున్నట్లు గాన్పించదు. ఇటీవలివా రెవరో ముడిపెట్టి యుందు రని నా యూహ. ఇందులకు మన మిపుడు ప్రకటించు శాసనమే ప్రమాణము. ఒకచోట శివుడు రాజేశ్వరనామమున బరగుచున్నాడు. మరియొకచోట బద్దెగేశ్వరుడని పరగుచున్నాడు. బద్దెగనృపాలుని పేరట

ప్రతిష్ఠింపబడిన శివాలయ మగుటచే నా పేరు వచ్చి యుండవచ్చును. ఇచ్చటి శివదేవరలకు రాజేశ్వరు డనియు (రాజాదిత్యేశ్వరుడు), బద్దెగీశ్వరు డనియు నీ శాసనమువలననే దెలియు చున్నది. స్వవిషయాభిమానముగల పండితులు బద్దెగీశ్వరుని, రాజేశ్వరుని తమ ఇచ్చవచ్చినట్లు భీమేశ్వరుని జేసి యిది దక్షవాటిక యని కల్పించి వేములవాడ భీమకవి జన్మస్థాన మిది యని ఋజువుచేయ బొల్పడిరి. వేములవాడ భీమకవి తెలుఁగునాఁడు (తెలింగాణము) వాస్తవ్యుడైనట్లు తోచదు. ఈగ్రామమునకు ప్రాచీన కాలమున నెప్పుడును వేములవాడయని పేరున్నట్లును గాన్పింపదు. కావున, ఈవిషయ మింతటితో వదలి శాసనాంశములకు మరలుదును.

రాజేశ్వరాలయమున గల రెండుశాసనములలో నొకశిలకు నాలుగు వైపులను అక్షరములు చెక్కబడిన శాసన మిది. శ్రీవేంకటరమణాచార్యులుగారిది పశ్చిమచాళుక్యులలో నొకరిదై యుండవచ్చు నని వ్రాసినారు. ఈ శాసనప్రతిబింబమును మిక్కిలి శ్రద్ధతో దీసిన శ్రీఆచార్యులవారికిన్ని, అంత యుత్సాహము గలవారికి సహాయముచేసిన హైదరాబాదు ఆంధ్రపరిశోధకసంఘమువారికిని ఆంధ్ర చారిత్రకలోకము సర్వదా కృతజ్ఞతతో నుండవలసి యున్నది.

శాసనమునందు మొత్తము నాల్గువైపులను కలిపి నూటమెనిమిది పంక్తు లున్నవి. మొదటివైపున ౨౮ పంక్తులును, రెండవవైపున ౨౭, పంక్తులును, మూడవవైపున ౨౯ పంక్తులును, నాల్గవవైపున ౨౪ పంక్తులును గలవు. శాసనము, శిలయొక్క పశ్చిమముఖమున ప్రారంభింపబడి, ఉత్తరపువైపున ముగింపబడినది. శాసనమంతయు నొకతీరు కత్తులో వ్రాయబడి యుండలేదు. ఇద్దరో, లేక ముగ్గురో ఈశాసనమును చెక్కిన ట్లున్నది. అట్లు గాకపోయిన అక్షరముల పోలికయందు విపరీతభేద ముండుటకు కారణము గాన్పింపదు. శాసనపు శిల మొదటివైపున అడుగుభాగమునకు పైభాగమునకు వ్రాతయందు వ్యత్యాసము స్పష్టముగా కన్పట్టును. అట్లే దక్షిణపువైపునను, తూర్పువైపునను గూడ అడుగుననున్న వ్రాతకు పైనున్న వ్రాతకు భేదము కనబడును.

## శాసనలిపి

ప్రాచీనకాలమునాటి తెలుగు-కన్నడముల లిపియం దీశాసనము వ్రాయబడియున్నది. ఇందలి కొన్నియక్షరములు సౌష్ఠవమును చెంది సుందరముగ నున్నవి. మరి కొన్నిచోట్ల నవి రూపముచెడి ఎడమవైపునకో కుడివైపునకో వ్రాలియున్నవి. అక్షరములు రమారమి అరంగుళముకంటె కొంచెము పెద్దవిగా నున్నవి. ద్విత్వము చెందినచోట నవి అంగుళప్రమాణమును గల్గియున్నవి. శాసనము చెక్కిన శిల పదునాలుగు అంగుళముల వెడల్పును సుమారు అంతే మందమును గలిగి నాలుగడుగులు పొడవుగల్గినదై యుండ

వలయును. శాసనమంతయు నక్కడక్కడ తప్ప మొత్తముమీద చెడక మంచిస్థితియం దున్నట్లు గాన్పించును. ఈశాసనపువ్రాతకత్తె చాళుక్య రాజులశాసనములలో మూడవవిజయాదిత్యుడు, చాళుక్యభీముడు, విష్ణువర్ధన అమ్మరాజు, యుద్ధమల్లుడు మొదలగు తొమ్మిది పది శతాబ్దములవారి శాసనాక్షరములను బోలియున్నది. అందువలన నీశాసనము పదియవశతాబ్దారంభకాలమునాటి దని యూహింపవచ్చును. అక్షరముల పోలిక యటుంచినను శాసనాంశముల బట్టి కూడ నీశాసనముకాలము పైరీతిగానే నిర్ధారణ చేయవచ్చును. శాసనమందు "అ" "ఆ" "ఇ" "ఈ" అను అచ్చులు మాత్రము వచ్చినవి. "ఇ" అనునది రెండు రూపములందు కానబడుచున్నది. దీనిరూపము ఒకచోట(౨౩ వ పంక్తి) మిక్కిలి ప్రాచీనమయినది. ౪౩ వ పంక్తిలోనిది తరువాతి కాలమునాటిది. సంయుక్తవర్గములో వచ్చిన వర్గాక్షరములు పూర్వసంప్రదాయము ననుసరించి వర్గానునాసికముతో కలిసియున్నవి. అయినను అందుకు భిన్నరూపములు గూడ అక్కడక్కడ గానబడుచున్నవి. రేఫమునకు బూర్వమందు హల్లు సాధారణముగా నిచ్చట ద్విత్వముగా వ్రాయబడియున్నది. లేకరి 'ళ' 'ల' లను రెండును వ్రాయగల్గినను ఎందుచేతనోగాని తరచుగా 'ల' వ్రాయవలసిన చోట్లనెల్ల 'ళ' యే వ్రాసియున్నాడు. నేను దానిని దిద్దక ప్రక్కను కుండలీకరణమున 'ల' వ్రాసియున్నాను. 'ళ' 'ల' లకును రెండు రూపములును చదువరి ౯, ౧౦ పంక్తులందు 'తిళకః', 'యుద్ధమల్లో' అనుమాటలయం దుదాహరణముగనై చూడగలడు. ఉపధ్మానీయమును లేకరి బండి 'ఱ' గుర్తుతో సూచించియున్నాడు.

శాసనమందలి భాష సంస్కృతము, గద్యపద్యాత్మకము. చివర కొన్ని కన్నడభాషలో నున్న బిరుదులు గలవు. కట్టకడపట వ్యాసగీతములకు బదులుగా మామూలు చాటుశ్లోకములు గలవు. శాసనమం దచ్చటచ్చట భాషాదోషములు నున్నవి. కవిత్వమంత మనోజ్ఞమైనది కాదు. ఉపజాతి, ఇంద్రవజ్ర, శార్దూలవిక్రీడితము, స్రగ్ధర, అనుష్టుప్ మొదలయినవృత్తములను కవి వాడినాడు. శాసనము రచించిన కవిపేరుగాని, శిలపై చెక్కిన అక్షరలిఖితాచార్యుని పేరుగాని యిందు తెలుపబడి యుండ లేదు.

### శాసనవిషయము

ఇందు రాజుయొక్క విజయరాజ్యవర్షములు గాని, శకవర్షములు గాని తెలుపబడి యుండ లేదు. ఈశాసనములోని దానము ఒకానొక ఉత్తరాయణసంక్రాంతి పుణ్యదివసమున చేయబడినట్లు చెప్పబడినది. ఈ శాసనము చాళుక్యాన్వయమునకు జెందిన రెండవ అరికేసరి మహారాజు కాలమునాటిది. ఇందు ఆ రాజువంశక్రమ మిట్లు వర్ణింపబడినది. చాళుక్యకులతిలకుడైన యుద్ధమల్లు డను రాజొకడు సపాదలక్షపరిమితమైన భూమండలమును బరి

పాలించెను. అతనికి విజయాదిత్యుడని రెండవ పేరు గలదు. అతడు చిత్రకూటదుర్గమును పట్టుకొనెను. అతడు అనేకసామంతమండలేశ్వరులచే పరివృతుడై కొలువబడిన పాదపద్మములుగలవాడు. ఆతని కుమారుడు అరికేసరిమహారాజు. అతడు అనేకమంది శత్రువులను తన నిశితమైన ఖడ్గధారచే పరిమార్చిన మేటివీరుడు. వేంగీ దేశ మఖిలమును బలాత్కారముగా జయించినాడు. అతనికి నరసింహభూపతియను కొడుకుపుట్టెను. అతడు రాజాదిత్యాపరనామముతో నీక్షితిని పరిపాలించెను. ఆతని వెనుక (శాసనభాగము స్పష్టముగాలేదు) అనేకయుద్ధములందు జయముగాంచిన (శ్రీ) యుద్ధమల్లుడు జన్మించెను. యుద్ధమల్లనామాంకితులలో నితడు రెండవవాడు. తరువాత రెండవ నరసింహదేవుడు జన్మించి భూమిని మహాపరాక్రమముతో పరిపాలించెను. అతడు దుస్సాధతరులయిన ఏడ్గురు నృపాలురను సమరాంగణమునందు నిర్జించి వారి రాజ్యభూములను చీకట్లుక్రమ్మిన మహారణ్యములుగా చేసివైచెను. ఎదుర్కొనిన ఘూర్జరరాజసేనను ఒక్కడే స్వయముగా ప్రతిఘటించి పోరాడి పారద్రోలెను. భీతులైన శత్రురాజకోటిచేత వినతు లందియుండెను. అతనివెనుక సాహసోద్వీరుడైన (రెండవ) అరికేసరి తేజస్వియైన ఉదయభానునివలె పుట్టెను. అతడు, సమస్తసామంతమండలాధిపతుల సేనాసమూహములతో కోపావేశమున బిజ్జని (విజయాదిత్యుని) శిక్షించి యాతనిరాజ్యమును హరించుటకు గోవిందరాజు దండెత్తిరాగా, శరణాగతుడైన బిజ్జని రక్షించుటకు యుద్ధరంగమున నెదుర్కొని యోడించి తరిమివైచెను. అతడు పౌలోమివలె సుందరి యయిన రేవక్కను భూమికిసవతిగానుండునట్లు పరిణయమాడెను. ఈమె ఇంద్రరాజు కూతురన్నట్లు తెలుపబడినది. ఇతడు అనేక సామంతమండలేశ్వరులచే కొలువబడినవాడనియు, శరణాయాతక్షితిపాల ప్రాణరక్షణదక్షవీరుడనియు, బంధురక్షణపరాయణుడనియు యశము సంపాదించెను. ఈ అరికేసరిమహారాజునకుసన్ధివిగ్రహియు, నాతని సమస్తరాజ్యభారనిర్వహణ దక్షుడును, సమస్తశాస్త్రపారగుడును, సమధిగతపంచమహాశబ్ద మహాసామంతాధిపతియు, చాళుక్యవంశోద్భవుడును త్రిభువనమల్లసామస్తచూడామణియు నగు గుణకరను (గుణ్ణయ) అను మహామంత్రిశేఖరుడు గలడు. అతనిని, బద్దిగ భూమిపాలునిచే నెలకొల్పబడిన సత్రమున కధికారియు, నాగమార్యుని కుమారుడును అగు పెద్దణార్యుడు అభ్యర్థించి, తన్మూలమున తనచే నిర్మింపబడిన ఆదిత్యగృహ మను సత్రశాలకు నిత్యముస్వామి సేవకై ఏతెంచు అగతాభ్యాగతతైర్థికులకు భోజన మొసగుటకై శ్రీమ దరికేసరిమహారాజువలన గుణకునికో, లేక మహారాజునకో (లేంబుళవాటికపత్తనము) లేములవాడయందు శతనివర్తనసంఖ్యాతపరిమితమైన భూమిని, మంచినీటి చెలువునకై అష్టనివర్తన

ముల భూమిని దానముగా బడసెను. ఈ రాజేశ్వరాదిత్య (సత్ర) గృహమునకు బద్దెగీశ్వరుడు, నగరీశ్వరుడు, మల్లికార్జునవ్యక్త లింగము, విద్యాధరాదులు సాక్షులు. నగర శ్రేష్ఠు లయిన చన్ద్రిశేష్ఠి ప్రభృతులు కూడ సాక్షులు. ఈ దానము ధర్మసిద్ధికొరకు చేయబడినట్లు తెలుపబడిది.

ఈ శాసనమం దీయబడిన రెండవ అరికేసరిమహారాజుయొక్క వంశక్రమము మనకు చాలా ముఖ్యమయినది. ఫ్లీటు పండితుడు * పంపకవికి పోషకుడైన రెండవ అరికేసరివంశమును ప్రకటించి, యాచాళుక్య రాజవంశము, వేంగీ, బాదామీచాళుక్యవంశములలో నెద్దానికి సంబంధించినదా యని వితర్కించి, ఏవిధముగనుకూడ నిర్ణయింపజాలక విడిచిపెట్టినాడు. ఈ శాసన మప్పటికి ప్రకటింపబడకపోవుటచే ప్రథమ-అరికేసరిమహారాజుయొక్క కొల్లిపర తామ్రశాసనమును ప్రకటించిన మత్ప్రియమిత్రులు శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారును, తమశాసనములోని అరికేసరిమహారాజవంశమువారితో సంబంధము గలవాడో నిర్ణయింపజాలకపోయితి మనిరి†. ఫ్లీటువ్రాసిన అంశముల నన్నింటిని మరియొకసారి విమర్శించి పంపకవి వర్ణించిన రెండవ అరికేసరివంశమును "ఇటు పూర్వచాళుక్యవంశముతోగాని, అటు బాదామి చాళుక్యవంశముతో గాని సమన్వయించి సంబంధము కలుపుదమన్న వీలుపడుట లేదు" అని వ్రాసి నిస్పృహచెంది విరమించిరి.

శ్రీశర్మగారు తమ తామ్రశాసనదాతయైన అరికేసరికిని, కర్నూలుప్రాంతమున దొరకిన చాళుక్య ఆదిత్యవర్మయొక్క తామ్రశాసనములో దెలుపబడిన ఆదిత్యవర్మయొక్క వంశమునకును సంబంధ ముండునేమో యని సంశయించి, సమాధానము చేసుకొని, "అట్లయిన మనశాసనదాత (అరికేసరి) బాదామి చాళుక్యులలోని ఆదిత్యవర్మవంశమునకు చెందినవాడు కావలెను" అని నిర్ధారించిరి. పిమ్మట, "నదియే సరియైనచో నీఅరికేసరి క్రీ.శ. ఎనిమిదవ శతాబ్ది మొదటిపాదములోనివాడు అనగా క్రీ. శ. ౭౧౫-౭౨౦ నాటి వాడగును" అని కాలనిర్ణయము చేసిరి. ఇపుడు మనకు పంపకవి యిచ్చిన వంశావళియు, ఆదిత్యవర్మ ఇచ్చిన వంశక్రమమును, కొల్లిపరశాసనములోని వంశమును, యీశాసనములోని వంశచరిత్రమును, ఒకదానితోనొకటి సమన్వయించి ఫ్లీటుగారును శర్మగారును చేసిన యూహలును, కాలనిర్ణయములును విమర్శించి వాటినన్నిటిని సమన్వయించి సరియైనవంశక్రమ మొకటి ఏర్పరుపగలమేమో ప్రయత్నించి చూచెదము.

మనశాసనమం దుదాహృతమైన వంశక్రమ మీతీరున నున్నది:—

* Dynasties of the Canarese Districts (Bom. Gazetteer, Vol. 1, Part 1), p. 381.
† భారతి, ప్రమోదూతసంవత్సర శ్రావణమాసము సంచిక.

వినయాదిత్యాపరనాముడైన
మొదటి యుద్ధమల్లుడు
|
మొదటి అరికేసరి
|
మొదటి నరసింహభూపతి
×
రెండవ యుద్ధమల్లుడు
×
రెండవ నరసింహదేవుడు
×
రెండవ అరికేసరి మహారాజు.

ఈ వంశవృక్షమున మొదటి యుద్ధమల్లునకు అరికేసరియు, నతనికి నరసింహభూపతియు పుట్టిరని చెప్పినవెనుక వరుసగా మూడు తరముల రాజులపేళ్లను రెండవయుద్ధమల్లుడు-రెండవ నరసింహదేవుడు-రెండవ అరికేసరి యని, ఒకరాజు తరువాత మరియొకరాజు పుట్టినట్లు చెప్పబడియున్నది. ఇట్లు సంగ్రహముగా చెప్పుటకు గారణము ఈదానశాసనము శ్రీమదరికేసరి మహారాజు స్వయముగా వ్రాయించినది గాకపోవుటచేత కావచ్చును. ఇందు దానము చేయించినవాడు ఆతని సన్ధివిగ్రహి. రాజే స్వయముగా దానమిచ్చినయెడల ఆతని వంశక్రమ మింతకంటె సౌష్ఠవముగను, నిర్దుష్టము నైన భాషయం దుండుటయే గాక సవిస్తరముగా దెలుపబడి దానమివ్వబడిన విషయము అజ్ఞగా తెలుపబడియుండును. ఇందట్లు కాకపోయినది. కావుననే వంశక్రమములోని కడపటి మువ్వురకును నొకరితో నొకరి కెట్టి సంబంధబాంధవ్యములు గలవో వివరింపబడియుండలేదు. పరిపాలించిన రాజన్యులపేరులే వరుసగా మొదటినుండియు తెలుపబడియున్నవి. ఈవంశక్రమమునకును పంపకవిని పోషించి కృతిభర్తయైన రెండవ అరికేసరి మహారాజువంశమునకు నేమైన సంబంధమున్నదేమో పరికింతము.

విక్రమార్జునవిజయము రచించిన జైనబ్రాహ్మణకవి పంపడు తా నాగ్రంథమును క్రీ.శ. ౯౪౧-౪౨ ప్రాంతమున వ్రాసినట్లందే చెప్పుకొన్నాడు. కావున నాతనిరాజగు రెండవ అరికేసరియు నాకాలమునందే రాజ్యము చేయుచుండవలయును. అతడు మహారాజుయొక్క-వంశక్రమ మిట్లు వర్ణించినాడు*. చాళుక్యాన్వయమున యుద్ధమల్లుడను రాజు పుట్టెను. అతడు సపాదలక్షపరిమిత మగు ధరామండలమును పరిపాలించెను. అతనికి(మొదటి)అరికేసరి మహారాజు జన్మించెను. అతడు బంగారిషయా (వేంగీ విషయా)ధీశుని దండనాయకులతో కలిసి నిరుపమదేవుని రాజ్యముపై దండెత్తిపోయెను. అతని కుమారుడు నరసింహభద్రదేవుడు. అతనికి దుగ్ధ

* Dynasties of the Canarese Districts(Bomb. Gaz. Vol. I, Part II), p. 381, ఇందు ఫ్లీటు ఇచ్చిన విక్రమార్జున విజయోదాహృతవంశ కథాసారమునుండియే యీవిషయమును గైకొనుచున్నాను. శ్రీ శర్మ గారును అద్దానినుండియే తామిచ్చిన వంశావళిని ఎత్తివ్రాసిరని ఊహింతును. కాని వారిచ్చిన వంశక్రమమునందు కొన్ని ప్రమాదకరములయిన తప్పులు దొరలినవి. అవి ఎట్లు సంభవించెనో ఊహింపజాలకున్నాను.

మల్లుడును, దుగ్ధమల్లునికి బద్దెగ నృపాలుడును జనించిరి. బద్దెగ నృపాలుడు 'ఓటమిలేని మేటి జోదు' అని అర్థమువచ్చు 'సోలద గండ'డని బిరుదము ధరించెను. ఇత డొకప్పుడు నీటను జొచ్చి మొసలిని బట్టుకొనెనో యన్నట్లు కొల నుజొచ్చి భీము డనువానిని బట్టుకొనెను. ఇత నికి రెండవయుద్ధమల్లుడును, అతనికి నరసింహ దేవుడును, రెండవఅరికేసరియు ఉదయించిరి. ఇమ్మడి నరసింహదేవునకు సుభద్రమునీంద్రు డను జైనయతి గురువు. ఇతడు సప్తమాళియ ముల నేలు అధిపతులను ఓడించి వశపఱచు కొనెను. ఎఱప అనువానికి రాజ్యమిచ్చి పద స్థుని జేసెను. ఘూర్జరరాజు నోడించి జయ లక్ష్మిని వశపఱచుకొనెను. ఉత్తరదేశాధీశు డగు మహీపాలుని ఓడించి తన యశ్వారా జములను గంగాసంగమమున కడిగించెను. అతని కనిష్ఠసోదరుడు రెండవ అరికేసరి. ఇతడు రెండవయుద్ధమల్లునికి చంద్రాననాదేవియందు జన్మించినాడు. అత డేలిన రాజ్యమునకు 'జోళ' రాజ్యమని పేరు. జోళమనగా జొన్నలు. జొ న్నలుపండు దేశ మగుటచే నా పేరు వచ్చి యుండనోపు. రెండవఅరికేసరి తన్ను శరణు జొచ్చిన విజయాదిత్యుని రక్షించుటకై గొజ్జిగ లేక గుజ్జిగ (గోవింద) రాజుతో నెదుర్కొని పోరాడి జయము గొని శరణాగతుడైన వాని ప్రాణమును, రాజ్యమును గాపాడెను.

మన శాసనములోని వంశక్రమమును, పంపకవి యిచ్చిన వంశావళిని నొకదాని ప్రక్క నొకటి ఉంచి పరిశీలించినచో నుభయవంశము లకును నేమయిన సమన్వయము కుదురునేమో చూడవలసి యున్నది.——






×
|
రెండవ యుద్ధమల్లుడు
×
రెండవ నరసింహదేవుడు
×
రెండవ అరికేసరి మహారాజు

పంపకవి ఇచ్చిన వంశమును శ్రీశర్మగారు కొద్దిపాటి తప్పులతో తమవ్యాసమున ప్రమాదవశమున ప్రకటించిన ట్లున్నది. వారు మొదటి అరికేసరి కిరువురు తనయుల నిచ్చి నరసింహభద్రదేవ నామమును రెండుచేసి నరసింహుడని, భద్రదేవుడని పేరులు ఇచ్చిరి. ఇది యొకటి. బద్దెగనృపతికి యుద్ధమల్లుడనుకొడుకుండగా నాతని పేరు దుగ్ధమల్లుడని మార్చిరి; ఇది రెండవది. సోలదగండని కుమారుడు యుద్ధమల్లుడుగాని దుగ్ధమల్లుడుగాడు. రెండవ యుద్ధమల్లునికి చంద్రాననాదేవియందు రెండవ అరికేసరి పుట్టినట్లుండగా వారు రెండవ అరికేసరిని, అన్నగారగు నరసింహరాజునకు నాతనిభార్య జాతవ్వకును తనయుని జేసిరి. ఇది మూడవది. మనవిూ ప్రమాదజనితములయిన అంశములను సవరించుకొని యుభయవంశములకు సంబంధము గలదేమోచూతము. మొదటి పంపకవియిచ్చిన వంశములోని కడపటివాడగు రెండవ అరికేసరియు, మనశాసనములోనిమహాసామంతాధిపతి రెండవ అరికేసరియు నొక్కరే యని ఒక్కమారు రెండింటిని పరికించినవారికి తోచకమానదు. ఇరువురును శరణాగతుడైన విజ్జని (విజయాదిత్యుని) రక్షించి గోవింద (గొజ్జిగ) రాజు నోడించినవార మని చెప్పుకొనుచున్నారు. ఈగోవింద, లేక గొజ్జిగరాజు రాష్ట్రకూట వల్లభుడైన నాల్గవగోవిందరాజు గావలయునని తోచుచున్నది. ఫ్లీటుకూడ నట్లే ఊహించినాడు. ఇతని శాసనములు, ఇతనిరాజ్యకాలము ఇంచుమించుగా క్రీ. శ. ౯౧౮—౯33-3౪ సంవత్సరములనడుమ యని తెలియుచున్నది. కావున నితడు రెండవఅరికేసరికి సమకాలికుడగుచున్నాడు. శరణార్థియైన బిజ్జ, లేక విజయాదిత్యుడు వేంగీచాళుక్యులలో కొల్లభిగండ డని అపరనామము గల నాల్గవ విజయాదిత్యు డని ఫ్లీటు అభిప్రాయపడినాడు. ఆయూహ విశ్వసనీయమైనదికా దని నా మతము. విరజాపురి యుద్ధమున క్రీ. శ. ౯౧౭-వ ప్రాంతమున కొల్లభిగండవిజయాదిత్యుడు రాష్ట్రకూటరాజయిన మూడవ ఇంద్రవల్లభునితో పోరి జయముగాంచి విజయచిహ్నముగ జయస్తంభమును నాటి ఇంటికి మరలిన వెనుక స్వర్గస్థుడైనాడు. ఇంద్రవల్లభుడు యుద్ధరంగమున మరణించి యుండవలయును. రాష్ట్రకూట రాజధానియందునాల్గవ గోవిందరాజును, వేంగీదేశమున విష్ణువర్ధనఅమ్మరాజ రాజమహేంద్రుడును క్రీ. శ. ౯౧౮ సం॥ న ఇంచుమించుగా నేకకాలమందే రాజ్యాభిషిక్తులయిరి. కావున నాల్గవ గోవిందరాజు, అమ్మరాజు తండ్రియైన కొల్లభిగండవిజయాదిత్యునిపై దండెత్తిపోయెననుటకు సావకాశము కన్పడదు. ఇకనెవరిపై దండెత్తిపోయెనాయని విచారించిన

అమ్మరాజేంద్రుని అగ్రసూతియగు బేత విజయాదిత్యుడు అగపడుచున్నాడు. అమ్మరాజు ౯౨౫ లో మరణించినాడు. అంతట బేతరాజు పట్టాభిషిక్తుడయ్యెను. ఆతడు పట్టాభిషిక్తుడయ్యెనో లేదో, నాల్గవ గోవిందరాజు పంపిన సైన్యసమూహముల సాహాయ్యమున నాతని రాజ్యము ప్రతిపక్షుడును దాయాదియునగు తాడపరాజు వశపఱచుకొనెను. అంతట వేంగీరాజ్యము అంతఃకలహములకు లోనై విప్లవార్ణవమున పశ్చిమభానునివలె గ్రుంకిపోయెను. నాల్గవ గోవిందరాజుయొక్క సైన్యములు వేంగీ రాజ్యముపై దండెత్తివచ్చిన కాలము క్రీ. శ. ౯౨౫-౯౨౬ కావలయును. ఇక నాల్గవగోవింద రాజునకు గొజ్జిగయనిపేరున్నట్లు నాతని సాంగ్లీ తామ్రశాసనము తెలుపుచున్నది గావున ఇరువురు నొక్కరగునా కాదాయని సంశయింపబనిలేదు. అయినను నాల్గవ గోవిందరాజు శిక్షింపదలచినది తూర్పుచాళుక్యరాజగు కంఠికావిజయాదిత్యు డెట్లగును. ఈతడు రాష్ట్రకూటులకు సామంతుడు గాడు. పైగా నితడు బేతరాజని మారుపే రున్నవాడు గాని బిజ్జడని పేరున్నవాడుగాడు. అదియును గాక, నీ బిజ్జని మూలమున ఇమ్మడి అరికేసరి, ప్రభువును, చక్రవర్తియు నగు నాల్గవ గోవిందుని సమరమున నోడించి మడియింపజేసినాడు. గోవిందరాజు క్రీ. శ. ౯౩౪ ప్రాంతమున మరణించినట్లున్నదిగాన, నీయుద్ధ మాకాలముననే జరిగియుండును. అప్పటికి కంఠికా విజయాదిత్యుడు వేంగీ సింహాసనముపై లేనేలేడు. ఆతడు అంతకుముందే తాళరాజుచే కారాగృహమం దుంచబడి, పిమ్మట తప్పించుకొని వేంగిభూమియందే రెండవచాళుక్యభీము నాశ్రయించి సామంతుడైయుండిపోయినాడు.*

పంపకవిప్రకారము రెండవ నరసింహరాజును, మనశాసనములోని రెండవ నరసింహరాజును నొక్కరే యగుదురనుటకుకూడ నేమియు సందేహము లేదు. ఇరువురు ఘూర్జరరాజసేనను ఎదుర్కొని జయశ్రీని హరించినట్లు గర్వోక్తిగా జెప్పుకొనిరి. అంతియేకాక దుస్సాధ్యులయిన సప్తమాళయాధిపతుల నిర్జించినట్లు చెప్పుకొనియున్నారు. ఈ సప్తమాళములు శ్రీనాధుడు వర్ణించిన సప్తమాడియములను తలపునకు దెచ్చుచున్నవి.† ప్రాయశః నీ సప్తమాడియములు గోదావరి కుత్తరమున నున్న బస్తరుజయపురసంస్థానములున్న సీమలు గావచ్చును. ఇక రెండవ నరసింహదేవుడు రెండవయుద్ధమల్లుని తనయుడైనట్లు మనశాసనము సూచించుచున్నది. ఇది యిట్లుండ రెండవ

* చూడుము రెండవ అమ్మరాజుయొక్క గుండుగొలను తామ్రశాసనము, ఇండియను ఆంటిక్వెరి, సం॥ ౧౩, పుట ౨౪౮: తదగ్రసూనుర్బ్భాలో విజయాదిత్యః పక్షమేకం. తమాక్రమ్య కారాగారేనిధాయ చాలుక్యభీమ పితృవ్యో యుద్ధమల్లాత్మజ స్తాల నృపోమాసమేకం. పంక్తులు ౧౫-౧౬. మరియు Indian Antiquary, Vol.XII,p.247.

† అల్లాడవేమారెడ్డి ఆటోపము నభివర్ణనము సేయుచు శ్రీనాధుడు "సప్తమాడియరాయ చంద్రబింబాననా చికురపల్లరులపైఁ జిన్నిపువ్వు" అని పొగడినాడు.

యుద్ధమల్లుని పైతరమువారిద్దరిని పంపకవి యి చ్చినవంశక్రమము ననుసరించి—బద్దెగ నర పాలుని, ఆతని జనకుడు దుగ్ధమల్లుని కూడ మన శాసనము పేర్కొనకున్నది. ఇట్లు పేర్కొన కుండుటకు కారణము, కవియే శాసనము రచిం చునెడ వదలియుండుటయో, లేక లేకరి దానిని శిలపై నెక్కించునపుడు ప్రమాదవశమునవిడి చియుండుటయో తటస్థించియుండును. ఏలన, దుగ్ధమల్లునికి పూర్వులు పంపకవి వర్ణించిన మూడుతరములవారును మనశాసనములోని మొదటి మూడుతరములవారితో సరిపోవు చున్నారు. ఇన్నికారణములవలన, పంపకవిని పోషించిన రెండవ అరికేసరియు, మనశాసనము లోని రెండవ అరికేసరియు నొక్కరేయని నిశ్చ యమగుచున్నది. పంపకవివ్రాసినవన్నియు చరి త్రాంశములనియు నొప్పుకొనక తప్పదు.

ఇక శర్మగారు ప్రకటించిన కొల్లిపర శాసనకర్తయగు అరికేసరిమహారాజునకును, మనరెండవ అరికేసరివంశమునకు ఏమయిన సంబంధ మున్నదాయను ప్రశ్నకు సమాధా నముకావలయును. కొల్లిపరశాసనమందు వంశ క్రమ మిట్లున్నది.

(చంద్రవంశమున)
సత్యాశ్రయుడు
|
పృథివీ పతి
|
మహారాజు
|
రాజాదిత్యుడు
|
వినయాదిత్యుడు
|
అరికేసరి

ఇందు కడపటివాడగు అరికేసరి వినయా దిత్యుని కుమారు డని తెలియవచ్చు చున్నది. శాసనమందు మూలపురుషుడైన యుద్ధమల్లు నికి వినయాదిత్యు డని అపరనామము గలదు. ఆవినయాదిత్య యుద్ధమల్లుడే యీ కొల్లిపర శాసనపు అరికేసరితండ్రియగువినయాదిత్యుడు కావలయును. మన శాసనపు వంశములోని మొదటి రెండుతరములును కొల్లిపరశాసనము లోని కడపటి రెండుతరములును సరిపోవు చున్నవి. కావున మనశాసనములోని మూల పురుషు డగు వినయాదిత్యాపరనాము డగు మొదటి యుద్ధమల్లుడును కొల్లిపర శాసనము లోని దానపతియొక్క తండ్రియు నొక్కరే యని నిర్ధారింపవచ్చును. ఈ యిరువురకును అరికేసరియను తనయులున్నారు. కావున ఇక వారిద్దరు నొక్కరే యగుదురుకదా!

ఇక శ్రీశర్మగారు ప్రకటించిన కొల్లిపర శాసనపతియగు మొదటి అరికేసరి మహారాజు వేంగీచాళుక్యరాజవంశములో నాల్గవ విష్ణువర్ధ నుని కాలమువాడని నిర్ణయింపవచ్చును. ఏల న పంపభారతమున మొదటి అరికేసరి వేంగీ శుని దండనాథులతో కలసి నిరుపమ రాజేంద్రుని రాజ్యముపై దండెత్తిపోయినట్లు వర్ణింపబడినాడు. నిరుపమరాజు రాష్ట్రకూట

రాజవంశములో నిరుపమధ్రువరాజుగా కన్పట్టుచున్నాడు. నిరుపమధ్రువరాజు మొదటి కృష్ణవల్లభుని కుమారుడు. రాష్ట్రకూటులలో "నిరుపమ" బిరుద మీధ్రువరాజునకు తప్ప తత్పూర్వుల కెవరికిని లేదు. ఈధ్రువరాజు యొక్క రాజ్యారంభ కాలమెపుడో నిశ్చయముగా తెలియరాదుగాని యించుమించుగా నితడు క్రీ.శ. ౭౭౯ మొదలుకొని ౭౮౩-౮౪ సంవత్సరముల నడుమ రాజ్యము చేసియుండినట్లు ఊహింపవచ్చును[1]. ఇతడు తన తండ్రి మరణానంతరము రాజ్యము అగ్రసోదరుడును యువరాజును అగు (రెండవ) గోవిందరాజునకు రావలసియుండగా, నాతడు సింహాసనమెక్కి కొంతకాలము పరిపాలించినతరువాత ఆతని పరిక్రమించి ("జ్యేష్ఠోల్లంఘనము"గావించి) రాజ్యము సంపాదించుకొన్నాడు[2]. ఆసమయమున రెండవ గోవిందరాజు తనకురాజ్యము నిలువబెట్టుకొనుటకై శత్రురాజు లయిన మాళవ, వేంగీ, కాంచీ, గంగనృపతుల పెక్కండ్రను సహాయము తీసుకొని తమ్ముడగు నిరుపమధ్రువరాజుపై దండెత్తిపోయెను. కానిజయము మాత్రము చివరకు ధ్రువరాజునకే కైవసమయ్యెను[3]. ఆసమయమున రెండవ గోవిందరాజునకు సాయమరిగి నిరుపమ ధ్రువరాజు రాజ్యముపై దండెత్తినవారిలో నొకడీ మొదటి అరికేసరి నృపాలుడు కావున, నితడును ఇంచుమించుగా క్రీ. శ. ౭౭౦-౭౮౦ నాటివాడు కావలయును. శ్రీశర్మగారీఅరికేసరిని ఆదిత్యవర్మవంశముతో ముడివెట్టి యితడు క్రీ. శ. ౭౧౫-౭౨౦ నాటివాడగునని యూహించిరి. వారి యూహ సరియైనది కావచ్చును. ప్రత్యక్ష ప్రమాణములు కాలనిర్ణయమునకు లభించనపుడును, ఇతరాధారముల బట్టి కాలనిర్ణయము చేసినపుడును ఏబది సంవత్సరముల కాలము వ్యత్యస్తముండుటంత దోషములోనిది కాదు. ఈ సంగతి వారే యొప్పుకొన్నారు. ఇంతకును వారుకూడ నావలెగాక తరమునకు ఇరువదియైదు సంవత్సరములు చొప్పున లెక్కించి కాలనిర్ణయము చేసినారు. అదియే యథార్థమని ఎవరు సిద్ధాంతముచేయగలరు? ఇదిగాక, శ్రీశర్మగారు ప్రకటించిన శాసనముయొక్క లిపికూడ నావాదమునకే బలమిచ్చుచున్నది. అరికేసరి కొల్లిపరశాసనలిపి వేంగీరాజులలో నాకాలపు రెండవ

---

1. ఇందు క్రీ. శ. ౭౭౯ సంవత్సరము నిరుపమ ధ్రువరాజు అగ్రసోదరుడైన యువరాజు గోవిందవల్లభుడు మాసినదియొడ్డున తన విజయ స్కంధావారమునుండి తన పాలితవిషయములోని గ్రామ మొకదానిని బ్రాహ్మణునికి దానము చేసెను. ఇక రెండవపరిమితి సంవత్సరమగు ౭౮౩-౮౪ సంవత్సరములో నిరుపమ ధ్రువరాజ సుతుడగు మూడవ గోవిందుడు, జినసేనునిదైన హరివంశమున, యువరాజుగా దక్షిణరాజ్యమును పరిపాలించుచున్నట్లు తెలుపబడినాడు. కావున యీరెండుసంవత్సరముల నడుమ నితడు పాలించి యుండవలయు నని యూహించితిని. Epigraphia Indica, Vol. VI, p. 208 ను, Dynasties of Canarese Districts, p. 394ను చూడవలెను.

2. Indian Antiquary, Vol. VI, pp. 62, 69.

3. Dynasties of the Canarese Districts, p. 393.

విజయాదిత్యుని ఈడేరు[1] శాసనలిపిని బోలి యున్నదని వ్రాసినారు. నాకును అట్లే తోచు చున్నది. నరేంద్రమృగరాజాపరనాము డగు రెండవ విజయాదిత్యుడు క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దాదిని రాజ్యమేలియున్నాడు. మొదటి విజయాదిత్యుని తామ్ర శాసనముల లిపికిని యీ కొల్లిపర తామ్రశాసన లిపికిని కావలసినన్ని పోలిక లగపడుచున్నవి. కావున మొదటి విజయాదిత్యునికిని రెండవ విజయాదిత్యునికిని నడిమికాలపులిపిలో వ్రాయబడిన కొల్లిపరశాసనపతి యాకాలపువాడే యగుట నిశ్చయముగదా!

[2]ఈకాలనిర్ణయ మింకొకవిషయము వలన కూడ స్థిరపడుచున్నది. రెండవఅరికేసరికి అగ్రజుడైన నరసింహదేవుడు మూడవ ఇంద్రునికి సైన్యాధీశుడైనట్లు గాన్పించుచున్నది. ఆతడు మహీపాలుడను ఉత్తర హిందూస్థానములోని యొకరాజును జయించినట్లు పంపకవి తెలుపు చున్నాడు. ఆ మహీపాల నామాంకితుడు కన్యాకుబ్జాధీశు డను, గూర్జరవంశజు డను ప్రథమ మహీపాలుడు. అతడు క్రీ. శ. ౯౧౪ సంవత్సరమునాటివాడు.

ఇంకొక విషయమున్నది. కొల్లిపర శాసనములోని పూర్వుల వంశక్రమము యథార్థమైనదియా, లేక కల్పితమైనదాయని చర్చింపవచ్చును. మొదటి అరికేసరికాలము క్రీ. శ. ౭౫౦-౭౭౦ అగుచో, నతనికి అయిదు తరములు వెనుక వాడగు సత్యాశ్రయుడు-తరమునకు సాధారణముగా నందరు అంగీకరించిన లెఖ్ఖగున ఇరువదియైదుసంవత్సరములు చొప్పున లెక్కపెట్టినను, అప్పటినుండి నూట యిరువదియైదుసంవత్సరములు వెనుకకుబోవలెను. అట్లయినచో నరికేసరికి మూలపురుషుడైన సత్యాశ్రయుడు క్రీ. శ. ౬౪౯-౬౫౦ ప్రాంతమువాడగును. అతడప్పుడు వాతాపి చాళుక్యులలో మహాతేజశ్శాలి యగు సత్యాశ్రయ రెండవ పులకేశివల్లభమహారాజు కావచ్చును. అతనికి తనయుడు కావచ్చును, పృథివీపతి పరనాముడైన ఆదిత్యవర్మ. కావున మన అరికేసరికి మూలపురుషుడు సత్యాశ్రయ నామాంకితుడగు రెండవ పులకేశి యని నిర్ధారణ చేయవచ్చును. అట్లయినచో నీ అరికేసరియొక్క వంశముకూడ బాదామిచాళుక్య మూలవంశమునుండి, వేంగీచాళుక్యుల వలెనే విడిపోయి ప్రత్యేకరాజ్యము సంపాదించుకొని స్వతంత్రముగా నేలిన చాళుక్యవంశ మని ఏర్పడుచున్నది.

ఇక నీ చాళుక్యవంశమునకు రాజధాని యెక్కడ నిర్ణయింపవలయునను ప్రశ్నకు సమాధానము కావలయును. శ్రీశర్మగారు మొదటి అరికేసరి రాజ్యము ధార్వాడ ప్రాంతమున నుండజాలదనియు,నిజాంమండలమునందే యుం

1. Epigraphia Indica, Vol. V, p. 118.

2. జర్నల్ ఆఫ్ ది ఆంధ్ర హిస్టారికలు రీసర్చి సొసయిటీ, ఐదవ సంపుటము, పుటలు 51-58; Ep. Ind. Vol. VIII, Appendix II, Table no. 1.

డవలయుననియు అభిప్రాయపడిరి. ఇది మిక్కిలి సమంజసముగా నున్నది. ఇందులకు వారు చూపిన కారణము లన్నిటికంటె మరియొక కారణము బలవత్తరమైనది కలదు. ఫ్లీటు పండితుడు, బొంబాయి రాజధానిలో నున్న ధార్వాడ జిల్లాకు జేరి ఆగ్నేయ దిశగా నున్న మిరజ్ సంస్థానములోని లక్ష్మేశ్వరమే పులిగెరయనియు, నది బహుశః పంపకవి పోషకుడైన రెండవ అరికేసరి వంశము వారికి రాజధాని గావచ్చుననియు సూచించినాడు. ఇందులకు వారిని భ్రమియింపజేసిన కారణము, పంపకవి తాను 'మధురమైన పులిగెరకన్నడము'లో విక్రమార్జునవిజయము రచియింతునని చెప్పుకొన్న గర్వోక్తిగా కన్పడుచున్నది. కాని యీనిర్ణయము సరియైనది కాదు. పంపకవి తాను ప్రశస్తమైన కన్నడమందు గ్రంథము వ్రాయుదు ననినాడు గాని, తనరాజున కా పులిగెరయే రాజధాని యని ఎక్కడను ధ్వనియింపజేయ లేదు. లక్ష్మేశ్వరము వా రనుకొన్నపులిగెర కావచ్చునేమోగాని, యా పులిగెరయే మన మొదటి రెండవ అరికేసరి వంశమువారికి రాజధానియై యుండెననుట పొసగియుండదు. ధార్వాడజిల్లాలోని పులిగెర, మన రెండవ అరికేసరి కాలమునాడున్ను, తత్పూర్వమును గూడ రాష్ట్రకూట రాజ్యములో చేరియుండెను. రెండవ నరసింహదేవుడు రాజ్యము సేయుచున్నకాలము నాటికి రాష్ట్రకూట భూపతియగు మూడవ ఇంద్రవల్లభునకు సామంతుడైన మహాసామంతాధిపతి లెంకెయరసు, "పులిగెర మున్నూరు విషయమును" పరిపాలించుచున్నట్లు ధార్వాడజిల్లాలోని హత్తిమత్తూరుశిలాశాసనమువలన స్పష్టపడుచున్నది. ఇది శాలివాహన శకవర్షములు ౮౩౮ అగు ధాతుసంవత్సరమునకు సరిపోయిన క్రీ. శ. ౯౧౬-౧౭ నాటిది. కావునయీపులిగెర ఎన్నటికిని మనచాళుక్యరాజవంశమునకు రాజధాని కానేరదు. ఇక వీరి రాజధాని యెక్కడనో త్రిలింగమందే (త్రిలింగాణము) యుండవలయును. మొదటి అరికేసరి తామ్రశాసనము కర్నూలుమండలములో దొరికినది; రెండవ అరికేసరి శిలాశాసనము నిజాంమండలములో జేరిన కరీంనగరుజిల్లాలో నున్న లేములవాడ గ్రామమున దొరకినది. కరీంనగరు గోదావరికి ఉపనదియైన మన్నేరు ఒడ్డున నున్నది. ఆ సమీపముననే చరిత్రప్రసిద్ధమై గోదావరికి కొంచెము దూరముగా దుర్గమస్థలమున రామగిరి దుర్గమున్నది. ఈరామగిరి నగరమే పూర్వమీవంశము వారికి రాజధానియైయుండునేమో యని యూహ కలుగుచున్నది. ఇది వేంగీదేశమునకు సమీపమున నున్నది. సమీపరాజ్యము కావుననే వేంగివాస్తవ్యుడైన యా జైన బ్రాహ్మణపంపకవి రెండవ అరికేసరిని ఆశ్రయించఁబోయినాడు. మరియు, ఈ శాసనము దొరికిన లేములవాడయు, శాసనమున లేంబుళ

† Dynasties of the Canarese Districts, p. 381.

* Indian Antiquary, Vol. XII, p. 224.

వాటకపత్తనమని యుదాహరింపబడుటచేతను, పట్టణమని చెప్పబడి యుండుటచేతను లేముల వాడయే రాజధానియై యని సంశయము కలుగుచున్నది. ఇచ్చట రెండవ అరికేసరికిని, మొదటి అరికేసరికినిపూర్వులయిన బద్దెగేశ్వర, రాజాదిత్య (రాజేశ్వర) నగరీశ్వరభట్టారకుల పేరట కట్టబడిన రెండుశివాలయము లుండుట నాయూహకు ప్రబలకారణ మగుచున్నది. ఒక వేళ రామగిరి రాజధానిగా నున్నను రాజ వంశమునకు కులదైవతముల ఆలయములు లేములవాడయం దుండెనేమో. అయినను ఈ విషయ మింకను విచారింపవలసి యున్నది.

పైన వ్రాసిన దానిని బట్టి పాఠకులకు రెండవ అరికేసరి మహారాజనియు, రాజాధీసు డనియు పరమభట్టారకుడని సందేహము కలుగవచ్చును. కాని యీశాసనమందు అతనికి వినియోగింపబడిన బిరుదావళినంతయు పరిశీలించిన నాతడు పరమభట్టారకుడును, రాజపరమేశ్వరుడును, మహారాజాధిరాజును గాడని నిస్సంశయముగా తోచగలదు. ఎచ్చటను పైని చెప్పిన పరమభట్టారకాదిబిరుదావళి అతనికి శాసనమం దుపయోగింపబడ లేదు. మీఁదు మిక్కిలి యొకచోట (పంక్తులు ౭౨, ౭౩, ౭౪) "మహాసామన్తాధిపతి" "త్రిభువనమల్ల చూడామణి" మొదలగు బిరుదవాచకము లుపయోగింపబడినవి కావున నితడు మహాసామంతులలో నొకడని యూహింపవలసి వచ్చుచున్నది.

ఇతని బిరుదములన్నియు కన్నడమందు గలవు. మరియు నీతడు కన్నడదేశీయుడు. కన్నడభాషను, మాతృభాష యగుటచే అభిమానముజూపి, పోషించినాడు. ఇతని యాస్థానమునందు వేంగీపురవాస్తవ్యుడయిన పంపకవి పోషింపబడి "ఆదిపురాణము", "పంపభారతము" అను నామాంతరము గల "విక్రమార్జునవిజయము" అను రెండు పద్యకావ్యములను గన్నడభాషలో రచించినాడు. మరియు పులిగెఱె కన్నడమందు వ్రాసినాడు. కావున అరికేసరిభూపాలుడు కర్ణాటాధీశులయిన రాష్ట్రకూటులకు మహాసామంతాధిపతులలో నొకడు గావలయును. రాష్ట్రకూటులు రాజపరమేశ్వర పరమభట్టారకాది సామ్రాజ్య చిహ్నములయిన బిరుదములు గలవారు. ఇతని కాలమున రాష్ట్రకూటులలో నాల్గవ గోవిందరాజు పరిపాలించుచుండెను. ఈతని రాజ్యకాలము క్రీ. శ. ౯౧౮ మొదలుకొని ౯౩౩ వఱకునని గూడ నిర్ణీతమైనది. కావున రెండవ అరికేసరి మహారాజు నాల్గవ గోవిందునకు మహాసామంతు డనుమాట నిశ్చితమైనది. అయినను ఇది ఎంతవఱకు సత్యమో పరిశీలింతము.

పంపకవియొక్క విక్రమార్జునవిజయమందలి తొమ్మిదవ ఆశ్వాసమున ౫౧ పద్యానంతరమున వచన మిట్లున్నది. చూడుడు.—

"చళుక్యకులతిలకనప్ప విజయాదిత్యంగె గోవిందరాజం మునిదె తళరగె పెఱగిక్కి కాద శరణాగత జళనిధియ పెంపుమం గొడ్డె

గనెంబ సకలచక్రవర్తి జెనసి దండు వంద మహాసామంతరం మరలి ఱిదు గెల్ద సామంత చూడామణియ పీర్యుణమును సతివర్తిణ యాగి మార్మలెవ చక్రవర్తియం కిడిసి తన్నం నంబిబంద బద్దెగదేవంగె సకలసామ్రాజ్య మనోరంతుమాడి నిజెసి దరికేసరియు తోళ్వల ముమం సమదగజఘటాటోపంబెరసు నెలనది రెవందు తాగిద కక్కలన తమ్మనప్ప బప్పువ నం కాఱణనొండె మదాంధగంధ సింధుర దోళ్లోడిసిద వైరిగజఘటావిఘట్టన సదటు మం పరచక్రంగళనంజిసిద పరసైన్య భైరవన మేగిల్లద బల్లాళ్తనముమం కండుం కెల్దుం సినగె సెణసలెంతు బగెబందపుదు"......

ఈ వచనతాత్పర్య మిట్లుండును :— 'శరణాగతులకు సముద్రమువంటి దయారసము గలవాడును, చళుక్యకులతిలకుడైన విజయాదిత్యునిపై కోపించి సకలచక్రవర్తియగు గోవిందరాజు అతనిశిక్షించుటకు సైన్యములంపగా శరణాగతుడైవచ్చిన విజయాదిత్యునిరక్షింపదలచి ప్రభువుతో వైరమని జంకక, గొజ్జిగ రాజును అతని సైన్యములను బరిమార్చిన వాడును, సకల ధరామండలమును బద్దిగ దేవునికి విశ్వాసముంచి కోరగా చక్రవర్తి పట్టము గట్టినవాడును, తన మదాంధగంధసింధురముపై నెక్కి కక్కరాజున కనుజుడైన బప్పువును, అతని గజసైన్యములను చీకాకుగావించి పాఱద్రోలినవాడును, తుదకు బప్పువుచే మన్నన లంది గౌరవింపబడిన వాడును, పట్టుకొనబడిన పరచక్రమండలేశ్వరులయొక్క గజఘటావిఘట్టనముచే భూమి కంపింపచేసినవాడును, సామంత చూడామణియు నగు (శ్రీ) మదరికేసరి మహారాజుపై నెవరికి ద్రోహబుద్ధి కలుగును ?'

విక్రమార్జునవిజయమందు మరియొక చోట ౧౪-వ ఆశ్వాసమున 32-వ పద్యానంతరమున వచనభాగమం దిట్లున్నది :—

"గొజ్జిగనెంబ సకలచక్రవర్తిమలెయె తనగె శరణాగతనాద విజయాదిత్యనంకాద బల్లాళ్త నదొళ్ శరణాగత జళనిధియుం......"

(అరికేసరి) శరణాగతులకు జలనిధివంటి మహాబలశాలి గావున, శరణాగతుడైన విజయాదిత్యుని, సకలచక్రవర్తియైన గొజ్జిగ చక్రవర్తినైన యెదుర్కొని యోడించి, రక్షించినాడు. *

డాక్టరు లయొనెల్ డి బార్నెట్టుగారు ఈ రెండవ అరికేసరి స్వతంత్రరాజుగాడనియు, రాష్ట్రకూట నాల్గవ గోవిందరాజు సామంత కోటిలోనివాడనియు, మహా తేజశ్శాలియు, బలశాలియునగు మహాసామన్తాధిపతియనియు వ్రాయుచున్నారు.† ఇది సమంజసముగా గన్పడుచున్నది. మరియు నితడురక్షించిన చాళుక్య బిజ్జడను విజయాదిత్యుడును తూర్పు చాళుక్య వంశజుడుగాడనియు గొజ్జిగ దేవుని సామంతులలో నొకడు గావలయుననియు నిర్ణయించి

* ఇది భాషాంతరీకరణము కాదు, తాత్పర్యము.

† ఎపిగ్రాఫియా ఇండికా, ౧౩ వ సంపుటము 3౨౭, పుట.

నారు. ఈ చాళుక్యబిజ్జడు లేక విజయాది త్యుడు వేంగిచాళుక్యుడు గాడని యీావలనే చర్చించినారము. ఇతడు వేంగీచాళుక్యు డైన చేత రాజు కా డనుటకు కన్పడు మరియొక కారణ మిది. అరికేసరి విజయాదిత్యుని సంరక్షించుటకై చక్రవర్తితో బోరాడి గెల్చెననియు నాసమరమున గొజ్జిగచక్రవర్తి హతు డైనట్లును, పిమ్మట రాష్ట్రకూట సామ్రాజ్యమును సమస్త సామంతచూడా మణి యైన శ్రీమదరికేసరి మహారాజు ముమ్మడి అమోఘవర్షడను పేరుతో రాజ్య మేలిన ముమ్మడీ ఇంద్రరాజు సోదరుడైన బద్దెగ దేవునికి పట్టము గట్టెననియు తెలియు చున్నది. మరియు నింకొకసారి కక్కలుడను వాని తమ్ముడు బప్పువు అనువాడు గజసైన్య ముతో రాగా నాతని నోడించి వశపఱచు కొనెననియు పైదానినిబట్టి గ్రహింపగలుగు దుము. ఈ కక్కలుడు మాన్యఖేటపు రాష్ట్రకూటరాజులలో కడపటివాడగు రెండవ కక్కరాజని తోచుచున్నది. లేదా నాల్గవ గోవిందరాజునకు సన్నిహితబంధువులలో నొకడైన గావచ్చును. ఇన్ని నూతనవిష యములను పంపకవి పూర్వోదాహృతమైన తన విక్రమార్జునవిజయవచనభాగమున చెప్పు చున్నాడు. కావున ఇమ్మడి అరికేసరి మహా రాజును శరణువేడినవాడు వేంగీచాళుక్య విజయాదిత్యుడు కాజాలడు.

## శాసనము (మూలము[1])

పడుమర

౧. (శ్రీ)[2]మా న్నాభు స్తమోహంతా దైత్యదర్పాపహారక పరం

౨. లోకైకలోచనక పాయా దపాయా ద్భువన త్రి(యం*)॥ (౧)

౩. స్వస్తి(।*)సమస్త విబుధా (ధ) జనసంస్తూయమాన స్సక

౪. శ(ల)కళాకమళై (లై)కరాజహంసః (।*) కంసమథనైవ[3]

౫. కమళా(లా)కరీకృత వక్షస్థళ(ల)(ః*) స్థాణురివ భా(భ)స్మ

౬. సాత్కృత సమస్తారిపురః (।*) ప్రచణ్డ[4]ప్రవృక్పాలయ ప్రబోధితా

౭. శేష ప్రవాహాంభోజాన్యక్షీకృత వినయాదిత్య

౮. నామధేయ గ ప్రసాధితాశేషదిఙ్మణ్డళ (ల)[5]శ్చ (।*) ప (ర*)

౯. మణ్డళై (లై)కరామ శ్చాళుక్యకుళ (ల) తిళ (ల) కః (।*) శ్రీయుద్ధ

౧౦. మల్లోనామ రాజా బభూవ॥ సోయం[6] కిళా(లా) శాసద

1. నాదగ్గర నుండిన శాసనప్రతిబింబములనుండి చదివినపాఠము. 2. శ్లోకము అనుష్టుప్. 3. ॰మథనఇవ అగు. 4. ఇది సంస్కరించుటకు సాధ్యపడలేదు. 5. ॰దిఙ్మణ్డలశ్చ॰ అని. 6. శ్లోకము ఉపజాతి.

౧౧. నన్యశాస్యనపాదలక్షం క్షితి మక్షితాజ్ఞః (।*) న
౧౨. మస్తరాజేన్ద్ర కిరీటకోటిమాణిక్య రా(ర)శ్మిగ్ర ప్రక
౧౩. ర (రా*)ఞ్చితాంఘ్రిః॥ (౨*) యః[7] [పాదనే సాధనుయా గజానాం][8] వి
౧౪. ధాయ వాపీమపి తైలపూర్ణై స్స సర్వలోకం న
౧౫. తతం విశేనే భాస్వైః కుచానా మరిసున్దరీణాం॥ (౩*)
౧౬. నచిత్రకూటం[9] బహుచిత్రకూటం శక్త్యా సురేన్ద్రై రపి
౧౭. నోపయాతుం త్రివర్గయుక్తగ్ర హణతారివర్గ
౧౮. స్స్వభావదుర్గం కిళ(ల) తం జహార॥ (౪*) తస్యాత్మజో[10] ద
౧౯. క్షిణబాహుదణ్డ చణ్డాసిధారా హతవైరి
౨౦. షణ్డః । బాలా(బలా) ద్గృహీతాఖిళ (ల) వేఙ్గిదేశగపా
౨౧. తిస్మ పృథ్వీ మరికేసరీశగ॥ (౫*) భూ[11] ర్యోస్మిన్న[12]
౨౨. రసింహధర్మ నృపతి ర్భూమిం సతాం పాలయ
౨౩. న్నాజాదిత్య ఇతి క్షమాపతి రతో శ్రీయుద్ధ మ
౨౪. ల్లో నృపః త్యక్తాయేన దరివివర్ణ[13] విధవ్యాధ్యః క్షితి
౨౫. భూభుజగప[ద్దాద్ధదేశ రక్షిదాశర[14]] పరశ్రీయుద్ధ
౨౬. మల్లీశ్వరః॥ (౬*) తత[15] స్సరాజన్య శిరోమణీనా మ్పాదా (౪*)
౨౭. విన్దేన హృదోహరద్యః (।*) బభూవనామ్నా నరసింహ దేవ
౨౮. ధాత్ర్యా మభూ ద్భూరి ధృతాధిపాద్యః[16]। (౭*)య[17]న స్తదుసాధశరన్న

దక్షిణము

౨౯. పాణా న్నిర్జిత్యసద్యస్సమరాంగ
౩౦. ణేషువిన్యస్య కే హ స్త మతోనతానాం
౩౧. తాన్మాళ (ల) వన్యః కరటీ చకార ॥ (౮*) ప్రత్యు[18]గ్గతాం
౩౨. గూ (ఘూ) ర్జరరాజసేనాం నిర్జిత్య రాజా స్వయమేక
౩౩. వర[19] కాళప్రియేరాజకద (౦*) బకస్య స్త[20] భాస్వశా

---

7. శ్లోకము ఉపజాతి. 8. ఖండలీకరణము గావింపబడిన భాగ మర్థమగుటలేదు. 9. శ్లోకము ఉపజాతి. 10. శ్లోకము ఉపజాతి. 11. శ్లోకము శార్దూలవిక్రీడితము. 12 ౦భూయోస్మిన్న౦ అని. 13. ౦నిర్జిణ్ణా౦ అని. 14. ఖండలీకరణమయిన యీభాగము సరిగా తెలియవచ్చుట లేదు. 15. శ్లోకము ఉపజాతి. 16. ౦ధృతాధిపత్యః౦ అని. 17. శ్లోకము ఇంద్రవజ్రావృత్తము; ౦యస్స ప్త౦ అని. 18. శ్లోకము ఉపజాతి. 19. ౦వీరః అని. 20. ౦కస్యస్తు౦.

౩౪. ర్యాపిలిశేఖరై శే (లే) ॥ (౯*) తస్యో[1]దపాది బలవ
౩౫. త్పరచక్ర కుంభికుంభస్థళో (లో) ద్ధళన దక్షకృపా
౩౬. ణపాణిః (।*) భీతానతారినరపాళ (ల) కిరీ
౩౭. టకోటిసంఘట్టితాంఘ్రిసరసీజవిరాజితా
౩౮. సః ॥ (౧౦*) శ్రీమా[2]న్మహీపతి స్సూతస్మా న్నామ్నా వీరో
౩౯. రికేసరీ । ప్రాదుర్బభూవ తేజస్వీ ప్రాత
౪౦. ర్భాను రివోదయాం ॥ (౧౧*) సమస్త [3] సామన్తశిఖా
౪౧. మణీనాం ప్రభా ప్రపాతాయిత శార్వరాం స్వ
౪౨. సంచారనారీ నయనాంబుజానాం లక్ష్మీం హి
౪౩. మాసార ఇవా హరద్యః ॥ (౧౨*) [4] సామన్తా స్దణ్డను
౪౪. ఖ్యాన్నిజభుజపరిఘాః ప్రస్ఫురత్ఖడ్గధారాః
౪౫. నీరాంభోరాసిమగ్నాం స్తురగ కరి ఘటాపత్తిసం
౪౬. పత్తియుక్తాన్ కృత్వాపద్ధార్య్యమార్య్యైః స్వజనపరి
౪౭. జనై (ః*) సన్నిహంత్యాజిరంగే కృద్ధేగోవిన్ద రాజ్యహరణ
౪౮. ముపగతో రక్షితో యేన బిజ్జగ ॥ (౧౩) దేవీం[5] రేవకనిమ్మ
౪౯. డి[క్షితిపతేరిన్ద్రస్యపుత్రీ స్సుతాం పౌలోమీమివ
౫౦. వాసవప్రియమివ శ్రీమన్మరధ్వంసకః స్త్రీరత్నం
౫౧. పరిణీయ యేన నితరం తస్యానపత్నీకృతా నూ
౫౨. నాం సప్తసముద్రముద్రితు (త) మహీమ్నా నోన్నతే నాథు
౫౩. నా ॥ (౧౪) తేనభీతానతాఖళ (ల) బళ (ల) వదిళా (లా) పాళ (ల) పూ
౫౪. ళిమాణిక్యరశ్మిమాళా (లా) లాళి (లి) తచరణకమ
౫౫. ళ (ల) యుగళేన శరణాయాతక్షితిపాళ (ల) ప్రాణి

తూర్పు

౫౬. రక్షణ దక్షక్రియాకోపలక్షిత్యేణ దక్షిణ
౫౭. భుజాగ్గళేన కాన్త్యా కాన్తకాన్తాజనమనోనయ
౫౮. ((న*) వల్లభేన కరేణుపుత్రాహవ స్సకళ (ల) గజవి

1. శ్లోకము ఉపజాతి. 2. శ్లోకము అనుష్టుప్. 3. శ్లోకము ఉపజాతి. 4. శ్లోకము స్రగ్ధరావృత్తము. 5. శ్లోకము శార్దూలవిక్రీడితము.

౫౯. కా. శేవటేన, గేతమునే ప్రైశ స్తి తరళావ )[1]
౬౦. దవిధి రుద్రకేన రాజాత్మజేనేవ పరి (ర*) తు
౬౧. విధాన దక్షిణబాహు (బ*) లే (లే) నచ బన్ధురతునే (న*)
౬౨. నన్నృపః । బన్ధుపరాయణేన ఈశ్వరేణచ
౬౩. విజితమనో (భ*) వేనోమ ప్రియేణ చ
౬౪. నారాయణేన చ గోవర్ధననాగధరేణ చ
౬౫. చతురాననేన చ చతురాననేన చ సక
౬౬. ళ (ల) కళానిళ (ల) యేన తరళాధిర (క?) మధు
౬౭. ముదాగన్ధికరేణ కాన్తిమతాచ వనజే (న*)
౬౮. బన్ధనేవప్రబోధిత బసుర బహు వ
౬౯. దనవనకేన నిరస్తారతి తిమిరేణ
౭౦. చ సహస్ర కిరణవ దతుళ (ల) తేజసా
౭౧. శ్రీమదరికేసరి మహారాజేన ॥
౭౨. స్వస్తి (।*) సమధిగతపఞ్చమహాశబ్ద మహా
౭౩. సామన్తాధిపతి సమస్తభువనసంస్తూయమా
౭౪. న చాళుక్యవంశోద్భవం పాంబరాంకుశసమ్మాన గ
౭౫. న్ధవారణం గన్ధేభవిద్యాధర నారూఢసర్వజ్ఞ
౭౬. నుదాత్తనారాంణం[2] గెందుత్తిగెల్దాం గుణంనిధిగుణా
౭౭. ర్ణవం శరణాగతవజ్రపంజరం ప్రియగళ్ళం
౭౮. త్రిభువనమల్లసామన్తచూడామణి శ్రీ
౭౯. మదరికేసరియరసర తత్పాదపద్మోప
౮౦. జీవి సమస్తరాజ్యభారనిరూపిత మహా
౮౧. సన్ధివిగ్రహపదవీప్రతిష్ఠితం సమస్త
౮౨. శాస్త్రపారగం శ్రీమత్సన్ధివిగ్రహిగుణిక (ర)
౮౩. శేన ॥। తత్పాదాంభోజ......య ప
౮౪. త . వి . . .

1. ఈ కుండలీకృతభాగము స్పష్టము కాలేదు. దీనితరువాత గద్యయు అర్థము కాకున్నది.
2. °నారాయణ° అని కావోలును.

## ఉత్తరము

౮౫. శ్రీమాన్నిధి (ధీ)బ్బుర్ద్దెగ[1]భూమి భర్త్తార్న్న
౮౬. త్రాధిపాలో జని నాగమార్య్యః। గుణార్ణ్ణ
౮౭. వోర్వ్వీపతి తంత్రపాళ (ల)న్తస్యాత్మజో జాయ
౮౮. తే పెద్దణార్య్యః॥ (౧౫*) తేనాభ్యర్థితో దేవతాం వన్ద
౮౯. న నిమిత్తమాగత స్వనిర్మ్మాపి తాదిత్యగృహే
౯౦. మాగతాభ్యాగతజన సత్ర నిమిత్త ముత్తరా
౯౧. యణపుణ్య సంక్రాన్తిదివసే శతనివర్త్తన సం
౯౨. ఖ్యాతభూమిక్షేత్ర మష్టనివర్త్తన సంఖ్యాత
౯౩. దాసీయః[2]భూమిక్షేత్రం చ లెంబుళపాట
౯౪. కపత్తనే[3]లాన కేన[4]శ్రీమదరి కేసరిక్షితి
౯౫. పతి రదాత్॥ తత్ర రాజేశ్వరాదిత్యగృహా బద్ధ
౯౬. గీశ్వర నగరేశ్వరప్రభృతి చతుస్థ్థానాది హా
౯౭. సం[5]స్థానకే మల్లికార్జ్జునవ్యక్తలింగి విద్యా (ధ*) రాధి (ది*)
౯౮. వ్యాఖ్యాని భట్టారకాశ్చ సాక్షిణః॥ చన్ద్రిశ్రేష్ఠిప్రభృ
౯౯. తయో న చ శ్రేష్ఠినశ్చ సాక్షిణః।
౧౦౦. నిస్పృహైకాగ్రణీ స్సూరిస్థానాదిష్ఠో యశా స్వయం
౧౦౧. ధాతవిద్యాన్వయేజాతః పణ్డితమునీశ్వరః ॥ (౧౬*)
౧౦౨. స్వధర్మ్మాపదయంధర్మ్మః పాళ(ల)నీయో ధరాధిపై (ః*) ।
౧౦౩ స్వధర్మార్థాయ [6]స్థితేస్సన్తః ప్రద్యు[7]దస్త కదాచన ॥ (౧౭)
౧౦౪. కాలక్షేపోనకర్త్తవ్యం ఆయుక్షీణే దినేదినే
౧౦౫. సమస్తకరుణానాస్తి ధర్మ్మార్థై త్వరితాగతే ॥ (౧౮)
౧౦౬. అనిత్యాని శరీరాణి విభవోనయ్యో[8] శాశ్వతః ।
౧౦౭. నిత్యసన్నిహితోమృత్యుర్కర్త్తవ్యోధర్మ్మసంగ్రహః (ః*) (౧౯*)
౧౦౮. అస్య క్షేత్రస్య ద్వాదశ ద్రమ్మ[9] సిద్ధాయః ॥

---

1. శ్లోకము ఉపజాతి. 2. °పానీయ° అని చదువవచ్చును. 3. పట్టణే అని. 4. ఇది అరమఱుగట లేదు. 5. °మస్థానకే° అని చదువవచ్చును. 6. °ధర్మ్మార్థాయాం అని. 7. °ప్రత్యుదస్తం అని. 8. °స్సైన° అని. 9. °ధనర్మ్మా° అని. ఇందు ఉపధ్మానీయమును … అను గుర్తుయూలమున సూచించినాడను. శాసన తాత్పర్యము ముందే చర్చించినాడను గావున స్థలవిస్తర భీతిచే మరల నర్థ మిచ్చుట నొసగనైతిని.

# విలయతాండవము*

శ్రీ డి. రాజశేఖర కవిగారు

సచరాచరప్రపంచప్రాణుఁడగు సూర్యభగవానుఁ డాదిమవంశకర్త
త్రిజగతీధానుష్కదీక్షకుండయిన రాముని సుతుండు లవుండు మూలపురుషుఁ
డల యగస్త్యాశ్రమఖ్యాత 'మాబూగిరి' నేకలింగేశ్వరుం డిష్టదైవ
మతిపావనము లయోధ్యావల్లభీసీసు లాదికాలమునాఁటి యాటపట్టు
లాశిలాదిత్యకనక సేనాదిరాజ - రాజపరమేశరణవిహారప్రతిష్ఠ
ఖండఖండాంతనగరవిఖ్యాతిహేతు; - వట్టి మేవాణ్నృపుల నెన్న నలవియగునె?

*　　*　　*　　*

"తతరమాఖండభారతఖండగగనంబుఁ దవులు మధ్యాహ్నమార్తాండమూర్తి!
బప్పరాయాన్వయాభరణషట్త్రింశ న్నృపాలకకులభూరివజ్రమకుట!
కగ్గార్ నదీతీర కదనాంగణమున మద్భ్రాతృ పృథ్వీసార్వభౌముఁ బాసి
పదుమూఁడువేల్ దొరల్ గదలఁ గల్యాణుండు పుష్పాస్త్రసముఁడు నాముద్దుకొడుకు
తన స్వయంవరమున కట్లు తరలిపోవ - నను, ననాథ, నపుత్రగా నునిచి పోతె?"
యని పృథాదేవి వగచి, నిన్ననుగమింప - సమసితే శత్రుగజసింహ, సమరసింహ!

'ప్రార్థింతు'వలన దీపని యంచు సంయుక్త కొనకాళ్లఁ బడి మొత్తుకొనిన వినక
ఘోరీని బిలిపించి, కొంప కగ్గి ఘటించి నృపచంద్రు సమరసింహేంద్రుఁ ద్రుంచి
పృథ్వీశు నట్టట నిడి కుంకుమూడ్చి సంయుక్త వైధవ్యసంయుక్తఁ జేసి
యుర్వి యున్నంతకు నుగ్రాపకీర్తిమై రాజ్యంబు పారతంత్ర్యమున నిడితె?
కటకటా! కోటియుగములు గడచుఁగాక - పృథ్వివిభువంటి రాజరా జెచటఁ గలుగు?
మఁగిసె సర్వంబు! భరతాంబ ముండమోసెఁ! - జెనఁటి జయచంద్ర! నిబిడదుష్కీర్తిరుంద్ర!

*　　*　　*　　*

'జాక్సారిటీసు' శ్రేష్ఠతమంబె, కాని, జాహ్నవియె లోకైకపూజ్యతకు తావు;
టర్కి, ప్రశస్తమండలమాను గాని, యార్యావర్త మమృతరసాత్మకంబు;
సమరఖండ మతియోగ్యము కాని, ఢిల్లీపురము స్వర్గమునకు సర్గమగుతావు;
తురకలు స్వజనుఁ లౌదురె కాని భారతప్రజలు లోకోత్తరప్రాభవాంకు;
లింట నుండిన విశ్రాంతి యెసఁగుఁ గాని - రామ మాంధాత లేలిన భూమి గెలువ
ఘనతలైశ్వర్యములు గల్గి గణన గల్గు - ననుచు, బేబరు దండెత్తి యరుగుదెంచె!

*　　*　　*　　*

రౌద్ర కేసరి కేసరముల నుయ్యెలలూఁగు నతిబలాఢ్యులు దేవరాధిపతులు;
కులపర్వతముల డీకొని పిండిగాఁ జేసి యంబుధిఁ గలుపు ఝాలావనీంద్రు;

* "రాణాప్రతాపసింహ" ప్రబంధమునుండి.

లుంకించి తాఁకిన నుర్వీతలంబు పై కెగిరించు సోనెగుఱ్ఱేశ్వరులును;
ఫాలాక్షుతో మెడపట్టులు పట్టి గెల్వంగఁజాలిన హారవంశ్యమణులు;
జగము సర్వసంహారము సలుపఁగలుగు-ననమశౌర్యులు చోండావదన్వయులును;
నడచు సంద్రంబు లనఁగ సైన్యములు గొనుచు-వచ్చి చేరిరి చిత్తూరు పట్టణంబు.

* * * *

ఉదయాస్తాచలమధ్యగంబగు జగం బెల్లాఁత లూఁగించె నె
ట్టిదుఁడో పుత్రుఁడు! శత్రుంజిద్బలికిరీటిప్రాయుఁడై కీర్తి సం
పద నార్జించెను దండ్రి, యెట్లితఁడు మేవాడ్ ప్రాజ్యసామ్రాజ్య శా
ఖఁ దినం బొచ్చిన పుష్పియట్లు పొడమెన్ గీర్తిన్ గళంకించుచున్!

* * * *

ముద్దుమోమున నాణిముత్యాలబాసికం, బద్దంపుఁ జెక్కిళ్లయందు సనుఁగుఁ
గాటుకచుక్కయుఁ, గాళ్లఁ బారాణియుఁ, బసుపు వన్నియ పెండ్లివస్త్రములును,
సర్వమంగళరూప సంపదతోఁ దనుత్రాణంబుఁ దొడిగి, హస్తమున ఖడ్గ
మలర, బ్రాణేశ్వరు నండ నిల్చుచు, నత్య నరకుసేనలనట్లు నతికె రిపుల!
పెన్నముద్ద పిరంగినై వెడలివచ్చె!-భీతహరిణశాబము వేఁడిపిడుగె యయ్యె!
నబ్జనాళము బ్రహ్మాస్త్రమగుచు వెడలె-నన, రణమొనర్చె నాపుత్త్రయనుఁగుఁబడఁతి.

* * * *

అకటా! సింధుకు బ్రహ్మపుత్రకును మధ్యన్ గల్గు నీసర్వధా
త్రికి రారాజవు, యుద్ధ మాఁపుతటి, రాత్రిన్, గార్యనిర్మగ్నుఁ, శౌ
ర్యక్రృతిన్ జంపితి వెచ్చరింపకయె వీరవ్రాతశార్దూలు! నేఁ
టికి నీగొప్పతనంబు ధర్మమును బాటింపంగ లేకున్నదో?

* * * *

చిగురైనఁ జిదుమ నొచ్చెడుచేతు, ముప్పదివేల పౌరులఁగూల్పఁ జాలి తెట్లు?
కటవె భేరులు నీకుఁ? గడుపు నిండెనె? ప్రాఁతతోల్మొక్కలే కాని దొరకఁగలదె?
దివ్వెకంబముఁ గొంటె? తీరెనే నీదరిద్రత? కటా! భూరిసామ్రాజ్యపతివె?
కోట గల్చితి గాక, కుంభజయస్తంభ మేల కూల్చితి? లాభ మేమి నీకు?
గుడుల దివ్వె లార్చెదు పచ్చికూళలైనఁ - జేకొనరె! యెట్లు చేయాడె చిత్తురుపురి
ద్వారబంధముల్ గొన? చల్లపడెనె కనులు! - నరసగుణధామ, యక్బరుసార్వభౌమ!

* * * *

కులశైలోపమధైర్యభూధవశిరఃకోటీరకోటీమణీ
జ్వాలదారక్తరుచుల్ పదంబులు వహింపన్ జూచి యున్నట్టి క
న్నులతో, దారుణసంగరాంగణమునందున్ గత్తులన్ జీల్పఁగా
వెలికిన్ దూఁకెడు క్రొత్తనెత్తురులనున్ వీక్షింప నా నేమొకో!

---

# పి. బి. షెల్లీ—స్వేచ్ఛప్రేమ

తెన్నేటి విశ్వనాథంగారు

[పి. బి. షెల్లీయను ఆంగ్లేయమహాకవి 1792 వ సం. మున జన్మించెను. 1822 లో చనిపోయెను. ఆంగ్ల వాఙ్మయము చదివినవారు ఈ మహాకవియొక్క వాగమృతధారయు, భావనాప్రౌఢియు, రచనాచాతుర్యమును తప్పక గ్రహించియే యుందురు.]

ఇంగ్లాండుదేశమందు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయము పేరెన్నిక గన్నది. పందొమ్మిదవ శతాబ్దారంభమునందు 1811 వ సంవత్సరమున ఆవిశ్వవిద్యాలయము వారు "నాస్తిక మతముయొక్క ఆవశ్యకత" అను చిన్న గ్రంథమును వ్రాసి ప్రకటించినఒక యువకుని, విద్యాలయమునుండి వెడలగొట్టిరి. ఆయువకుని పేరు పర్సి బిషి షెల్లి. ఇతడు ససెక్సుప్రభువునకు కుమారుడు; మిక్కుటమగు ధనమునకు వారసుడు; చిరకీర్తిగల మహాకవి కానున్నవాడు. మహాఅందమైనవాడు; పొడుగైన ఉంగరముల జుట్టు; కళల వెలియగ్రుమ్ము నీలములవంటి కన్నులు; గుండ్రని భుజంబులు; స్త్రీలాలిత్యమైన కంధరము. అతని అందము, ఆకర్షణశక్తిగల ఆకారము మగవారియొక్కలనైనను నిరంకుశమైనవి, స్త్రీలమాట చెప్పనేల! ముఖము స్త్రీత్వము గలదని కొందరందురుగాని, అందులో నిజము లేదు. ఆకాలమునందు అశాస్త్రీయమైన అభిప్రాయములను ఎక్కువగ అతను వెడలబుచ్చెడువాడు; నాస్తికుడు; 'స్వేచ్ఛప్రేమ'వాదకుడు—ఇంకేమికావలెను; విశ్వవిద్యాలయమువారు వీని వతలకు తరుమగొట్టినారన్న ఆశ్చర్యమేమి? మీద చెప్పిన గ్రంథము వ్రాయకపోయినను తత్తుల్యమైన కార్యము వేరొకటి చేసి, సాంఘికరౌద్రమునకు పాల్గొనవలసినవాడే.

ఇటువంటిగుణములు గల్గిన యువకునకు పలురకములయిన ప్రేమవిహారములు సంభవించుటలో వింత లేదు. అయితే, షెల్లీయొక్క ప్రేమసంబంధములన్నియుగూడ ఏకోవిధముగ దుష్టదైవపరిపాలితములై పరిణమించెను. అతనికథ నవరసభరితమై యొప్పెను. అతని యొక్క భావము మిగుల అందమైనదియు, అత్యాదర్శనాలోలమునై యుండెను. చెడుగనునది అసత్యవాదమునను సందు వెతకుటకైనను లేదు. స్త్రీజాతియందు అతనికి అపారమైన గౌరవముండెను. వనితాసహాయాభిలాషి; అత్యాదార్యవంతుడు.

చదువుకొనుచున్న చిన్నవాడు బడియందు అందరు తన్ను "పిచ్చిషెల్లీ" అని పిల్చెవారు. ఆక్స్‌ఫర్డువిశ్వవిద్యాలయమునుండి వెడలునాటికి, హారియటు గ్రోవు అను యువతియెడ అతను బద్ధానురాగుడై యుండెను. ఆయువతి అతనికి అసలుచుట్టము. ససెక్సులో ఇంటను, అతను, అతనిసోదరి ఎలిజబెతు, హారియటును ఒకరి నొకరిని విడవకుండ నుండెడివారు. షెల్లి సాధారణంగా చర్చి తోటలలో కాలక్షేపం చేస్తుండేవాడు. అక్కడనే వీరిద్దరుకూడ అతనితో విహరించేవారు. ఇద్దరినడుములను తన రెండుచేతులలో బట్టి చేరతీసి జీవజిజ్ఞాస, తత్త్వము, ముఖ్యముగ తనకుగల స్వేచ్ఛప్రేమతత్త్వము గురించి వారలకు చెప్పుచుండెడువాడు. వారును అత్యాదరముతో అతను చెప్పునంతయు వినుచుండెడువారు.

కాని, షెల్లి దూరమైనకొలదిని, హారియట్టుకు అతనియందుగల అనురాగము తగ్గుచు వచ్చెను. అతని యొక్క భావములందు గురి ఆమెకు నానాటికి తగ్గెను. విశ్వవిద్యాలయమునుండి వెడలి, తనతోపాటు వెడలగొట్టబడిన తనమిత్రుడగు హాగుతో లండను నగరము చేరుసరికి, ఇంకను అతను విఫలప్రేమవిషాద నిమగ్నుడైయుండెను. తండ్రియా తిరిగి కోపెను; ధనమా లేదు. తనసోదరి పంపెడు ఏకొలదిమాత్రపు పైకముతోనో కాలము గడుప వలసివచ్చెను. ఆసమయములో తన యిద్దరు అక్కచెల్లెం

ద్రుడు క్లాపహాము విద్యాలయమునకు వచ్చియుండిరి. అక్కడ వారితో నుండగా తన విఫలవివాదము నిర్మూలముగుటకు అవకాశము కలిగెను. అక్కడ హారియటు వెస్టుబ్రూకు అను యువతిని చూచెను. ఆమెవయస్సు పదునారేండ్లు; కోమలాంగి; చూచుటకు ఇంపైన తల జుట్టు; మనోహరముగునైనవాయ్య. ఇంట నామెకు సౌఖ్యము లేదు; విద్యాలయమందు ఆమెగౌరవకుటుంబమునకు జెందనిదని ఒక అగౌరవము. ప్రభువుయొక్క కుమారుడైన షెల్లీతో సంబంధముగలుగునని ఆమెతండ్రి ఆశలూరుచుండెను. ఏమైనను, ఒకరాత్రి ఆమెదేహమందస్వస్థత యని పరున్నపుడు ఆమెదగ్గిర షెల్లీని ఒక్కడిని విడిచిపెట్టి పోయెను.

తరువాత షెల్లీ వేల్సుదేశమునకు వెళ్లెను. అతడక్కడుండగా, బలవన్మరణము చేసికొనెదనని, హారియటు తనకు ఉత్తరము వ్రాసెను. షెల్లీ నాస్తికత్వము మొదలుగాగల తత్త్వముల నుపదేశించిన యాతడే గాని, ప్రస్తుతము భయాభిభూతుడయ్యెను. ఆమెయొక్క మేలుకీళ్లకు తనయొక్క ఉపన్యాసములు కారణములని గ్రహించెను. దీని పర్యవసానముగ తిరిగి తాను లండనునగరము వెంటనే చేరెను. పరస్పరానురాగము నిద్దరు బయలుచేసికొనిరి; ఆమెను లేవదీసికొని తత్క్షణము అతను ఎడింబరో పోయెను. షెల్లీకి వయస్సు పందొమ్మిది; హారియటు వయస్సు పదునారు. ఆయూరు చేరునరికి యిద్దరిచేత దమ్మిడికూడ లేదు. అయితే ఈతని సంప్రదాయము, కుటుంబపు గౌరవము విని యొక పురుషుడు వీరుంటుటకు బస యిచ్చి ఖర్చునకు కొంత ధనము నొసంగెను.

స్వేచ్ఛాప్రేమవాదకులకు వివాహమన్న అసహ్యము. అయినను అతని మిత్రుడగు హాగు "నాయనా, నీవా హారియెట్టును వివాహమాడుదువు" అని అంతకు ముందు కుంతము లాడుచుండెడివాడు. వివాహము చేసికొనక పోయిన హారియెటునకు పరువునష్టము, దుఃఖము సంభవించునని అతనియూహ. ఆకారణముచేత, షెల్లీ వివాహమున కంగీకరించెను. అతనిమిత్రులు వివాహప్రయత్నములు గావించిరి. వివాహము చాల శోభగ జరిగెను. వింటు తోరరయ్యెను. ఎడింబరో వర్తకస్నేహితుల యానందము మితిమీరెను. వారి సంభావనయు మర్యాదల నతిక్రమించెను; కిస్గచే షెల్లీయున్నూ, భార్యయున్నూ శేరొకగదిలోనికి పోయిరి. అంతలో ఎవరో తలుపు తట్టిరి. షెల్లీ తలుపు తీసెను; తీయునరికి యింటియజమాని నిషాగా "నగమురాత్రివేళ, షెల్లీ హాతురునకు విస్కీతో తలంటుట మా దేశాచారమ"ని కేకలువేసెను. తోడుగుళ్ల పిస్తోలు చూపించి, షెల్లీ తత్క్షణము వానిని తరిమివేసెను.

హారియెటును లేవతీసికొనిపోవుట ఆలోచనపైని చేసినపని కాని మోహాంధ్యముచేత కాదని, షెల్లీ పదిమారులు అనుచుండెడివాడు. అయినను కొలదికాలములో ఆమెయందు మోహము ముమ్మరించుచు పెరిగెను. హారియటు కూడ ఇంకేమో అంతమో తెలివైనదే; చదువు కొన్నదికూడను. సంభాషణాసక్తతయు కొంత గలదు. అయినప్పటికి ఇతర సహవాసాభిలాష అతనికి కొంత యుండెను. తమిత్రుడగు హాగు అచట లేడు. మిస్ హిచినరు అని పాఠశాలయందు గల బడిమిస్ట్రెస్సు ఒకతె అతనికి స్నేహితురాలుండేది; ఆమెహృదయము అతనియందు లగ్నమై యుండెను. ఆసంగతి అతనికి తెలియదు కాని, తనయొక్కయు, తనభార్యయొక్కయు కాలక్షేపముకొరకు ఆమెను రమ్మని వ్రాసెను. "నాస్తికురాలైన నేను వివాహము చేసికొనుటకు ఎట్లు అంగీకరించితినని నీ వడిగెదవు కాబోలు; రమ్ము, నేచెప్పెదను" అని వ్రాసెను. కాని ఆమె అంగీకరింపలేదు.

ఇంతలో హాగు వచ్చెను. ఇంగ్లండునకు పోయి తండ్రిదగ్గర ధనము కొంత లాలించి పుచ్చుకొనుటకు కోరికగల్గి, హాగును హారియట్టును ఎడింబరోలో వదిలి, షెల్లీ తండ్రికడకు పోయెను. హాగునకు హారియటునందు మోహము కల్గెను. కాని ప్రమాదముమాత్రము జరుగలేదు. షెల్లీయొక్క సోదరియగు ఎలిజా అక్కడకు అంతటిలో వచ్చెను; హారియట్టుయొక్క శీలము భంగపడుటకు అవకాశము మరి కలుగలేదు. ఉదారమనస్కుడగు షెల్లీ ఈవార్త విన్నప్పుడు హాగును మన్నించెను.

షెల్లీతండ్రి, కొంతమంది మిత్రులు చెప్పినపైని కొంతపైకము సుతున కిచ్చెను.

వివాహమయిన కొంతకాలములో గాడ్విను అను ఒక మహారాజనీతివేత్తకును షెల్లీకిని పరిచయము కలిగెను. గాడ్వినుకు ఇద్దరు భార్యలు; అందు మొదటిభార్యకు మేరి యను ఒక కూతురు కలదు. ఆ మేరి మిగుల అందకత్తె.

మేరీని చూచిపరిచయము కలుగచేసికొనునాటికి షెల్లీకి హారియెటువలన ఒకబిడ్డ కలిగెను. ఇప్పటికి వివాహమోహము తగ్గెను. హారియెటునందు అనురాగము అతనికి తగ్గెను; అతనియెడ ఆమెయొక్క అనురాగమును చల్లబడెను. రాసురను ఎవరో, మేజరురా యను అను వానికి ఆమెకును స్నేహము ముదురుచున్నట్లు పుకారు బయలుదేరెను. ఇక్కడ షెల్లీకి గాడ్విను కుమార్తెలకున్న మిత్రత్వము హెచ్చాయెను. కాని, వీను ఇద్దరు యువతులు ఈతనిని దైవముగా చూచుచుండెడివారు. అంతలో, అప్పటివరకు స్కాట్లాండులో ఉన్న మేరి కూడ వచ్చెను: మేరీని చూచు భాగ్య మబ్బునని షెల్లీ యొక్క మనసును ఉప్పొంగెను. ఏ మాదృశ్యము! తెలుపుగల బంగారపు పైనాయు; పల్చనై అందముల రాశియగు ముఖము; కన్నులమిరుమిట్లు గొలుపు శిరోజములు; చేపకన్నులు. పదునారు పదియేడుసంవత్సరముల వయసు గల యీసుభాంగిని చూచునపటికి కవితారసము షెల్లీయొక్క హృత్సాగరమునందు పొంగి పొరల జొచ్చెను. తనభార్యయగు హారియటునకును, ఈమెకును ఎంతవ్యత్యాసము కలదు! పైపై మాటలసొంపు, అలోచన శూన్యమూ, తనయెడ అనురాగచోదితయగు భార్య ఎక్కడ? నిగూఢభావనాయుతమగు మనసు, పరమని కేశ పూరిత మైన పలుకులతీరును, తనహృదయమునందు లీనమగు హృదయమును గల మేరీయెక్కడ? తాను ఆశాభావమందు ఎన్నుకొన్న పెన్నిధి చివరకగపడినదని షెల్లీ నిశ్చయించుకొనెను. ఈతనును కందర్పుడని మేరీయు నిశ్చయించుకొనెను. ఎంతవర్ణించినను అతని యందమునకు వర్ణన తీసికట్టగును.

అత డానందహృదయుడు గాడని ఆమె వెంటనే పోల్చుకొనెను. ఆమెకును, ఇంట సవతితల్లి యగుటచే, సౌఖ్యము తక్కువ. ప్రతిదినము ఆమె పోయి చర్చివెనుక తనతల్లి గోరికడ కూర్చుండి మనశ్శాంతి చేసికొనేది. అక్కడ కూర్చొని చదువుకొనేది.

ఒకదినమున కవియు ఆమె ప్రక్క నుండెను. తనప్రేమ పోకడల పోనిచ్చెను. తనహృదయానురాగము వెల్లడిచేసెను. మేరియు అతనికరములందు తన మెత్తనికరముల నిమిడ్చెను. కవి "మేబురాణి" అని తాను రచించిన గ్రంథరాజము నామెకు ఇచ్చెను; ఆగ్రంథము ఆమెపేరట సరస్వతీదానము చేసెను. ఆ గ్రంథము తీసి, చివరపుటయందు ఆమె యిట్లు వ్రాసెను:—

'ఈపుస్తకము మహాపవిత్రమైనది. మరెవరు దీని జూడరు కావున నాకుతోచినది నేను వ్రాసెదను. ఏమి వ్రాయుదును? ఏమనా! వచనరచనాతీతమగు ప్రేమతో నేనీ గ్రంథకర్తను ప్రేమించుచున్నాను. అయినను వియోగము సంభవించుచున్నది. మత్ప్రియేశ్వరా, అన్యోన్యానురాగబంధనముల మనము పరస్పరముగ చేసికొన్న వచఃప్రతిజ్ఞలవలన, నేను నీదానను కాజాలకపోయినను, వేరొకరి దానమాత్రము ఎన్నటికిని కానని యెరుంగుము'.

షెల్లీతో సంయోగము కలుగునో, లేదో, అని ఆమెకు కొంత సంశయము గలదు. కాని కొన్నిదినములలో ఆసంశయము నివారణము అయ్యెను. హారియటుకడకు పోయి షెల్లీ కడసారి "సెలవు" అని చెప్పెను. అయితే ఆమె అప్పటికి పూర్ణ గర్భవతి; ఈమాట వినునటికి ఆమెకు జబ్బుచేసెను. అటువంటి దుస్థితిలో ఆమెనువదలి ఎట్లుపోవుట? ఆమెయొక్క జబ్బు కుదురు వరకు అతడు ఆమెపక్కనుండి ఏపురుషుడును పడని శ్రమతో ఆమెకు సేవ చేసెను. కాని ఇద్దరికి పొత్తు కలియుటమాత్రము కున్న. ఆమె జబ్బు కుదిరెను; అతని మనసుమాత్రము ఆమెయెడ కుదురలేదు. "ఏకపత్నీవ్రతమా—అందేమి సద్గుణము గలదు; ఒకప్పుడు అది దుర్గుణప్రధానము" అని ఆమెతో అతడే చెప్పెను. వివాదము చేయుటకు హారియటుకు శక్తి లేదు. తప్పుఅంత మేరిపై

వేసెను. 'మాతులమారియును మేరి, గోరీలమధ్యను జేరి, బూటకపు కబురులతో తనవలయందు షెల్లీని వేసికొన్నది' అని ఆమె తలచెను. మేరిపై క్రోధము జేసికొనెను.

తనరాబడిలో కొంతభాగము హారియెటునకు ఇవ్వవలసినదని బ్యాంకునకు వ్రాసి, భార్యయు పిల్లలు సుఖముగ ఉందురని మనస్సుగట్టిచేసికొని, షెల్లీ మేరీని తీసికొని డోవరునకు గుఱ్ఱపుబగ్గీమీద పారిపోయెను. డోవరునుండి యూరపునకు ఎకాఎకి ప్రయాణమట. తెల్లవారుజామున నాలుగుగంట లయింది. మేరీయొక్క సోదరి క్లేరకూడవారివెంటబడినది. మేరీని లేవనెత్తుకుపోవునపుడు, ఆమెయొక్క సోదరిదగ్గర యెందుకు అని అతనికి తోచలేదు; ఆమెకు తోచలేదు. సాయంకాల మయింది. డోవరులో చిన్నపడవ బేరమాడి కలేకు ప్రయాణము. రాత్రిఅంత మేరీకి సముద్రపుజబ్బు; షెల్లీ తొడలపై తల నిడుకొనే పరున్నది. నగమురాత్రిసరికి బ్రహ్మాండమైన ఉరుములు, మెరుపులు, గుపాను. ఎలాగో తెల్లవారినది; సముద్రము శాంతిని పొందినది. వారు కలే జేరిరి. సామానుపడవకొరకు వేచియుండిరి. సామానుపడవయు వచ్చినది. కాని అందులో మేరీయొక్క సవతి తల్లియు వచ్చినది; ఎలాగైనా, మేరీ చేయునది తగినపని కాదని మరలించి తీసికొనిపోదునని ఆమెయూహ. అబ్బో! ఆమె మరలునా? పోనీ, ఆమెసోదరి జేనుమాట ఏమి? ఆమెయు తిరిగిపోదు. ఈయిద్దరును ఒకేతీరున, షెల్లీయొక్క పలుకులతీయదనమున చిక్కుకొన్నవారు. సవతి తల్లి నెత్తిమీద గుడ్డవైచుకొని తిరిగిపోయినది. వీరు పారీసు జేరిరి. సరి, చేతిలో దమ్మిడి లేదు. గడియారము, గొలుసు తాకట్టుపెట్టి కొంతసొమ్ము, తెలిసిన మరియొక ఆసామీదగ్గర అరవై పౌనులు అప్పు ఏలాగో సంపాదించేరు.

పారీసునుండి కాలిప్రయాణము; సామాను మోయుటకు ఒక గాడిద. సగంతోవలో గాడిదకాళ్లు తేలవేసింది. గాడిదను అప్పునకు అమ్మి ఒకకంచరగాడిదను కొన్నారు. తోవలో ఉండుటకు బసలు ఏవి? ఆసమయము యుద్ధానంతరసమయము. బసలు మంచివి లేవు. గదులు చీకటికొట్లు. అందుచేత రాత్రిసమయముల షెల్లీ, మేరీ, జేని ముగ్గురున్ను వంటపొయ్యిలకడ కూర్చొని, కాలక్షేపము చేసెడివారు. హారియెటునుమాత్రము షెల్లీ మరచిపోలేదు. ఆమెమాట తలచుకొని విచారించేవాడు. ఇంతే కాదు. వీనివ్రి మూల, ఆమెకు తనదగ్గరకు రావలసిందనిన్ని, తనవంటిమిత్రుడు వేరొకడు దొరకడనిన్ని, ఆమెయొక్క మనస్సుకు నొప్పి కలుగజేయకుండా ఉంటాననిన్ని, తనయొక్కయు మేరీయొక్కయు శోభను చూడవలసినదని ఉత్తరంకూడ వ్రాసేను. హారియెట్టుమాత్రం జవాబు ఇవ్వలేదు. ఏస్త్రీ అయితేమాత్రం జవాబు వ్రాయును!

స్విట్జర్లండు చేరినారు. కాని వారద్దెకు పుచ్చుకొన్న గదులు పాతవి. ఏమీ సౌఖ్యము లేదు. జేబు తడిమి చూచుకుంటే ఎనిమిది పౌనులుమాత్రము తమ యావదాస్తి. ఏమి చేయుట? తిరిగి ఇంటికి అనగా లండనునగరమునకు 'శీఘ్రబుద్ధిః పలాయనే'అని తోచింది. ఎలాగో బండ్లవాళ్లను బ్రతిమాలి, పడవవాళ్లకు బాకీపెట్టి లండనునగరం జేరిరి. చేరగానే, బాధ ఎలాగైన నివారణచేసికో నిశ్చయించి, షెల్లీ తిన్నగా తనభార్యయగు హారియట్టు ఇంటికి పోయి కొంతపైకము అప్పు పుచ్చుకొనెను.

మేరీమెడ విసుగు చెందగా, తిరిగి నాయెడకు రాదా యని హారియెటు మనసులో తలచుకొనుచుండెను. కాని వృథాతలపుకదా యది. ఇంతలో ఆమెకు రెండవ బిడ్డ (కొడుకు) ఉదయించెను; కుమారజననమైనను భార్యాభర్తలను గలుపలేకపోయెను. షెల్లీయు మేరీయు, ఎన్నికష్టములైన ఓర్చి మొత్తముపైని సౌఖ్యముగానే ఉండిరి. జేనికూడ, క్లేరాఅని పేరు మార్చుకొని వారికి తోడునీడగ వెంబడించియుండెను. ఆమె ఉండుట వారిద్దరికి కొంచెకొంచెము కష్టముగా తోచుచుండెను. ఆమెకు ఏకోబాధ అప్పుడప్పుడు కలుగుచుండెను. అసలురహాస్యం, కవిత్వంను ఆమెకును పూర్తియైన మోహముదయించెను.

ఇంతట షెల్లీకి ఎక్కడ చూచినను అప్పులు; వారంట్లు హెచ్చయ్యెను. కొంతకాల మందుచేత అతను పరారిఅయిపోయి రహస్యముగా మేరీని కలిసికొనుచుండెను.

ఇంతలో షెల్లీయొక్క పితామహుడు మరణించెను. అతనిమరణము ఈతని భాగ్యము. ఈతనికి సంవత్సరమునకు వెయ్యిపౌండ్లు వ్రాసియిచ్చెను. షెల్లీ తత్క్షణము హారియటునకు ధారాళమైన మనోవృత్తి వ్రాసియిచ్చెను. గాడు గారికికూడ ఏదో కొంత సహాయము చేసెను.

అంతట మేరీకి గర్భోత్పత్తి, శిశూదయము, శిశుమరణము సంభవించెను. ఇంటను జాని (సోదరి) యుంటయు ఆమెకు కష్టముగ తోచెను. మాత్సర్యమే ముఖ్యకారణము. జాని తెలివైనది; ఒకవిధమైన ప్రచండధోరణి గల్గినది. అయినను, యువతిగదా. ఏమో! షెల్లీమనసు ఏలాగు పరువులెత్తునో అని ఆమెయొక్క అనుమానము. ఎలాగయితేనేమి జానీని పంపించివేసినది. అనురాగహృదయయగు జాని, షెల్లీయొక్క హృదయము నాకర్షించలేనందుకు చింతిల్లి, మరియొకపురుషునియొక్క హృదయమైన నాకర్షించి ప్రేమఫలముల పంచింప నెంచి, బైరను ప్రభువను ఇంకొక కవిశ్రేష్ఠుని సాంగత్యము పొందెను—అది వేరే కథ.

స్విజ్జర్లండులో షెల్లీమేరీల కలిసికొనుటకు బైరను ప్రభువు వెళ్లెను. అతనున్ను జానీయు కొంతకాలము కలిసియుండిరి. ఆమెపై తరువాత అతనికి అభిరుచి తగ్గెను. వారిద్దరికి కలిగిన ఏలిగ్రా అను పిల్ల అయిదున్నర సంవత్సరము లుండిచనిపోయెను.

షెల్లీ స్విజ్జర్లండులో ఉండగనే అతని జీవనాటకము విషాదాంతముగ నేమోయను సూచనలు పొడగట్టెను. గాడ్విను మాడవకూతురగు ఫానీమాత్రము ఇంటికడ ఉండవలసిన అభాగ్యమబ్బెనని వగచుచుండెను. తన అక్కచెల్లెండ్రిద్దరు సాంఘికనిబంధనల నతిక్రమించి సౌఖ్యలోలలై యుండిరిగదా అని తలచుచుండెను. ఆమెకుకూడ షెల్లీపై అనురాగ మంకురించెనని వేరె చెప్పనలెనా!

ఇంగ్లాండుదేశమునకు షెల్లీ, మేరీ, క్లేరాలు వచ్చేసరికి, లండనునగరమందు ఫాని వారిని కలిసికొనెను. షెల్లీదగ్గర సెలవు పుచ్చుకొన్నప్పుడు ఆమెఅనురాగము యొక్క ఆకారమై కన్పట్టెను. బ్రిస్టలునగరమునుండి షెల్లీకి ఆమె యొక్క లేఖ తిరిగి రానటువంటి యొకచోటునకు తా నేగుచున్నానని వ్రాసెను. షెల్లీ ఆలేఖ నందుకొని వెంటనే బ్రిస్టలునకు వెళ్లెను. ఆమె అప్పటికి స్వాన్సీపట్నము చేరుకొనెను. మరునాడు ఆమెయొక్క శవమే మిగిలెను. తనమీద మోహము అపుకొనలేక ఆమె బలవన్మరణము పొందెనని షెల్లీకి తెలిసింది. అతడు నిస్పృహు డయ్యెను. తనకు స్నేహితుడున్ను, మహోద్యాపకర్తయు నగు లే హంటు ఇంట కొంతమటుకు సేదతేరెను గాని, అంతకన్నను హెచ్చయిన విషాదవార్త యొకటి అతనికై వేచుకొనియుండెను. హారియటు మాయమైపోయెను. హాగుకహాము అను స్నేహితుని ఆమెను వెతికవలసినదని ప్రార్థించగా ఆస్నేహితుడు ఇట్లు జవాబు వ్రాసెను: "మిత్రమా! నీదగ్గరనుండి జాబు వచ్చి నెలదినములయినది. నేను జవాబివ్వలేదని నీవాశ్చర్యము చెందియుండవచ్చును. హారియటును, ఆమెబిడ్డలను గురించి కొంతభోగట్టా తెలిసికొంటిని. ఆమె—పాపము—మరణించెను. బలవన్మరణము చేసికొనెనట. ఆట్టివార్త మొదటను నే నమ్మలేదు. గతమంగళవారము నాడు సర్పెంటైనునదిలో ఆమెశవము దొరికినదట. పిల్లలు లండను నగరములో ఉన్నారట." మరునాడు టైమ్సుపత్రిక యందు, "గర్భవతియై ఆరువారములు అటుపర కగపడకయుండి, ఏదో మానసమునకు కార్యసంబంధమున రహస్యము కప్పిపుచ్చుటకై నదిలో పడి ఒకస్త్రీ బలవన్మరణము గాంచెను. ఆమెవ్రేలిని ఒక ఉంగరము గలదు" అని ప్రకటన పడినది.

హారియటు ఇట్లు విషాదాంతము గాంచుటకు హేతువులు, ఆపరిస్థితులు ప్రస్తుతము అనవసరము. ఆమెయొక్క బంధువులు ఆమెపిల్లల తమ యింటికి తీసుకపోయిరి.

దుఃఖనిమగ్నుడై షెల్లీ జరిగినదానికి తానెట్లు పూచీయని ధైర్యము తెచ్చికొనుచుండెను. తానామెను ఎన్నడును ఇబ్బందియైన పెట్టలేదే! తాను చేసినయావత్కార్యములు ఒప్పేయని ఎంచుకొనెను.

హోరియటు మరణించిన పదునైదు దినములలో, మేరీయు షెల్లీయు వివాహము శాస్త్రోక్తముగ చేసికొనిరి. తనయొక్క ప్రథమవివాహమువలన కలిగిన సంతానమును తనకు అప్పచెప్పవలెనని అతడు కోరెను. కాని ఛేన్సరీ కోర్టువారు వ్యతిరేకతీర్మానము చెప్పిరి. హోరియటు బంధువులు కాని, షెల్లీ కాని ఆపిల్లలపోషణకు పనికిరాదని వారిని వేరొక సైనికవైద్యునిపోషణక్రింద ఉంచ మనిరి. షెల్లీ నెల కొకసారి వారిని చూచుటకు అనుజ్ఞ యిచ్చిరి.

షెల్లీ జీవయాత్రయందు తిన్న దెబ్బలవలన క్రుంగ సాగెను. భావనాప్రపంచము- అందు గల దివ్యసౌధములు- కవిత్వరహస్యము దివ్యతేజము అన్నియు అతనికి వింతలై తోచెను. ప్రాపంచికకాఠిన్యము, జీవకాఠిన్యము, మానవకాఠిన్యము కన్నెదుర కట్టివట్టయ్యెను.

గ్రేటు మార్లో యను పట్నమున, షెల్లీ ఒకభవనము కొనెను. అందు తాను, ఇద్దరుపిల్లలు, బైరను ప్రభువునకు క్లేరాకు పుట్టిన ఏలిగ్రా యను ఒప్పులకుప్ప యగు పిల్లయు కలిసియుండిరి.

నదీతీరమందే హాయిగ కాలక్షేపము చేయుచుండెడివాడు. నదీప్రాంతముల నిరుపమానసౌందర్యముగల లోవల యందముల భావనాప్రపంచమందు పునర్నిర్మాణము గావించుకొనుచుండెను.

ఇట్లుండగా, చుట్టములు, స్నేహితులు, ఇంటికర్చును రోజురోజునకు ఎక్కువగుచుండెను. తాను, భార్య, మరదులు, వీరిపిల్లలు, లేహంటు, అతని భార్య అయిదుగురుపిల్లలు, ఒకొక్కప్పుడు మామగారి కుటుంబము. చెప్పనేల కర్చుమాట?

క్లేరాయున్ను, ఆమెచిన్నకూతురు ఏలిగ్రాయును తనయింట నుంట నగరమందు ఒకతప్పుగ అనుకొనుచుండిరి. ఏలిగ్రా షెల్లీకి పుట్టినదేయని అనుట ఆరంభించిరి. ఇదంతయు పడలేక, ఇటలీ పోదుమా యని షెల్లీ నిశ్చయించెను.

షెల్లీయొక్క జీవనము ఇటలీలో ఎట్లు వెళ్లినది హాయిగ వ్రాయనక్కరలేదు. క్లేరాయొక్కపిల్ల ఏలిగ్రా వెనిసులో చనిపోయెను. క్లేరాతో షెల్లీయు, భార్యయు రోమునగరమునకు పోయిరి. అక్కడనుండి నేపిల్సునకు వెళ్లిరి. అక్కడ షెల్లీ రెండవ కుమారుడు జబ్బుచేసి చనిపోయెను. ఫ్లారెన్సులో నుండగా మేరీకి మరియొక పిల్ల కలిగెను. ఆమెకు పెర్సీ ఫ్లారెన్సు అని నామకరణము చేసిరి. అక్కడుండగా ఎడ్వర్డు విలియం, అతని భార్య జాని, అతిలావణ్యసుందరాంగియు షెల్లీకి పరిచితులైరి. తనకు తెలియకుండనే షెల్లీ ఆ జానిపై మనసు నిలిపెను. అయితే చూపులతోనే ఆమోహబంధనము ఆగిపోయెను.

ఆరోజులలో ఎమీలియా యని యొక సుందరయువతిని షెల్లీ అక్కడ కాన్వెంటులో జూచెను. చూచుటే తడవుగ ఆమెపై మోహము నిల్పెను. ఆమెపై అత్యనురాగపూరితమైన పద్యము వ్రాయ నారంభించెను. షెల్లీ ఆమెను కలిసికోవలెనని మేరిని బాధింప నారంభించెను. మేరీకి ఇదంతయు తలనొప్పిగా నుండెను. అయితే షెల్లీయొక్క పద్యధార పూర్తికాక మునుపే, ఆ ఎమీలియా ఎవరితో ఒకనిని వివాహము చేసికొని షెల్లీయొక్క ఆశాబుద్బుదముల చెడగొట్టెను.

ఆసమయమున షెల్లీపైని వేరొక అపవా దుద్భవించెను. క్లేరాకు అతనికి ఒకశిశువు కల్గినట్లును, ఆశిశువు ఎక్కడనో ఉన్నట్లు ఒక అపవాదు. క్లేరాను, మేరీని అతను బాధించుచూయున్నట్లు ఇంకొక అపవాదు. పైవారలకింత మనఃక్షోభ్యము ఏలయని అతడు చింతించుచుండెను. రానురాను అపవాదులు అడుగంటెను.

తరువాత కొన్ని దినములకు పడవపై సముద్రమందు వెళ్లుచుండగ, తుపానువచ్చి అందు షెల్లీయున్ను, విలియమును చిక్కు వడి ప్రాణముల గోల్పోయిన సంగతి అందరికిని తెలియును.

---



౧. డాన్ అల్ ఫోన్జో-స్పేను రాజ్యభ్రష్టుడు
ఈతనికి మరల రాజ్యముచేపడుదునని యింకనుఆశింపవచ్చును.



౨. మనోయలు-పోర్చుగలు ప్రాతరాజు
ఈత డొక ఆంగ్లసంస్థ యైపోయినాడు.



3. గ్రీసు రాజ్యభ్రష్టుడు జార్జి
ఖిలాడీ, పహిల్వా, షకీన్, చిదానందపురుషుడు,



౪. బల్గేరియా ప్రాతప్రభువు ఫెర్డినాండు
నిశితమతియైన రాజ్యతంత్రజ్ఞుడు;
ఈయన అందన ఒక్కసారిమాత్రమే తప్పినదట.



౫. బవేరియా దేశపు రుప్ ప్రెఖ్టు
ఎన్నికగన్న సేనాని. కళా విమర్శకుడు.



౬. ప్రాత కెయిజరు, అతని క్రొత్తభార్య
ఈ రెండవభార్యవలన అతనికి అయిదుగురు పిల్లలు
ప్రాప్తించినారు.



౭. జిటా, ఆటో
ఈ ఆస్ట్రియాదేశపు భూతపూర్వ సమ్రాజ్ఞి.
రాజ్యభ్రష్టు లందరిలోను అభిజాత్యదర్పసంపన్నురాలు.
ఆటో హాన్గరీదేశపు రాజనియే వ్యవహారము.



౮. అఫ్గాను ప్రవాసితులు
అమానుల్లాయు, ముసుగు త్రోసిన అతని పత్ని
సౌరియాయును ఐరోపీయవేషముల
దర్శన మిచ్చుచున్నారు.

# రాజ్యభ్రష్టులు

పోర్చుగలు ప్రభువు 'మనోఅల్', గ్రీసు ప్రభువు 'జార్జి', బల్గేరియా ప్రభువు 'ఫెర్డినాండ్', ఆస్ట్రియా ప్రభువు 'జిటా', హంగరీ ప్రభువు 'ఆటో', జెర్మనీ ప్రభువు 'విల్హెల్మ్', అఫగానిస్తాను ప్రభువు 'అమానుల్లా', హెడ్జాజ్ ప్రభువు 'హుస్సేన్' — అను వీరికి తోడు, రుమేనియా ప్రభువు 'కారోల్' పీడి పోయిన లోటు లేకుండ, స్పేన్ ప్రభువు 'అల్ఫోన్జో' చేరినాడు.

రుమేనియా ప్రభువు కారోలు తిరిగ సింహాసనము బడయుటచే ఈ నిండైన మకుటవర్జితరాజకులమున రిక్తమైన స్థానముఅబక్కపలుచని పొడవరి, స్పేను ప్రభువు, పదుమూడవ అల్ఫోన్జో పుణ్యమా యని నిండినది (ఈ పదుమూడన్న అంకెలో కీడేమియు లేదని యింకను కొందఱు అనుమానే యున్నారు!).

ఇది ఒక వింతరకము కుటుంబము. ఇందు అన్ని ఆకృతులు, అన్ని పరిమాణములు, అన్ని ఛాయలు కలవు, —వేదాంతములో మునిగోను చైనీయయువకుడు మొదలు, నుసకవైఖరిలో చియ్యబట్టిన అఫగానీయుని వీరుగా, మనసులో మఱుగువాఱు హంగరీవనితవఱకు, చిఱునగవులో బూరిబుగ్గలు మెఱుగువారు బుడతకీచుని వఱకు పరగినవి విన్నిచిన్నెలు.

ఏసాంత్వన మెఱుగక, తనరాచగుండెను కొటికి వైచు జెంగయందే మునిగి కూర్చుండ దీరాచకోవ. మాటవరుసకు, అల్ఫోన్జోను తీసికొందము: అతడు ఏగాలి కాచాప రెయిత్తెడు పైజము గలవాడు; మనసు సరిపెట్టుకొగలవాడు. క్షౌరమును మొట్టమొదటి రాజకీయ పరాజయమును దాటిన యీతడు అంత కుందువడియుండక, చీకుచింతలు లేక యేవో వ్యాసృత్తులు పెట్టుకొని కాలక్షేపము చేసికొను జమీందారునివలె ఇంగ్లండున కుదురుకొన్నాడు. ఇంగ్లండు ఆతని బంధువను బుడతకీచున కాశ్రయ మిచ్చుచునేయున్నది. నిజమున కీదేశము మకుటము లాడిన ప్రభువులకు పరంపరాగత మగు ఆశ్రయసీమగా నున్నది.

మఱియు నాతడు తనప్రభుత్వమునకు చెందిన విషయములనే కాక, జీవితమున నింకను ఇతరము లగు ఆసలు మనసుపడి పెంచుకొన్నాడు. ఇంగ్లండునందును, ఫ్రాన్సునందును వ్యాయామప్రియులగు సంపన్నులు పెక్కుర నాతడు చనవుచేసికొన్నాడు. వేట, చేపలు పట్టుట, పోలోఆట, మోటారునడుపుట, బాండువాద్యము మున్నగువానియం దాతడు నేర్పరి.

చమత్కారసంభాషణ మన్నను, యుక్తము లగు చిన్నచిన్న విందు లన్నను ఆతని కిష్టము: ఈ రెండును కొరకుతావు లేవో అరడజను రాజధానులం దాతని కెఱుకయే; త్వరలో ఈసంఖ్య పెరుగవచ్చును. పశుపాలనము, వ్యవసాయము, గుఱ్ఱములు, ఇప్పుడు తీరుబడి కావున చూడగల కొన్ని యితరవిషయములు, ఆంగ్లదేశపు పల్లెసీమల యింపైన వాతావరణము, ఇట్టివానియం దాతనికి మెండగు తాత్పర్యము.

అల్ఫోన్జోకు ఇతరులగు రాజ్యభ్రష్టులు సాహచర్యమునకు కావలయునో, ఇంగ్లండున సిద్ధముగ నుండనే యున్నారు, పోర్చుగలు ప్రాతరాజు మనోఅలు, అందక త్తెయగు నాతనిరాణియు, గ్రీసుదేశపు ప్రాతరాజు జార్జియును. కాపురము వచ్చిన యిరువదియేండ్లలోను మనోఅలు ఆంగ్లసంఘచిత్రమున సుభువుగ హత్తుకొన్నాడు. తేమ్సునది సమీపమున ట్వికెన్‌హాముకడ అతి విశాలమగు మైదానమున ఈతని కొక కన్నుల పండువగు సౌధ మున్నది. ఈతడును, ఈతని భార్యయుగూడ

కెన్నిసుఆటకు వాడుకపడిపోయినారు; పెద్దబ్రతుకులు బ్రతుకువారిలో ఏక్లబ్బును, ఏప్రైవేటు కెన్నిసుపార్టీయును వారు లేక పూర్తికాదు. ఇక వింబిల్డనుపందెములందు ఈతడు టిల్డెనువలెను, హెలెన్‌విల్సువలెను అతిపరిచితమైన వ్యక్తి.

పెద్దపెద్ద విందులు, తీర్థములు, పెద్దరకము ఆహారశాలలు, నాటకశాలలు, వేటలు, మున్నగువిలాసములకు పోవక, వారు సంసారపక్షమైన పూర్వోత్తరపు ఇంగ్లీషు దొరలవలె కాలక్షేపము చేయుదురు. ఎప్పుడైన జార్జి చక్రవర్తితోడను, మేరీమహారాజ్ఞితోడను విందు గుడుతురు. అప్పుడపుడు తామే యొక సామాన్యమగు విందు సలుపుదురు.

ఎటులయిన, ప్రవాసము మనోబలము క్రుంగదీసినట్టున్నది. లిజ్బనునగరమున ఒకరహస్యసంఘము రాజ్యాంగసంస్థల ప్రవేశించి, వానికి వేరుపురుగైనది; తన గూఢచారులను రాచనగరులందు సహా పరిచారకులగా చొనిపినది; 1910సం.రపు విప్లవము లేవదీసినది. ఈసంఘమువారు ఒక నిరాపనిందయు మనోబలముపై మోపినారు; అదియు అతనిపతనమునకు కారణము కాకిపోలేదు.

గ్రీసుప్రభువు జార్జి ఇంతకంటె చాల కుఱ్ఱవాడు. 1923 మొదలితడు ప్రవాస మనుభవించుచున్నాడు. ఇతడుమాత్రము లండను, పారిసునగరముల విలాసజీవనము నెడ మక్కువగలవాడు. లండనునందు తఱుచుగ పేరైన ఆహారశాలలకును, నృత్యప్రదేశములకును యాత్రలు కొట్టుచుండును. 'చారిటీ బాల్సు' అని జరుగు విందులందు ఈతనిదర్శనము చాలగ దొరకును. ఆ విందులలో ఏడాదికొక్కమారైన తాము జరుపకున్న పరువు తక్కువయని భావించు యువతీమణులు అవయవసౌష్ఠవముతోడి ఆంగ్లయువకునివలె కానవచ్చు ఈ రాచబిడ్డ తమఉత్సవముల కొక నిండైనకళయని భావించి ముచ్చటలు సలుపుచుందురు. ఈతడు రుమేనియాదేశపు మేరీమహారాణి యల్లుడు.

ఈత డింకను ఇంగ్లండునందు లోగిలి సంపాదింపలేదు. ఒకకారణము కావచ్చును: గ్రీసుదేశపు రాజకీయప్రవాహమున ఏ మలకో వచ్చి, తా నంతకొలదిలో విడవలసివచ్చిన గద్దెకు ఏక్షణమున తన్నాహ్వానించిన నాహ్వానింపరాదటనుచు ఈతనికి గట్టివిశ్వాసము. నూతనరాజ్యాంగమునుండి ఉచితవేతనమును నిరాకరించి తన కొలదిసొంతరాబడిపయినే ఆధారపడి యుండురాజ్యభ్రష్టునికి బ్రిటనుదేశపుసన్ను ఎట్లు కిట్టును గనుక? ఈతడు కొంతసంస్కృతి గలవాడు.

ప్రాకారముతోడి తనఅందమైన భవనమున, పూలతోటల నడుమ, తెల్లనిగడ్డముతో, కొట్టవచ్చినట్టు కన్పడు నిడుపైనముక్కుతో, బల్గేరియాదేశపు వృద్ధ ప్రభువు ప్రశాంతముగ వసియించుచుండును. టర్కీదేశపు అబ్దుల్ (Abdul the Damned of Turkey) అను ఆయన నిష్క్రమించినవెనుక ఈయనయే ఐరోపాఖండమునకెల్ల నిశితబుద్ధిగల తంత్రజ్ఞుడు.

తనరాజ్యమున సంపూర్ణప్రాభవము నెఱపుచు నాతడు తనగూడు నింపుకొనెను. ఆతడు పలాయితుడగునపుడు తనవెంట దాదాపు 1,00,00,000 పౌనుల విలువగల సొత్తు కొనిపోయినట్టు లిప్పటికి వచించుచుందురు. కాని అతడు చాల మితముగా భోగించును; ఊరక యేదియు వ్యయింపడు; తనవెనుక గద్దెకు వచ్చిన యువకునికి రాజఠీకపు హోదా నిలుపుకొనుటకు సాలీనా 7,000 పౌనులకంటె గతి లేకున్నదని తెలిసి యేమియు సాయముసేయ నొల్లడాయెనట. ఆతనియెడ నెప్పుడు నొకవిధమగు పిచ్చికళలు కన్పడుచువచ్చెను. ఈనడుమ కొలదిమాసములుమాత్రము ఆతని కళలను గూర్చిన క్రొత్తకథ యేమియు రాకుండ గడచినవి. ఒకప్పు డాతనికి పూర్తిగనే పిచ్చియెత్తినదట కూడ.

'విట్టెల్సుబాచ్' కులస్వామియైన 'రుప్రెష్ట్' అనువానినిని బవేరియాదేశపు కృషికులును, అతని అనుచరులును ఆదేశపురాజైనవాడనియు, నిరాజకస్వామ్య (రిపబ్లికు) రోగము కుదిరినవెనుక జెర్మనీదేశమునకు చక్రవర్తి కాగలుగువాడనియు పరిగణింతురు. ఆతడు తన మేనత్తయగు బవేరియా యువరాజ్ఞి 'అర్నుల్ఫ్'తోడను, తనపిల్లలతోడను 'బెర్క్టిస్ గేడెన్' అనుచోట

తన దుర్గమున వసించును. అతడు ఎత్తరి. పాపిడి విడిగిన నరసిన వెండ్రుకలతో, నరసిన మీసకట్టుతో చక్కనివాఁడాతడు. అతనికండ్లు తీక్ష్ణమైనవి; అతని మనసు చులుకైనది. ఐరోపాపరిస్థితుల గూర్చి కొన్ని భావములుగల వాఁతనికి; అప్పటప్పట వినవచ్చినవారికిని, ముద్రింపవచ్చినవారికినిగాను, అతడవి పటిష్ఠముగ ప్రతిపాదించుచుండును.

అతడు గడుసరి. యుద్ధవేషములను వర్జించి నాగరకవేషమునే తాల్చును. తానే న్యాయ్యముగ రాజనని చెప్పుకొనుటకు మాఱు, రెండుడజనుల జెర్మనుసింహాసనములను దొర్లించివచ్చినవిప్లవసమయమున నున్న పేర, తాను 'యువరాజ' (Crown Prince) ననియే చెప్పుకొనును. గణరాజ్యధర్మము చేపట్టిన (federalised) జెర్మనీవిషయమున కాకున్నను, బవేరియాయందు కాలక్రమమున పునస్సంక్రామణము (రాజును తిరిగి సింహాసనమునఁ బెట్టుట — restoration) జరుగకపోవదని యాతని కొకవిధమగు విశ్వాస మున్నది.

అధిరాజస్వామ్యము (monarchy) పక్షమున వాతనిగట్టివాద మేమనగా: రాజకీయధర్మి (politician) రాబోవు ఎన్నికనుగూర్చి తలపోయును; రాజ్యాంగధర్మియో (statesman) రాబోవు పురుషాంతరమును గూర్చి తలపోయును; రాజకీయధర్ములు నడపు విరాజకస్వామ్యము (republic) కంటె, అధిరాజస్వామ్యము ఎక్కువ రాజ్యాంగధర్మపరముగా నుండగలదు; ఈ కారణముచే ఐరోపాకు మరల అధిరాజులు కావలయును—అని.

పెద్దకైయిజరు తనకొడుకులు, ముఖ్యముగ బుల్లివిల్లీ (Little Willie), తనకంటె నెక్కువ స్వేచ్ఛగా తిరుగగల్గుటకు కొంత మచ్చరముతో నుండకమానడు. విల్లీ విప్లవపు మొట్టమొదటి యుబ్బున తనతండ్రియంతటి గర్వితుడయ్యె, ఇపుడు బెర్లిను నగరమున విచ్చలవిడిగ తిరుగుచు, సైలీషియాయందు తనకోటలో తనభార్యతోడను, సంతానము మువ్వురితోడను, అంగరక్షకులు లేకుండ, హాయిగ నివసించుచున్నాడు మఱి.

విల్హెల్ము (పెద్దకైయిజరు) 'డూర్న్' అను (హాలెండుదేశపు) గ్రామమున ప్రష్యా ఆస్థానపు ఆచారములు యథావిధిగ పాటించును. అవమానమునకు, తలవంపులకు పాల్పడినవాడై, తనకు తోడుగ నుండ రెండవ భార్యను చేపట్టక ప్రవాసఖేదముల తాళుకోజాలకపోయె నతడు. తన ఉదాత్త మగు స్వధనమున కొంతవఱకు — జెర్మను న్యాయస్థానముల కెక్కకుండ కాకపోయిన పోయె—కాపాడుకొనగలిగినాడు; అతని భార్యతాలూకు సైలీషియాదేశపు జమీలపై వచ్చురాబడులు వేన్నీళ్లకు చన్నీళ్లు తోడుగ, సొంతరాబడి అతనికి దారిద్ర్యబాధ లేకుండ రక్షించినది.

ఈతని కెట్లు తోచునో!—అంత అస్తిమిత మైన చులుకజనముతో నుండెడువాడు; భవనము లేమి, కోట లేమి, యిరువదింటి నడుమ మహావైభవముతో బ్రదికినవాడు; ప్రతిదానితోను జోక్యము పెట్టుకొనుచు, ప్రతిదానియందును చేతులు కాల్చుకొనుచుండువాడు;—అట్టిది, తన యిరువదియొకగదులపాలాన, పాతికగదుల భవంతిలో,—కాకున్న పైగా ఒకపావురాయిల్లు, సొంతదేవళ మున్నవి,—ఎట్లు కాలక్షేపము చేయుచున్నాడు?

అతడు తనచిన్నక్రీడావనమున తిరుగును. చదువుకొనును. తనకోసమై కూర్చి పంపిన పత్రికాశకలములు తుణ్ణముగ పఠించును. 'ప్రష్యారాజ్ఞి'తోను, ఎడనెడ వచ్చెడు తనరాచటీకపు టతిథులతోను, తనశాశ్వతోద్యోగులగు అశ్వశాలాధ్యక్షుఁడు లిద్దఱితోను [పశ్చిమమున అశ్వశాలాధ్యక్షులు రాజసభలో చొరవగా ప్రవర్తింపగలరు] ఆయింతసేపు కూర్చుండి స్వేష్టకృత్తుగా సారగించుచు. తనభార్యసంతానము—అతని రెండవభార్య ఐదుగురు పిల్లలతో వచ్చినదిలే— పంతులమ్మయొద్ద చదువుకొనుచుండ చూడ నేగుచుండు నతడు. ప్రత్యేక మెంకబల్లకడ, వైద్యునిసలహా చొప్పున చాలవఱకు నిలిచియే, వ్రాసికొనును. మొత్త పెరుగకుండుటకుగా నొక వ్యాయామము—చెట్లు పడగొట్టి అంపాన గోయుచుండును. అతనిజుట్టును, గడ్డమును ఇపుడు తెల్లబడిపోయినవి.

పైచాయ బాగుండును. కాని మనిషిలో మాత్రము ముదిమి, నలుగుడు బాగుగ కన్పించును. ఆ నీడలుగట్టి దించుకపోయిన కండ్లు మాచిన దర్పపరాభవములు పెన గొనుచు పొడగట్టును.

రాజ్యభ్రష్టులైనవారందఱిలోను రాజ్యము వీడి వచ్చినది మొదలు ఆశ్రయస్థానమును వీడుటకు సాహసిం పని దీత డొక్కడే.

ప్రాచెన్సదేశపు నునువెచ్చని మైదానమున ఒక చిన్నభవనమున వసింతురు ఒకప్పుడు రాణియయిన ఒక శాంతచిత్తయగు వనితయు, ఇప్పటికిని అతనిదే రాజ్యార్హతయని కొలదిమంది పాక్షికులు చాటుచుండు నొక బాలుడును. ఆమె మాన్టినిగ్రో దేశపు మహారాజ్ఞి. ఈ మాన్టినిగ్రో చిన్నరాజ్యము. యుద్ధానంతరము పారిసు సంధికర్తలు దీనిని సెర్బుల (సెర్వియా దేశమువారి) యొక్కయు, క్రోటులయొక్కయు, స్లువెనుల యొక్కయు రాజ్యమున (యుగోస్లావియా) చేర్చిరి.

కాని ప్రత్యేకపక్ష మొకటి నిలిచిపోయినది, రాజరికమును మరల స్థాపించి హక్కుదారుడగు రాజును పాలింపవలయు ననువాళ్లతో ఆపక్షమువారు అప్ప టప్పట పత్రికలను, విదేశాంగకార్యాలయములను బారు పెట్టి వైచురు. ఒకప్పు డనుకొన్నారు, ఇటలీదేశ మేమైన బొమురోను నేమోయని; ఏమంటే, ఇటలీరాణి మాన్టినిగ్రోయింటి ఆడుబడుచు; మఱి ముసోలినీ అడ్రి యాటిక్ సముద్రము దాటగనే తన యిరుగుదేశమైన దానికి నడుము విఱుచుటన్న మార్గముగను పెట్టబోవడు గా యని. కాని నేటివఱ కాకోననుండి యేమియు జరుగ రాలేదు. రాజమాతయు నేమంత గందరగోళము చేయ వలెనని లేదు; బెల్గ్రేడు ప్రభుత్వమునుండి యామె పింఛను స్వీకరించినది; తనకు, 'రాజు' నకు, అతని చిన్ని తమ్ములకు కథ నడుచుటకు ఆధారతనముసే క్రియకు నమ్ముకున్న దన్నమాట.

అస్ట్రియా దేశపు ప్రాతరాణి 'జిటా' ఇంత నిస్సహాయస్థితియందు బ్రుంగుడుపడి యిఱుకువడుట లేదు. కాని యామె మితముగా గడపుకొనవలెను. తన కొడుకు ఆర్చ్‌డ్యూక్ 'ఆటో'ను హంగరీదేశపు భావి రాజుగను, — అస్ట్రియాదేశమున 'సీపల్' గారియు, ఆయన అనుచరులయు యత్నములు, స్వప్నములు ఎప్పటికైన కొనసాగిన,—ఉత్తమశ్రేణికి జెందు ప్రాభవముగల ఒక 'డాన్యూబునగరరాజ్యము' (a Danubian federation of States) నకు కాలక్రమమున చక్రవర్తిగను కాదగువానిగా చేసికొనవలెనుగదా!

హంగరీ రాజ్యార్హుడగు ఆబాలుడు సన్ననివాడు, విద్యార్థిదశయం దున్నాడు. ఫ్రెంచివారివలె దుస్తులు దాల్చును. హాబ్స్‌బర్గ్ వంశమునకు పుట్టువుది అతాకిరణ మాతడే. అతనితల్లి ఒక దారుణవ్యక్తి. ఆమె తనభర్త బ్రదికియున్నప్పు డాతనిపై ఆజ్ఞ చలాయించెడిది. అతని తో ఆమె చాల గడ్డురోజులు గడపినది. వియెన్నా, బుడపెస్టు నగరములందు ప్రభుత్వము కూలిపోవుచుండ, రాజభక్తిగల పుట్టువుదిదళములును తమ్ము వీడిపోవ, తుదకు తమ అంతిపురములకునహా కావలి లేకపోవగా, ఆమె అతనితో పాఱిపోయి డాన్యూబు మైదానమందలి వేటయింటిలో పడినది [వేటాడబోయినపుడు మకాము చేయు ఇల్లు వేటయిల్లు].

సామ్రాజ్యమంతయు కండ్లయెదుట బ్రద్దలయి పోవుచుండ రాజ్యపరిత్యాగమున కడ్డుపెట్టిన దామె. 'నేను మీతోపా టిక్కడనే మడిసెదను. పోనీ,ఆటో రాజ్యమునకు వచ్చును. అందఱమును కూలిన—ఇంకను ఉన్నారు హాబ్స్‌బర్గ్ వంశమువారు' అని ఆమె తనభర్త కార్లుతో పలికిన పల్కు లోకరు విని వ్రాసిపెట్టినారు.

చివరకు, నీతి మర్యాదలు దాటరాదుగదాయని నచ్చజెప్పినమీదట ఆమె కార్లును సంతకము చేయనిచ్చి నది; జెండాలు మాఱుట చూచినది.

దంపతులు కుమారునితో ఇటలీమకాము చేరిరి. కాని తొందరమనిషియగు కార్లు ఎవ్వరో సింహాసనమున కాసగొలుపుటచే, రెండుసార్లు తిరిగి యేగెను. రెండు సార్లును భంగపడెను. కార్లు చనిపోయెను. జిటాను మొదట ఒకలోగిటను, పిదప ఒకమఠమునను ఖైదీగా నుంచిరి. పిదప నామెకు ప్రవాసము వేసిరి.

ఆమె స్విట్జర్లాండులో నందునమని పోయినది. ఆమెకు చాల నిక్కచ్చి వచ్చినది. పోపు [ప్రధానమతాచార్యులు]గారి ప్రభుత్వము తెరవెనుకనుండి నాటకము నడపినది; ఆమెను పిల్లలతో పారిసునగరము వెళ్లనిచ్చిరి; ఐరోపాయందలి యితర రాజాస్థానములకు జోలి వెళ్లినది: మఱి,పాపము, చేత ఒక్కకానియన్న కాని లేదు ఆ నిర్భాగ్యకుటుంబమునకు. జిటా ఒక చరిత్రప్రసిద్ధమైన 'ఫ్లారెన్సు' వజ్రమును అమ్మకొనెంచినది. కాని 'సేంటు జెర్మను' సంధి ననుసరించి ఆస్ట్రియా దేశము కొన్ని ఆస్థానపురత్నములను తనకు ఇచ్చుకోవలసియున్న దని ఇటలీ అడ్డుపడినది.

జిటా కింక గతి లేదన్న మాటయే. కాని యీ బెదరింపు హంగరీ ప్రభుత్వముపై కొంత పనిచేసినది: ఆ ప్రభుత్వమువారు హంగరీయందలివి ఆమె తొలూకు జప్తుపడిన జమీలమీద ఆమెకు కొంత రాబడి వదలిరి. ఆమె ఇంగ్లండునందు స్థిరపడుద మనుకున్నది. కాని ఆమె కాశ్రయ మిచ్చుటకు ఇంగ్లండు ఒప్పుకోలేదు. కావున అల్ఫాన్సుమహారాజు ఆమె 'లాకేను'కడ స్థిరపడుట కనుమతించినాడు. ఆమె యిప్పు డక్కడనే యున్నది: ఎప్పుడో హంగరీప్రజలు హాబ్సుబర్గ్ వంశము వానిని రాజుగా చేయగోరి, తనకొడుకును 'ఆటో'ను అదుగో ఆ సేంటు స్టీవెను బంగరుకిరీటముక్రింది ప్రాచ్య రాజభవనమున నభిషిక్తుని చేయగలరోయను కెదురుచూచును పుచ్చుచున్నది.

రాజులేని రాజ్యము హంగరీ ఏ విరాజకరాష్ట్రమో (republic) కాగోరుట సంభవము; లేదా, వేఱొకయింటివానిని రాజును చేసికోవచ్చు. జిటామాత్ర మట్టి దేమియు జరుగదనియే ఆశతోడను, ఉత్కంఠతోడను మెలగుచున్నది.

తమరాజ్యమున గగ్గోలు లేచి, నాదిర్‌షా ప్రభుత్వము వహించిన పిమ్మట అమానుల్లాయును, పరదాపీడిన ఆతనిపత్ని సౌరియాయును ఇటలీదేశము చేరుకొనిరి. ఎంతయు మనసు విఱిగి, విధివిలాసముల తలపోయుచు కూరుచుండిన అమానుల్లాకు రష్యాప్రభుత్వము (Kremlin) కావించిన వ్యాఖ్యానము ఒంటపట్టినది: అది యేమనగా, ఈవిప్లవమునకు బ్రిటిషువారికుట్రలు మూలకారణము లని; అతంత్రవేత్తలగు గాఢసామ్రాజ్యవాదులకు అఫ్‌గానిస్తానము దుర్బలమై, జర్జరమై యుండుట యిష్టమగును గాని, అధునికములగు ఆయుధములతోడను, విజ్ఞానముతోడను విలసిల్లుచు, శక్తిమంతమై ఐకమత్యము గల ఆసియాజాతిగ వెలయుచు, భారతదేశమునకు వాయవ్యప్రాంతమున తిష్ఠవై చికొనియుండుట కిట్టునా? —అని.

ఆతని కిట్టిభావము లుండుటవలననే, అధికారవేళ వాతని నంత గౌరవించినవారయ్యు,అవసరము వచ్చునరికి ఆహ్వానించుటకు బ్రిటిషువారికి నోరు వచ్చినది కాదు.

ఏమైన నేమి? ఇటలీ అమానుల్లావంటివానికి సరిపడుచోటు కాదు; త్వరలో ఆతడు 'స్మర్నా'కు ఎత్తికట్టినాడు. ఇప్పు డాతడు తనప్రాతరాజ్యము పొలిమేరలందు, అక్కడి సంపులవాండ్రను లేవగొట్టి వేతనముమీద తనకు సాయముగ చేకొని, రాజ్యము తిరిగి సంపాదించు నెత్తుపై తిరుగుచున్నాడని ఇటీవల పశ్చిమము చేరినవార్తలు.

'ఇబ్న్‌సాఉద్' తొలూకు 'వహాబీ' నీచజాతులవారు తనరాజ్యముపై ఉప్పెనగా విఱుచుకపడ్డప్పుడు, 1925 సం. న రాజ్యపరిత్యాగము గావించిన 'హెడ్జాజు' ప్రభువు 'హుస్సేన్ ఇబ్న్ అలీ' తనదుర్భాగ్యమును వేదాంతివలె సహించినాడు.

ఈతడు అరబ్బీచరిత్రయం దాద్యచారిత్రిక పురుషులైనవారి వరుససంతతివాడు. ఈతని రాజ్యము చూచిన, ఎఱ్ఱసముద్రమునకును పారసీకదేశమునకును నడుమ క్రుక్కుకొనియున్నది; 'అరబ్బీరాత్రుల' కథలయందు చెప్పిన తరువాయిగ, నమ్మరానంత బంగారుసొత్తు. తానేమో హెడ్జాజుకు రాజు; ఒకకొడుకు ఇరాకుదేశము పాలించినాడు; ఇంకొకడు ట్రాన్స్‌జార్డనియా పాలించినాడు.

ఆతడు దుర్జయుడై, యుద్ధమున దక్షిణపార్శ్వము కాచినవాడగుటచే గర్వితుడై యుండెను; భారతమునకును, తూర్పుభూములకును జలస్థలమార్గముల కెంటికిని రాహదారీయను పట్టయిన అచ్చోట హూస్సేనుకుటుంబమువారు బ్రిటిషువారి కనుకూలురై కూరుచుండుట మంచిదని యెంచిన బ్రిటనుసామ్రాజ్యవిక్రమము అతనికి బాపట.

అంతట అవతరించినాడు ఇబ్న్ సాఉదు, ఎడారి విడిచి; బ్రిటను ఎవరికి ఓపిక యున్నవారిని నెగ్గకోనిమ్మన్నది. ఆవృద్ధహూరుడు పవిత్రశత్రులధాటి తప్పించుకొని యెఱ్ఱసముద్రము చేరవలసివచ్చినది. గ్రుడ్డిలో మెల్ల, అదృష్టవశాత్తు కుటుంబాస్తి ప్రధానముగ బంగారము, నగలు అగుటచే దాదాపు ముప్పదిలక్షలకాసులు(పౌనులు) వేసుకపోయినాడు. ఒక బ్రిటిషుయుద్ధనౌక అతనిని, అతనిసొత్తును 'సైప్రసు' ద్వీపము చేర్చినది. ధ్యానము చేసికొనుచు, నిపుణుడుపిచదరంగమో ఆడుకొనుచు పైకి తృప్తి కనబఱుచుచు అత డిపు డక్కడనే సుఖముగా కాలక్షేపము చేయుచున్నాడు.

* * * *

కాని ఒకచిత్రము : ఇంతింతరాజ్యములు పోయినవారు, ఆరాచకార్యములు, ఆసలుసుకు అంతయు వదలి, ఇదే బాగున్నది, తెలిపినిబద్ధామని సరిపెట్టుకోదగిన విషయమా యిది? రాజ్యము లేలుటకు పుట్టి పెరిగిన రాచబిడ్డలకు, బ్రదుకా అధికారమా యని ఆడిన ఆట మీదట, యుక్తిపైని, నోసటివ్రాతపైని నడచు ఆటలన్న చాల పేలవముగ తోపక మానవు. ఈ రాజులు వట్టి 'ఇస్పేటురాజులు' కారు మఱి, తమ ధర్మవిధు లెఱిగిన పరిపాలకు లైరి.

[‘స్పియరు’ పత్రికయందు సి. పాట్రిక్ తాంప్సనుగారు వ్రాసిన వ్యాసమునుండి.]

---

## బౌద్ధ తేజస్సు

శ్రీ. శ్రీనివాసరావుగారు

౧

ప్రాంతరాకాశమున పరంజ్యోతి యొకటి
వేనవేలు దీధితు లీని వెల్గిపోయె;
ఆర్పరాని ఆతేజోదవానలమ్ము
కౌముదీ శీతలము, దెసల్ కారు కొనియె;

౨

అది మహాంభోనిధానమైనది, తరంగ
నాట్యములలో ప్రశాంతి విన్నాణమొలికె:
దాన సంభూతమైన రత్నత్రయమ్ము
నేరుకున్నారు ముగ్ధమహీజనాలు.

౩

ఒక్క కరుణార్ద్రి నయనకవోష్ణధార
గగననది కెరటాలు లుడుకక దహించు:
ఒక్కఎద ప్రేమచే మ్రోయునో, చరాచ
రాత్మకము విశ్వహృదిమె విహ్వలతకాంచు.

౪

ఆహృదంతిక మానయనాశ్రువృష్టి
సృష్టినుండి ప్రతిధ్వనుల్ చేదికానిమె!
ప్రాణులు విముక్తికాంచు నిర్వాణపదవి
జగ మెరింగెను "బౌద్ధతేజస్సు" వలన!

---

# ప్రాచీనగృహనిర్మాణము

ఏ. వి. రత్నముగారు

హిందూ దేశచరిత్ర పఠనగ్రంథములందు ప్రాచీన ప్రాకారగోపుర దేవాలయాదిపటములు లభించును గాని, ప్రాచీనగ్రామజీవనమును, గృహములను గనబరుచు చిత్రము లెవ్వియు గానరావు. ఇట్టివి యూరోపీయ దేశచరిత్రములందు గాంతుము. చరిత్రప్రసిద్ధము లగు నయోధ్య, పాటలీపుత్రము, ఉజ్జయిని, కన్యాకుబ్జము మున్నగు పురములవర్ణనను బట్టి సామాన్యగృహనిర్మాణ పద్ధతి యెట్లుండెడిదియు నిర్ణయింపజాలము. గ్రామపట్టణ గృహనిర్మాణవిషయములను గురించి శిల్పసూత్రము లందును, వాస్తుశాస్త్రమునందును నేమి చెప్పబడి యున్నదో తత్పరిచయము నాకు లేశము కలుగమి, పూర్వ కాలమున గృహనిర్మాణపద్ధతి యెట్లుండెడిది చెప్ప జాలను. అయినను భారతీయనాగరకత సాంప్రదాయ పరంపరానుగతమై పూర్వాచారమును సన్మానించినచ్చు చున్నది గాన, ఇప్పటికి నందందు గన్పట్టు పురాతన గ్రామగృహముల నిర్మాణపద్ధతులను బరీక్షించినచో కొన్ని గమనీయాంశములను నేర్చుకొందుము.

ప్రాచీనార్యసర్యులు ప్రకృతి నారాధించుచు, ప్రకృతితో గలసిమెలసి ప్రకృతిప్రతిబోధితులగుటం జేసి, నిరాడంబరమును, నైసర్గికమనోహరమును, ధర్మయుత మును నగు నొక గొప్పదయిన జీవితదృష్టిని గృహనిర్మాణ మునందును, గృహస్థజీవనమునందును బ్రసరింపజేసి యుండుట గాననగును. అది క్రమేణ నాగరికము బలిసిన కొలది నగరములందు లోపించుటయు, జనపదములందు నిలిచియుండుటయు గూడ గాననగును. ఆ ప్రాచీన ధర్మము, ప్రాచీనదృష్టి దేవాలయాదిగృహనిర్మాణమునం దెట్లు వ్యక్తమయినదియు నొకింత విచారించుట, మార్పు చెందుచున్న యిక్కాలమున కప్రస్తుతము కాదని యెంచెదను.

దేవాలయములనుగాని, మనుష్యులు కాపురము చేయు గృహములుగాని, సత్రములనుగాని కట్టుటయందు ప్రాచీను లొకేదృష్టిని ప్రయోగించి రన్నచో మొదట వింతగ నుండకపోదు. దేవగృహములకును మనుజగృహ ములకును పోలి కేమి గలదని వెంటనే ప్రశ్న రావచ్చును గాని అది రూపసామ్యమునందు లేదు. ఆదృష్టి కితో స్థానపరిస్థితులను, కట్టడముల ప్రయోజనమును, ఆరోగ్య లాభములను గమనించి నిర్మాణక్రమము నెట్లాక్రమించి నది చూడవలెను.

ముందు దేవాలయ నిర్మాణ విధానమును గనుగొం దము. వైదికయుగము నాటి యార్యులకు విగ్రహారాధ నము లేదు.* వారికి "దేవతార్చన" విధి లేదు. వా రన్య మతస్థులవలె నొక దేవాలయమున గుమిగూడి బిగ్గరగ దైవప్రార్థనము చేయువారు గారు. వారికి గుడిలోపల నుండవలసిన పని లేదు. వారు తపస్స్వాధ్యాయజప హోమతత్పరులు. ఇట్టివారిమధ్య విగ్రహారాధన మొక నూతనసంప్రదాయము వెలసినది. ఈనూతన సంప్రదా యమున, పూజావిధానమున, అగ్నిముఖమున హవిర్భాగ ములు గొను నింద్రాదిదేవత లంతరించి రాతిబొమ్మలందు మూర్తీభవించు క్రొత్తదేవత లవతరించిరి. కావున నీ రాతిదేవుళ్ల కెటువంటియిండ్లను గట్టవలెను? వాని ప్రయో జన మేమి? ఎవ్విధమున వానిని నిర్మింపవలెను? ఈరాతి దేవుళ్లు చైతన్యరహితములుగాన, వెలుతురు వాయువు

---

* ఇందుకు వైదికవాఙ్మయమే బలమయిన సాక్ష్యము. వైదికదేవతలగు నింద్రాగ్ని యమవరుణులకు దేవాలయములు లేకుండ పోవుటయే యొక గొప్ప నిదర్శనము. ఇంకను ప్రాచీనశిల్పచరిత్రము కూడ నీవిషయ మును స్పష్టపరచును. అంతవరకు పోనక్కర లేదు. నేటికి వేదవిహితమగు వివాహము పవిత్రస్థానము లగు దేవాలయ ములందు జరుపబడకుండుటయే, దేవాలయము వైదికమతమునకు చెందినది కాదని గట్టిగ తెలియుచున్నది.

లేని చిన్న "గర్భగృహములను" నిర్మించి యందు ప్రతిష్ఠించి, వాని యాయు రారోగ్య భాగ్యము లర్చకునికి వదలిపెట్టిరి. ఇది సర్వసామాన్యమయిన హిందూదేవాలయముయొక్క లోపలిసంగతి. ఇం దింతకంటె విశేష మేమియు లేదు. ఇక, - ఉన్నదంతయు దేవాలయము బయటనే యున్నది. ఆలయముయొక్క పైభాగమున కైలాసశిఖరము ననుకరించు గోపురములు; ముందట ధారాళమైన వెలుతురు వాయుప్రచారము గల విశాల మండపములు. దేవాలయము వెలుపలను క్రిందినుండి పైవరకు దేవతావిగ్రహములు, పౌరాణికగాథలు చెక్కబడి జనుల మనోబుద్ధుల నాకర్షించినవి. ఇందు శిల్పసౌందర్యము ప్రకాశించుచుండ, దేవాలయముచుట్టును ప్రకృతి సౌందర్యము నృత్యము చేయుచుండును. ఎట్లన, దేవాలయములు నదీతీరములందు లేనిచో నీటివసతి లోపము లేకుండ తటాకము లుండును. దేవాలయములచుట్టు చల్లదనమును, సౌరభ్యమును వెదచల్లు నుద్యానవనము లుండును. అందుచే దేవునిదర్శనము చేయవచ్చిన జనుల చిత్తములకు శాంతి, ప్రీతి, యుల్లాసము కలుగును. ఇట్లువిశాలదృష్టితో హిందూదేవాలయము నిర్మింపబడుట విశదమగును. అది దేవుని నిమిత్తము, దేవుని చూడవచ్చిన వారి యుపయోగార్థము మాత్రమే యుద్దేశింపబడి యుండలేదు. సత్రవులకువలె బీదసాదులకును, మార్గ శ్రాంతులకును విశ్రాంతి నొసగు పుణ్యారామస్థలములు కూడను. అన్యమతములవారి దేవాలయములు, ప్రార్థన మందిరము లిన్నివిధముల జనుల కుపకరించునట్లు నిర్మింపబడినవి కావు. అవి దైవప్రార్థనముకొఱకే ప్రార్థనచేయు వారి తాత్కాలికోపయోగార్థమే ముఖ్యముగ గట్టబడి యున్నవి. అంతకు మించి వారి దృష్టి వ్యాపింప లేదు.

ఇట్లు సర్వజనోపయోగముగ నిర్మింపబడిన హిందూదేవాలయము జాతీయజీవనమునం దొక యుచ్చస్థానము నాక్రమించినది. దేవాలయమే గ్రామస్థుల కొక న్యాయస్థానము, విద్యాభవనము, నాటకరంగస్థలము; సత్కాలక్షేపమునకు దగినచోటు. ఇట్లనేక విధముల పౌరసమావేశములకు, సభలకు కేంద్రస్థానముగా బరిణమించినది. గుడిలో విగ్రహము నర్చింపుడు, అర్చింపకుడు; దేవాలయముమాత్రము హిందూమతమునం దొక గొప్పదైన ధర్మసంస్థగా బరిణమించి, ప్రజాజీవనము మీద విశేషప్రభావమును గలిగియుండెను. అట్టి దాని ప్రభావ మిప్పటికే మూలబడుచుండుటచే, దేవాలయ భావిస్థితి యెట్లు పరిణమించునో తెలియబోదు గాని, దేవాలయమున కొక నూతనస్థితి ముందు రానున్నట్లు తోచెడిని. నవీనపరిస్థితులనుబట్టి యికముందు వివాహములు సర్వేసర్వత్ర దేవాలయములలో నేజరుపుట సామాన్యము కావచ్చును. ఇట్లు బహుభంగుల నుపయోగపడు దేవాలయము నవీన "గ్రామ పునర్నిర్మాణము" నందు పూర్వప్రభావముతో పునరుద్ధరింపబడునో, లేక దాని గతి కది విడిచిపెట్టబడునో కాలప్రభావము ననుసరించి యున్నది.

మన దేవాలయముల యొక్క బాహ్యాభ్యంతర నిర్మాణవిధానమును బరిశీలింప, ప్రకృతిజీవనోపలబ్ధంబయిన తమ విజ్ఞానమును ప్రాచీను లేవిధముగ జీవిత సౌభాగ్యముకొఱకు వినియోగించినది తెలియుచున్నది. ఇది దేవాలయనిర్మాణ విధానము. ఇక మనుజులు నివసించు గృహనిర్మాణమునం దావిజ్ఞానము నెట్లు సార్థకపరచిరో చూతము. ఇచ్చటను జీవితసౌభాగ్యమును మదినెంచిన నావిశాలదృష్టియే వ్యక్తమగును. ఇందు నివసించువారు చైతన్యములేని విగ్రహరూపమున వెలసిన దేవతామూర్తులు గారు. శరీరధారులు; మానవమూర్తులు; గృహస్థులు; గృహస్థధర్మములను నెరవేర్పవలసినవారు. కావున ధర్మసాధనమునకు మూలమగు నీశరీరమునకు, దేవుళ్ళకువలె గర్భగృహములు, చీకటికొట్లు కట్టుటా? లేక ఆత్మసత్కారము నొంద లతిథిసత్కారమువరకు నుపయోగించునట్లు బహిరంగగృహములను నిర్మించుటా? పరదేశులకు, నతిథి—అభ్యాగతులకు నాశ్రయము నొసంగవలెను. ఇంటిలోనివారి కారోగ్యప్రదముగను, హాయిగను నుండవలెను. బాలురు, స్త్రీలు, వృద్ధులు, రోగులు మున్నగువారి సౌకర్యములను జూడవలెను. కావున మనుజులకు వాసయోగ్యములగు గృహము లెట్లు కట్టవలెను? ఈవిషయమున బ్రయుక్తమయిన ప్రాచీనార్ష దృష్టి సంస్తవనీయమేగాక, యమోఘమును, నిరతిశయమును నై

యున్నది. బయట ధారాళముగ వాయువు వెలుతురు లభ్యమగునట్లే ఇంటిలోను వానిప్రాప్తిలాభములను పొందవలెను. గృహవిన్యాసము దేశముయొక్క శీతోష్ణస్థితిని, ఋతుపవనములను ననుసరించియుండవలెను. ఇంటిచుట్టును విశాలమైన పెరడుండవలెను. నందనవనమువలె గన్నుల పండువుగ జేయబడు నావిశాలరమణీయప్రదేశము మధ్యను గృహ ముండవలెను. అనంతరము నొకయాశ్రమమును దలపింపవలెను. అట్టి గృహనిర్మాణపద్ధతి యెట్లుండవలెను? హిందూదేశమున సంవత్సరములో తొమ్మిదినెలలు కొంచె మెచ్చుతక్కువగ దక్షిణమునుండి గాలి వీచుచుండును. కావున పడకగదులు దక్షిణభాగమునం దుంచబడినవి. వంటిల్లు,నట్టిల్లు, పడమరవైపున, తక్కువలోపలిభాగ మంతయు చావడి. ఇందు మధ్యస్థముగ, లోపలికంతకు వెలుతురు పర్వ్యాటకుగాను విశాలమయిన మండువా.1 పైనుండి సూర్యచంద్రులు, నక్షత్రములు తిన్నగా ఇంటిలోనికి ప్రకాశించుచుందురు. ఇదిగాక ఇంటికి నలువైపుల నాలుగు ద్వారములు. ఇంకను సౌకర్యములు: ఇంటికి నాలుగువైపుల నాలుగు వసారాలు. నాలుగువైపుల విశాలమయిన అరుగులు. ప్రొద్దు టెండ, సాయంత్రపు టెండ, వర్షపుజల్లు లోపల పడకుండ నివారించుటకు వసారాలవలె నుపయోగించు సాధనములు మరేవియు లేవు. (వసారాలకు బదులు కిటికీల నెత్తిమీద 'టోపీలు' కప్పెడి నేటి డాబాయిండ్ల స్థితిని పరికింపుడు. పూర్వము కట్టబడిన గవర్నమెంటు కచ్చేరీలకు పాఠశాలలకు వసారా లున్నవి. ఇప్పుడు క్రొత్తగా కట్టించేవి వసారాలులేని యూపై 'టోపీ' పద్ధతినే! దీనికంతయు కారణము ఆర్థికశాస్త్రవేత్తల ప్రభావము. ఆర్థికభావము హెచ్చినకొలది భావదారిద్ర్యము పెరుగుచుండును.) ఇక నరుగులవలని లాభమును గాంచుడు: చిన్నపిల్ల లాటపాటలందు దనివి విశాలముగ దిరుగుటకును, బయట హోరున వర్షము కురియుచున్నను నాడుకొనుటకు స్త్రీలు వెలుపలనున్నపుడు (ఇప్పటివలె నూపిరాడని చీకటికొట్లలో నేమూలనో యొదిగియుండువట్లుగాక) నిర్మలవాయువును బీల్చుచు సుఖముగా కూర్చుండుటకు బరుండుటకు, రోగులు, వృద్ధులు స్వేచ్ఛగా బయట నుండుటకు, పరదేశులు, చుట్టాలు స్వేచ్ఛగా విశ్రమించుటకు ఇట్టియరుగుల యుపయోగ మెన్న మిన్నగ నుండును. మనదేశమునకు వచ్చిన యొకానొక కాలేజిప్రిన్సిపాలు దొరగా రరుగులోనగు నాతిథ్యమును జూచి, 'మీదేశమున తలుపుతట్ట నక్కఱలేకుండగనే యాతిథ్యము (Hospitality) దొరకు'నని తమ యాశ్చర్యమును వెల్లడించిరి. ఇది ప్రాచీనగృహనిర్మాణ సంప్రదాయము. 2 ఎన్నియో నిర్మాణసౌకర్యము లున్నను నేడట్టి సంప్రదాయము లోపించుచున్నది. విశాలమైన మండువ యిల్లు పోయి యెక్కడజూచినను గర్భగృహములుగల 'డాబా'యిండ్లు లేచుచున్నవి. (వీనిని బోడియిండ్లంటే బాగుంటుంది). "గర్భగృహములు", మేడలు మిద్దెలు గల పట్టణముల నాగరికతను దెలిపెడివి. మండువేసవిని గర్భగృహములు, "నిద్రా గర్భగృహం ప్రవిశతి క్లాంతేవ కాంతాజనైః సహ"3 అన్నట్లు సేవ్యములగునని వానినభిమానింపవచ్చుగాని, చేత విసనకర్ర పుచ్చుకొని యీ చీకటి గర్భాలయములందు సుఖములేని నిద్రనెందుటో,

1. ఉష్ణదేశమగుఇటలీయందును, రోమనులయిండ్లు ఎత్తయినవిశాలమగు మండువాలను గలిగియుండెడివి. ఆది రోమనులు సామ్రాజ్యధురంధరులు కాకమున్న మండువాకు లాటినులో 'Impluvium' అందురు.

2. ఈసంప్రదాయము యొక్క మూలము లెందున్నవో వెదకిచూచిన నవి మునిపల్లెలందును, ఋష్యాశ్రమములందును గన్పట్టును. మునిపల్లెలే 'యగ్రహారములు'గ గాలక్రమమున పరిణమించినవి. ఆశ్రమముల నుండియే బహిరంగమగు మండువాయిండ్లు వెలువడినవి.

3. ఇది మండువేసవి మధ్యాహ్న మెట్లుండునో వర్ణించు నొకానొక శ్లోకములోనిది. ఆశ్లోక మిది:—
ఛాయా సంశ్రయతే తలం విటపినాం శ్రాంతేవ పాంథైః సమం, మూలం యాతి సరోజలస్య జడతాగ్లానేవ మీనైః సహ, ఆచామ త్యహిమాంశుదీధితి రప స్తప్తేవ లోకైః సమం, నిద్రా గర్భగృహం సహ ప్రవిశతి క్లాంతేవ కాంతాజనైః.

అటుగాక వృక్షవాటికలమీదుగ బరతెంచు దక్షిణానిల ములయొక్క దాక్షిణ్యమునకు జొక్కి బయటకు నుండు గదులందు సుఖనిద్రను జెందుటో — ఏది కమనీయమో, ఆరోగ్యప్రదమో విచారింపదగినది.

ఈమిద్దెలవలన మేడలవలన శరీరమునకుగాని, మన సునకుగాని యేవిధమయిన సుఖము ఆరోగ్యము లేదు. ఈడాబాలచుట్టు వెన్నేని కిటికీలుండునుగాని, ఇంటిమధ్య భాగమున సరియైన వెలుతురు పడదు; వాయుప్రచారము మెండ లేయుండదు. దక్షిణభాగముననుండువారికి మాత్రము కొద్దో గొప్పో తగులుచుండును. గట్టిగా ఎండవానలు కొట్టితే కిటికీలు మూసికొని కూర్చుండవలసినదేగాని మరేమి లేదు. నుయ్యిగొయ్యి వగైరాలు వంటింటిబాపు వనే. అరుగు లసలే యుండవు. ఉంటే ప్రాదేశపరి మితము. పెరడు, వాకిలి యెంత తక్కువగా నుంటే యంత లాభము. అసలే లేకుండా ఉంటే అంతా లాభ ము. పైగ, ఆకొంచెము గాలియైనను రాకుండ చుట్టు కోటగోడలవలె యెత్తయిన ప్రహరీగోడలు. ఇప్పటి నవీనగృహముల పద్ధతి యిది. ఈపద్ధతి బాగుగ నాలో చించినచో నేమి తెల్పును? గృహస్థుల (లేక గృహయజ మానుల) హృదయసంకోచమును, భావశూన్యతను, ధనా శను, స్వార్థపరత్వమును తెలియజేయును. పూర్వు లెన్ని యో సౌకర్యముల నాలోచించి, "పారమార్థిక" దృష్టి తో గృహములను గట్టిరి. ఇప్పటివారి జీవితపరమార్థము అర్థమేగాన, ఆర్థికదృష్టితప్ప వేరొండు గానము. ఇక నీబోడియిళ్లకు చక్కదనము తక్కువగునేమో యని పైమెరుగులకు, రంగురంగుల పూతలకు లోటులేదు. రేఖాసౌష్ఠవములేని నానారకముల లాజాలు (arches). త్రిభుజములు మొదలు ద్వాదశభుజములవరకు గల క్షేత్ర గణితానుసారములగు నాకారముల ననుకరించుపీఠికగదులు. ఇక లోపలిసౌభాగ్యమునకా, లోటు లేదు. గోడలందు చిత్రములప్రథ ప్రకాశించుచుండును. ఆమధ్య, మధ్య మధ్యను గ్రామఫోనుహార్మోనియముల సంగీతపు వెలుగు కూడాను. కాని సర్వవిధముల ప్రకృతిశోభతో లయ కలియు నిజమయిన "హార్మని" మాత్ర మీమేడలందును, మిద్దెలందును లభింపదు.

విచారకరమగు సంగతి యేమనగా నేడు విద్యా వంతులును, కళాకోవిదులును నగు ధనికులు, 'అగ్రహార ములు', పల్లెలు విడిచివచ్చి పట్టణములందు క్రొత్తపంపి జని (After the fashion of the day) డాబాయిళ్లు మేడలు కట్టుకొనియుందు రనేది. అంతకంటె విచార కరమగునది యేమి టంటే, పల్లెటూరిలో నుండువారు గూడ పట్టణములోనివారి ననుకరించుచుండు రనేది. ఆశ్చర్య మేమున్నది? శ్రేష్ఠు లాచరించుదానినే యిత రులు ననుసరించుచుందురు.

నేడు 'గ్రామపునర్నిర్మాణము'ను గురించి చాల చాల వింటున్నాముగాన, ఇకముందు నిర్మింపబోయేవి యెట్లుండిన బాగుండును? మునిపల్లెలవంటి అగ్రహారముల మాదిరిగనా? లేక పాశ్చాత్యగ్రామపద్ధతినా? గృహ ములు ('ఆరోగ్యవార' ప్రదర్శనములందు నమూనాగా చూపింపబడు పాశ్చాత్యగృహము లట్లు) క్రిక్కిరిసియుం డు పట్టణములందలి డాబాల ననుకరింపవలెనా? అటుగాక విశాలరమ్యవనోద్దేశములందు కుటీరము లయి నను మేలుగా నుండునా?

కావున గ్రామపునర్నిర్మాణమునకు ముందుగ నెక్కు డావశ్యకమయినది జీవితపునర్నిర్మాణవిచార ము. అట్టి విచారము సేయకుండ, అర్థలాభము నపే క్షించియో, ఆడంబరమునకో, విలాసార్థమో నిర్మింప బడు "నిర్మాణములు" కల్యాణాస్పదములు కానోపవు.

---

# పదవీ చిత్రము

చిట్టాప్రెగడ సీతారామాంజనేయులుగారు

౧

లోకగ్రంథకథానకక్రమము నాలోకించినన్ జక్రనే
మీకల్పంబయి క్రిందుమీదులను నమ్మేరల్ సమంబౌచు నా
యాకాలాను గుణంబులైనడుచు సత్యం బొప్పినన్—బ్రాభవ
ప్రాకట్యభ్రమ పీడ దిష్టముగ! దేవా! భక్తమూర్తీ! శివా!

౨

గ్రీకుల్, రోమను, లింకనెంద అధిక శ్రీమించినన్ వారలౌ
ట్లాకల్పంబుగ నిల్చిరే! ప్రభువు నేఁడన్యుండెయౌఁ గాక! మా
ర్యాకాలంబున నెంతలో మరల నార్యావర్త మాఽస్థాన మం
దే కాలూను! సచ్చిత్రదృశ్యమిది నీదే! భక్తమూర్తీ! శివా!

౩

గతిమందాకిని, లోతెలుంగకయె దూకన్ బూను దత్వాఽనభి
జ్ఞత, మూలంబున కెల్ల ముప్పగుట—నాచార్యత్వ మావశ్యకం,
బతిసూక్ష్మానుభవైకమంత్రవిధు లభ్యాసంబునన్ గూర్చి, స
ద్గతిసౌఖ్యక్రమ సిద్ధులన్ నడుపఁగల్గన్! భక్తమూర్తీ! శివా!

౪

మతమో—రాచఱికమ్మొ—శాస్త్రవిధమో—మార్పించు నైమిత్తిక
క్రతువారంభము సేయు కాలపరిపక్వంబైన నధ్వర్య దీ
క్షితుఁడౌ దీవె మహాత్మతన్! తెలియ కాక్షేపించు సైతాను సం
తతులం దాహుతులౌ కెఱుంగఁదగుఁగాదా! భక్తమూర్తీ! శివా!

౫

స్థితిమా ర్పమ్యోడి సంగ్‌లో—స్వాగతులందే మూర్ఖపుం బట్టుఁ బ
ట్టి, తెగన్ లాగుట రాజయత్నము వృథా 'డీకొట్ట', కీ విశ్వవి
స్మృతి నేకోదర భావనన్ గనుట శాంతిప్రేమ సత్యప్రథాఽ
కృతి యోగ్యం బిట 'భారతం' బెలుఁగఁగల్గెన్! భక్తమూర్తీ! శివా!

---

# కవులు పెళ్లాడితే?

అనుభవశాలి

రెండు ప్రశ్నలున్నాయి. కవులు పెళ్లాడొచ్చునా? ఒకవేళ పెళ్లాడితే వారి భార్యలు కూడా కించిత్కవయిత్రులో, లేకపోతే, కనీసం కవితా కోమలహృదయలో, కావలెనా? ఈ రెండు ప్రశ్నల గురించీ తరచుగా తేలిన నాఅభిప్రాయం యేమిటంటే, కవులు పెళ్లాడకూడదని—కారణం మనవిచేస్తా.

కవులు సామాన్యమైన యితరమనుష్యుల్లాంటివారు కారు. ఆ ప్రత్యేకత లేంది వారు కవులేకారు. కవుల్నీ, కాముకుల్నీ, వెర్రివాళ్లనీ ఒక కొట్లో పెట్టడు మహాకవి షేక్స్పియరు. మతిభ్రమణులకి దగ్గరసంబంధి కవియే అని లోకంలో వాదు. కవికుటుంబాల్లో కవులెందరో, వెర్రివాళ్లందరుండడం నేనెరుగుదును. అందుచేత కవికి మరోమనిషి (అందులో ముఖ్యంగా పెళ్లాం) సంపర్కంవల్ల సదుపాయం లేదేమో అని నా అభిప్రాయం.

సామాన్యమైన మనిషి తన భార్యకు ఉపజ్ఞ (Originality) ఉంటేగాని వీల్లేదని కోరడు. తనతోపాటు ఏదో నిరతిశయంగా, మనోవ్యాపక మేమీ లేకుండా సంసారం తట్టతగలేస్తే చాల్ను. కవితో వ్యవహారం అట్లాకాదు. కవియొక్క జీవితరథాని కెన్నడూ నిలకడలేదు; వాయువేగంగా అన్నిదిక్కులకూ అన్ని దారులనూ పోతూవుంటుంది. అతని హృదయపిపాసకు శాంతి లేదు. ఆకర్షణీయంగావుండే ప్రతివస్తువూ అతనికాళ్లకు బందం. నూతనత్వంలేని ప్రతినిమిషం అతని కొక నరకం. ఆచారపు కట్టుబాట్లు కవి లక్షించడు. అతని Fancy కి అదుపాజ్ఞలు లేవు. సామాన్యజీవియైన తనభార్య కందని ఊహా ప్రపంచాల్లో అతని బ్రతు కంతాను. దృష్టిపథాన్ని మీరిపోయే భువనాంతరాళమంతా అతనికి "అసివారుగా నేగునట్టి బయలు." తనకావ్యాల్లో సృష్టించే ప్రతిపాత్రమూ తానే జీవింపచూస్తాడు. అవ్యవధిగా, అప్రయత్నంగా మారిపోతూండే అతనికి అశాంతి కారణాలకి అవధి అంటూ వుండదు. అలాంటి, రెక్కలు కట్టుగునే మనిషిని పెళ్లాడమని యెల్లా చెప్పను?

శృంగార(శ్రీ)నాథుడు వివాహితుడే అయితే, అతనిభార్య, తనయందు భర్త వ్యామోహం నిలుపుకోనేటందుకు, ఆకవి సార్వభౌముడు సృష్టించిన ప్రతి మోహనమూర్తినీ దిన మొక అవతారంగా ప్రదర్శించి వుండాలి. లేకుంటే "తింత్రిణీపత్రవిశాల విలోచనం" అని వర్ణింపబడ్డ యిల్లాలులాగ అర్థంతెలియకుండా ఆనందించే అమాయకపు ముద్దరాలేనా అయివుండాలి. అలాంటి అమాయకత్వంవల్ల భార్యకు భర్తృసాహచర్యం యోగ్యంగానే వుంటుందిగాని, కవికే నూతనత్వాభావం సిద్ధిస్తుంది. బ్రౌనింగు దంపతుల్లాంటి అనుకూలకవితాదాంపత్యం లోకంలో తరుచుగా చూడం.

అయితే కవులందరూ బ్రహ్మచారులుగా వుండాలిసిందేనా అంటారేమో? అక్కర్లేదు. కవులుకి అనువైన భార్యలు లేకపోలేదు.

షెల్లీ కీట్సు యుగం ప్రారంభించుకుని తదనుయాయులైన కవులందరిలోను, గృహిణి అంటే ఒకవిధమైన అశాంతి, అతృప్తి ప్రబలిపోయేయి. అందుమీద, షేక్స్పియరుకి కూడా కట్టుకున్న భార్యవల్ల అట్టే సుఖం లభించలేదనీ, అందుచేతనే Avon విడిచిపెట్టి అతడు ఏకాకిగా లండను దొమ్మిలో కలిసిపోయేడనీ, అతని విల్లులో (మరణశాసనం సుమండీ, ధనుస్సు కాదు) భార్యవిషయం నామకాగా మెత్తేడనీ, చరిత్రలు పుట్టిపోయేయి. వాస్తవంచేత, యివన్నీ అనాధారమైన ఊజ్జయింపులని తెల్తూన్నాయి. "నానూగుమీసాల నూత్న యౌవనం"లో అతడు వ్రాసిన సానెట్టులో:—

"Let me not to the marriage of true minds
Admit impediments, Love is not love
Which alters when it alteration finds ;

*   *   *

If this be error, and upon me prov'd,
I never writ, nor no man ever lov'd !"

(Sonnet, 116).

ఈరీతిగా దాంపత్యప్రేమను ఆరాధించిన కవిరాజు Hathaway వంటి పల్లెటూరి యిల్లాలిని నిరసించి వుంటాడంటే, నమ్మరాని విషయం.

ఇక అడిదం సూరకవిగారిని గురించి ఒక మనోజ్ఞమైన ఇతిహాసం వుంది. ఆయనభార్య విద్యావతి అనికాని, కవయిత్రి అనికాని చెప్పడానికి వీల్లేదు. ఒకనాడు, కొడుకైన భాస్కరుడి (బాచన్న అని ముద్దుపేరు) మీద కవిత్వం చెప్పమని భర్తని ఆవిడ కోరింది. అప్పుడు సూరకవి

"బాచాబూచులు లోపల
బాచన్నే పెద్దబూచి పళ్లుం దానున్"

అని మహారసవంతంగా వర్ణించారు ప్రియసుతుణ్ణి. అయితే, అది కొడుకు అందాన్ని వెక్కిరించేటందుకు కాదు. తన భార్య యెంతో గర్వపడుతూ చూచుకుంటూన్న ముద్దు బిడ్డని అట్లా వర్ణించడం ఆమెతో పరిహాసానికి. అప్పుడు తనభార్యముఖంలో ఒకవిధమైన నూతన చైతన్యం స్ఫురింపకమానదు. అదిచాలదూ, కవిహృదయాన్ని ఆకర్షించడానికి? భగవంతుని ప్రత్యక్షసృష్టియొక్క అవుగాములను అక్కరచెయ్యకుండా, nothingness లో పునః సృష్టిచేసే, శిసలైనకవికి, ఎంత స్తబ్ధమైన మొద్దు భార్యనైనా metamorphose చేసుకోడం అశక్యంకాదు.

ఇంతకూ, ఫలశ్రుతి:—

కవి, లోకంవల్ల కోరేది సౌగత్యమాత్రమే. అర్హమైన స్తుతి, దానివలన కీర్తి దొరక్కపోయినా, కటువైన ప్రతివిమర్శ లేకుండా అలక్ష్యమైన అంగీకారం లభిస్తే చాలు; అతడు ధన్యుడు. ఏమందులుపత్రికలోనో ప్రతివిమర్శ పడ్డాదంటే, దట్టంగా యెర్రపెన్సిలుతో మార్కుచేసి జాగ్రత్తగా అతనికి అందజేసే

మిత్రులు ఉండనే ఉంటారు. అతడి ప్రాణం విసగడానికి యివికాక, యింట్లో భార్యకూడా చదువెరిగినదై, రుచిభేదంకొద్దీ ఖండనం మొదలెడితే, అడిగేరా అతని బ్రతుకు? అనుభవసిద్ధమైన నా అభిప్రాయ మేమంటే, కవి తన కలానికి అనుకూలమైన వాతావరణం నిర్మించే భార్యను కలిగివుంటే, అతని రచన లమోఘంగా వుంటాయి. ఇందుకై భార్య కవయిత్రి కానక్కర్లేదు. అతనియందు ప్రేమ, అతని ఆశయములం దనురాగము, అతని వ్రాతల నర్థము చేసుకొనుటకు కుతూహలము - ఈ మాత్రమున్న భార్యగల కవిదే భాగ్యము. తోడివారికి తన భర్త రచనములను చదివి వినిపించుచు మురిసిపోవు ముద్దరాలు, కవి హృదయమున కలేఖ్యమగు యోగ్యతా పత్రము.

---

## మేఘుఁడు

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

తత్పరుండయి కలునీళ్లు తప్పఁ ద్రాఁగి
రొమ్ములు వైకంబుఁగొనఁ దొట్రువడఁగ నడుగు
చదలివీథులఁ బడి యూఁగి సాఁగిపోవు
మఱచి మేఘుండు తనదు గమ్యస్థలంబు.

గుట్టుమట్టును గాంచక బట్టబయలఁ
బరులు వీక్షింతు రను కొంకుపాటుగొనక
పైఁబడును రాచుకొనిపోవుఁ బట్టుకొనును
గాఁగిలించును దారకాభోగినులను

ఎన్నఁడుం బోవఁ డిల్లాలి సన్నిధికిని
నేఁగు నేఁడాది కెపుడో! యాదృచ్ఛికముగ
మెలఁత మేల్బంతి యంత నామెఱుఁగుఁగన్నె
తెలిసి కూర్ములు నెఱప గ్రుడ్లుఱిమి కసరు.

ఒంటిపాటున విహరించుచుంద్రు మింట
మవ్వపుంగను లచ్చరపువ్వుఁబోండ్లు
తుంటరితనంబుఁ జూప నింద్రునకుఁ దెలిసి
నిముఁ గొఱఁతవేసి మేఘు, దండింపఁగలఁడు.

---

# హిందూదేశపు ప్రభుత్వఋణము

చావలి వెంకటహనుమంతరావుగారు, M. A.,

హిందూదేశపు ప్రభుత్వఋణమునుగూర్చి విచారించి దానిలో ఎంతభాగము హిందూదేశపు లాభముకొరకై చేయబడినదో, ఎంత ఇంగ్లండుదేశము లాభముకొరకు చేయబడినదో విచారించి నిర్ణయించుటకొక సంఘమును కాంగ్రెసుసభవా రేర్పాటుచేసిన సంగతి ఎల్లరకును తెలిసినదే. ఈ సందర్భములో ఆఋణమునుగూర్చి కొన్ని ముఖ్యాంశములు ప్రజా సామాన్యమునకు తెలుపునుద్దేశముతో ఈవ్యాసము వ్రాయబడినది.

మనదేశపు ప్రభుత్వఋణము ఈస్టు ఇండియా కంపెనీ (East India Campany) వారు మనదేశమును పరిపాలించుకాలములో మొట్టమొదట మొదలు పెట్టబడినది. అంతకుపూర్వము ప్రభువులు, ప్రభుత్వములు ఋణములు చేసినప్పటికిని అవి ఆయా రాజుల స్వంతజవాబుదారిపైననే చేయబడినవే కాని ప్రజలయొక్క కాని, దేశముయొక్కగాని పరపతి నాధారము చేసుకొని చేసినవి కావు. కాని కంపెనీవారు మాత్రము దేశమును జయించునిమిత్తమును, వారి వర్తకపు హక్కులను, రాజకీయహక్కులను నిలుపబెట్టుకొను నిమిత్తమును ఎక్కువ యుద్ధములు చేయవలసియుండి, ఆయుద్ధపు ఖర్చులను భరించుటకై విరివిగ అప్పులుచేయవలసిన అవసరము కల్గినవారైరి. మనదేశమును జయించునిమిత్తము మనదేశమునందే అప్పుచేయుటయు, దానిని తీర్చుభారము మరల దేశముపైననే పడవేయుటయు చాల అన్యాయమగు విషయమని వేరుగ చెప్పవలయునా? ఇంగ్లండుదేశములో ప్రభుత్వఋణమనునది 17 వ శతాబ్దము చివరను మూడవ విలియం కాలములో మొదలుపెట్టబడి, చాలఉపయోగకారియగు సంస్థగా నుండుటకనిపెట్టి, కంపెనీవారు ఆ పద్ధతిని ఇచ్చటకూడ ప్రవేశపెట్టిరి. అట్లు మొదలుపెట్టబడిన ఈ జాతీయఋణము క్రమక్రమముగాను, ఒక్కొకప్పుడు చాల తొందరగాను పెరుగుచువచ్చి చివరకు ఒక గొప్ప బరువుగా దేశస్థులమెడలకు చుట్టుకొనినది. ఈ ఋణమును గురించిన ముఖ్యాంశమును దానిలోని ప్రబలమగులోటునుకూడ ఈసంగతియే. ఏమన అప్పు ఎప్పుడును తీరుట కవకాశము లేకపోగా, వడ్డికూడ ఏసంవత్సరమున కాసంవత్సరము తీరక కొంతభాగము మాత్రము ఆదాయములోనుండి తీరుటయు మిగిలినదానికి మరల అప్పుచేయుటయు జరుగుచుండును.

ప్రభుత్వమువారు దేశపు పరపతిపై అప్పుచేయుటకు పూనుకొనినపుడు అట్లు చేయబడిన అప్పువలన దేశమునకు లాభమును, పూర్తియగు ఉపయోగమును ఉండునని తోచినప్పుడే చేయవలెననియు, ప్రభుత్వపు ఖర్చు సామాన్యపు ఆదాయమునుండి సరిపోవు సమయములలో అప్పుచేయుట న్యాయ విరుద్ధమనియు ప్రప్రథమమున జ్ఞాపకముంచుకోవలసి యున్నది. మరియు అప్పుచేసిన సొమ్ముతో చేసినపనులుకాని, కట్టబడిన కట్టడములుకాని కొంతకాలము పోయినతరువాతనైనను ఫలప్రదములుగా నుండునని నిశ్చయముండినపుడే వాటినికట్టుటకప్పుచేయు విధానమును సమర్థించుటకు వీలుండును. అట్టి నిశ్చయము లేనప్పుడు వాటికొరకై దేశీయుల పరపతిపై అప్పు చేయుట చాల అరిష్టదాయకమగు పని. ఆ కట్టడములు ప్రజల ఆదాయము నభివృద్ధిపరచి వారిసౌఖ్యజీవనమునకు తోడ్పడునప్పుడు కాని వాటియం దేవిధమైన న్యాయమును లేదనియే చెప్పవచ్చును. ప్రభుత్వమువా రెప్పుడు ప్రజలసొమ్మును న్యాయము లేకుండ, ఆలోచన లేకుండ ఖర్చుపెట్టుటకు మొదలిడుదురో అప్పుడు ఆప్రభుత్వము ప్రజాహితమునకు వ్యతిరేకముగ ప్రవర్తించుచున్నదని గ్రహింపవగును. ఈవిషయములను మనస్సునందుంచుకొని మన జాతీయఋణము విషయమునుగూర్చి ఆలోచించిన తేలు పర్యవసాన మేమన: మనప్రభుత్వమువారు ప్రజాహితమును పాటించిచేసిన అప్పు కొంతయుండినప్పటికిని విస్తారభాగముఇంగ్లండుదేశపు లాభముకొరకును, ఇంగ్లీషు

వారి రాజ్యవిస్తీర్ణముకొరకు చేసిన యుద్ధములకొరకును చేయబడినదని తేలును. పైన సూచించిన ప్రధానసూత్రముల ప్రకారము మన జాతీయఋణము చేయబడియుండలేదనికూడ విశదమగును.

మనదేశపు ప్రభుత్వఋణమును గురించి కొన్ని అంకెలను ఇచ్చుట ఈసందర్భములో సమంజసము. 1792 సంవత్సరములో అది పౌ. 70 లక్షలకు కొంచెమెక్కువగా నుండెడిది. క్రమముగ 1830 సంవత్సరమునాటికి 333 లక్షల పౌనులవరకును పెరిగెను. ఆఫ్ఘను శిఖుయుద్ధముల సందర్భములో యీ అప్పు 435 లక్షల పౌనులవరకును హెచ్చయ్యెను. వెలిస్లీ డాల్హౌసీ ప్రభువుల పరిపాలనక్రింద వారి రాజ్యకాంక్షవలనను, ఇతరకారణములవలనను సిపాయి తిరుగుబాటుకాలమునాటికి 550 లక్షలపౌనులవరకు ఈ అప్పు పెరిగెను. ఆతిరుగుబాటు నణచుటకు ప్రభుత్వమువారు చేసిన ప్రయత్నముల కారణముగ వారికి ఖర్చు పెరుగుటచే కంపెనీవారాభారమువంతను మనదేశముపైననే రుద్ది వారిదివరలో రాజ్యము కొరకై చేసిన అప్పులను, ఇందుకొరకై చేసిన అప్పును కూడ దేశస్థులపైననే కట్టిరి. విక్టోరియారాణికి కంపెనీవారు ప్రభుత్వమును ఒప్పచెప్పునప్పుడు కంపెనీవారికి నష్టపరిహారముగా 120 లక్షలపౌనులను చెల్లించి ఆ ఖర్చునుకూడ మనదేశముమీదనే పడవైచిరి. సిపాయిల కలహముసందడి తగ్గిపోయిన తరువాత అనగా 1862 సంవత్సరమునాటికి హిందూదేశపు అప్పు 1000 లక్షల పౌనులవరకును అనగా 20 సంవత్సరములలో సంవత్సరమునకు 190 లక్షలచొప్పున పెరిగెను. న్యాయముగ ఆలోచించిచూచిన, రమేశచంద్రదత్తు మహాశయుడు చెప్పినట్లు ప్రభుత్వమువారు దేశమునందు శాంతిపరిపాలనను స్థాపించుటకై చేసిన అప్పును, ఇతరదేశములలోని యుద్ధములు చేయుటకు, రాజ్యమును విస్తీర్ణము చేసికొనుటకొరకు చేసిన అప్పులో తీసివేసి మిగిలినదానిని మాత్రమే హిందూదేశపు ప్రభుత్వఋణముగ స్థిరపరచుట చాల ముఖ్యవిషయము. ఈపద్ధతిప్రకారము చేసిన హిందూదేశమునకు జాతీయఋణ మనునదియే యుండనక్కరలేకుండపోవును. * * *

1860 సంవత్సరమునాటికి హిందూదేశమునొక్క మొత్తము రిజిష్టర్డు అప్పు 635 లక్షలపౌనులు. దానిలో సుమారు 285 లక్షలపౌనులు ఇంగ్లండుదేశమునందును, మిగిలినది హిందూదేశమునందును చేయబడినది. 1876లో విక్టోరియామహారాణి హిందూదేశపు చక్రవర్తినిగా చేయబడినపుడు హిందూదేశమునందు చేయబడిన అప్పుభాగము 72 కోట్ల రూపాయలును, ఇంగ్లండుదేశమునందు చేయబడిన భాగము 556 లక్షల పౌనులును అయియుండెను. 1890 సంవత్సరమునాటికి రూపాయి అప్పు (అనగా హిందూదేశములోచేసిన అప్పు) 102$\frac{3}{4}$ కోట్ల రూపాయలును, ఇంగ్లండుదేశమందలి అప్పు 104$\frac{1}{2}$ మిలియను పౌన్లవరకు హెచ్చాయెను. 1910-11 నాటికి ఇండియాదేశమందలి అప్పు 138 కోట్ల రూపాయలు, ఇంగ్లండుదేశమందలి అప్పు 1780 లక్షలపౌనులు. ఈ అంకెలవలన గ్రహింపవలసినవిషయము ముఖ్యమైన దొకటి కలదు. బ్రిటిష్ప్రభుత్వము మనదేశమందు స్థిరపడి రాజ్యమును చేయుట మొదలుపెట్టినప్పటినుండియు క్రమక్రమముగ ఇంగ్లండులో చేయబడిన అప్పుభాగము హెచ్చుగుటయు ఇండియాదేశమునందు చేయబడినది తగ్గిపోవుటయు తటస్థించినది. 1927-28 సంవత్సరములో ఇండియాదేశమందలి అప్పు 416 కోట్ల రూపాయలుగా నుండగా ఇంగ్లండుదేశమందలి అప్పు అప్పటి మారకపురేటుప్రకారము 452 కోట్ల రూపాయ లుండెను. ఈవిధానమువలన మనదేశమున కెంతనష్టమో మనము ప్రతిసంవత్సరమును అప్పుపై చెల్లించవలసినవడ్డీ అంకెలను గమనించిన తేటతెల్లమగును. ఇండియాలో చేసినఋణములో చాల భాగము నూటికి సంవత్సరమునకు 3$\frac{1}{2}$ మొదలు 6$\frac{1}{2}$వరకున్న వడ్డీరేటుపై చేయబడినదై యున్నది. ఇంగ్లండునందు చేసిన అప్పు చాలవరకు నూటికి 7 వంతున గల వడ్డీరేటుపై చేయబడినది. దీనివలన నేర్చుకొనవలసిన విషయములు (1) తక్కువరేటుగల ప్రదేశములో మానివేసి ప్రభుత్వమువారు హెచ్చురేటుగల దేశములో అప్పుచేయుట (1) అట్లుచేయుటవలన ప్రతిసంవత్సరమును మనదేశమునుండి వడ్డీరూపకముగా అపారమగు ధనము ఇతరదేశములకు (ముఖ్యముగ ఇంగ్లండుకు) పోవు

చుండుట. (3) మనదేశమునందలి ధనమునకు సరియగు ప్రతిఫలము లేకుండపోవుట.

* * * *

ప్రభుత్వమువా రిదివరలో హిందూదేశములో అప్పునుచేయుటకు సరియగు ప్రయత్నము చేసియుండ లేదనియే చెప్పవచ్చును. వారికి సొమ్ము కావలసివచ్చినపు డెల్లను ఇంగ్లండునందే ఎక్కువవడ్డీకి అప్పుచేయుట జరుగుచుండెను. ఇప్పటికిని ఆపద్ధతినే వారవలంబించుచున్నారు. ఇట్టి పరిస్థితులలో హిందూదేశమునందు ప్రభుత్వమువారికి అప్పుదొరకకుట దుర్లభము అను వాదము నిరాధారము. సరిగా ప్రయత్నించి ప్రభుత్వమువారు వ్యవహరించినపు డెల్లను వారికి కావలసిన అప్పు వెంటనే తక్కువవడ్డీకి దొరకుచుండుట వాడుకయై యుండగా హిందూదేశపు ద్రవ్యపుబజారు గొడ్డుపోయిన దనుటలో ఎంతసత్యమున్నదో గ్రహింపనగును. ఈ విషయము పోయిన ఐరోపామహాసంగ్రామకాలములో యుద్ధపుఋణముక్రింద మనదేశస్థులు 3 సంవత్సరములలో 150 కోట్ల రూపాయ లిచ్చియుండినప్పుడు పూర్తిగ స్పష్టపడినది. ప్రభుత్వమువారు తమప్రకృతవిధానమును పూర్తిగ మార్చివేసి వారికి ఫలప్రదమగు కార్యములకు అప్పు కావలసివచ్చినపుడెల్లను హిందూదేశమునందే దానిని సేకరింపజూచుట చాలముఖ్యము.

ఇంక మన ప్రభుత్వ ఋణముయొక్క వైఖరిని గుఱించి కొంత చర్చించెదము. 1820 సంవత్సరములో ఇంగ్లండు ఇండియా దేశములలో కలిపి ఈఅప్పుమొత్తము 36 కోట్ల రూపాయిలుండెను. ఒకశతాబ్దము కాలములో అనగా 1920 నాటికి ఇది 1000 కోట్ల రూపాయిలవరకును పెరిగిపోయెను. 1929 సంవత్సరము నాటికి ఈ అప్పుమొత్తము 1074.16 కోట్ల రూపాయిలై యుండెను. దానిలో సుమారు 763 కోట్ల రూపాయిలు లాభము నిచ్చునట్టియు ఫలప్రదమైనట్టియు పనులందు (అనగా రైల్వేలుకట్టుట, వ్యవసాయపు కట్టడములు తయారు చేయుట) వెచ్చింపబడెను; 171 కోట్లరూపాయిలు తిరిగి ఫలితములేని పనులకై (అనగా యుద్ధము, కాటకమును తగ్గించుట మొదలగునవి) ఖర్చుపెట్టబడెను; 136 కోట్లు రాష్ట్రములుచేసిన అప్పుభాగమైయుండెను; 30½ కోట్లు ఇతరపనులకై చేయబడెను. దీనియందు చాల భాగము రూపాయిమారకము ఒకషిల్లింగు నాలుగుపెన్సులు (అనగా కాసు 15 రూపాయిలు ఖరీదు) గా నుండినప్పుడు చేసిన అప్పుగా నున్నది. ప్రభుత్వమువా రే దేశపు ఔన్నత్యమును పాటించువారైన రూపాయిమారకము హెచ్చుగా నున్నప్పుడు (అనగా రూపాయి 2 షిల్లింగులు విలువకలిగి యున్నప్పుడు) రూపాయిపైన ఆధారపడియుండు అప్పు (Rupee debt)గా మార్చివేసి దేశమునకు లాభముకలుగచేసి యుండెడివారు. కాని వారట్లుచేయక ఎప్పటి హెచ్చురేటు ప్రకారమే దానిని జరుగుచుండనిచ్చుటచే అప్పుమొత్తముపై సంతను హెచ్చురేటుప్రకారము వడ్డీ నిచ్చుకొనవలసిన బాధ్యత ప్రజలపై బడినది. ఈవిధముగా వడ్డీరూపకముగా ప్రతి సంవత్సరము మనదేశస్థులు 35 నుంచి 40 కోట్ల రూపాయిలవరకు ఇంగ్లండు దేశమునకు సరుకులు కాని, వర్తకము మందముగా నుండునప్పుడు బంగారము కాని ఎగుమతిచేయుచుండవలసిన ఆవశ్యకము కలిగినది. ఈనిత్య ధన ప్రవాహమునే "Drain" అని మనదేశనాయకులు ఆర్థిక శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఈవడ్డీని ప్రతి సంవత్సరమును చెల్లించు సందర్భములో మరల క్రొత్తఅప్పులు చేయుటయు, ప్రజలపై క్రొత్తపన్నులు విధించుటయు ప్రభుత్వమువారి కవసరమగుచున్నది.

పైనచెప్పబడిన విషయములనుబట్టి మనము తీయవలసిన పర్యవసానము లీక్రింద పొందుపరుచుచున్నాము:—

1. మనదేశపు ప్రభుత్వఋణములో చాలభాగము ప్రతిఫలము నిచ్చుపనులకొరకై ఖర్చుపెట్టబడి నప్పటికిని నిజముగ దానిని ఫలప్రదమగు అప్పుగా పరిగణించుట కవకాశములు తక్కువగా నున్నవి. ఉదాహరణము: రైల్వేలు కట్టుటకై ప్రభుత్వమువారు సుమారు 600 కోట్ల రూపాయిలు అప్పుచేసి యున్నారు. దానిపై 1924-25 సం.పు లెక్కల ప్రకారము వచ్చిన ప్రతిఫలము 101½ కోట్ల రూపాయిలు. కాని ఈప్రతిఫలమును పొందు

టకు 98 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టబడినవి. కావున నికరాదాయము $3\frac{1}{2}$ కోట్ల రూపాయలుమాత్రమే. దీనిని బట్టి ఆ అప్పు ఎంతలాభదాయకమో గ్రహింపనగును.

2. మనప్రభుత్వఋణము చాలభాగము ఇంగ్లండులో చేయబడినది. ఈ ఋణమునకై ప్రతిసంవత్సరము వడ్డీ మనము చెల్లించవలసియుండుటచే మనదేశము నుండి సరకులను ఎగుమతి చేయవలసియున్నది. ఇది దేశముయొక్క ఆర్థికదుస్థితికి తోడ్పడుటయేకాక మన వర్తకవ్యాపారాభివృద్ధికి ఆటంకముగ నున్నది. ఇంగ్లండులో చేయబడిన అప్పువంతను మార్చివేసి హిందూదేశములో రూపాయ అప్పుగాచేసిన మనకు చాల లాభదాయకము. ఇకముందు ప్రభుత్వమువారికి ఋణము కావలసినచ్చినప్పు డెల్లను హిందూదేశమునందే దానిని నేకరించుటకు ప్రయత్నించి, ఇక్కడ కావలసినంత సొమ్ము రాకపోయినప్పుడే ఇతరదేశములలో దానికొరకై ప్రయత్నించవలెను.

3. ప్రభుత్వఋణములో సుమారు 170 కోట్ల రూపాయలు లాభమును, ప్రతిఫలమును నీయనట్టి పనులకొరకయి చేయబడినది. ఈయప్పు హిందూదేశపు లాభముకొరకుగాని, రక్షణకొరకుకాని, ఔన్నత్యము కొరకుకాని చేయబడియుండక కేవలము ఇంగ్లండుదేశపు లాభముకొరకై చేయబడినది. కాన ఈ అప్పు భారము నంతను ఇంగ్లండుదేశస్థులనే భరించునట్లుచేయుట న్యాయ్యము. ఇదికాక ప్రతిసంవత్సరమును మిలిటరీఖర్చుల కొరకై అప్పుచేయబడుచున్నది; మిలిటరీఖర్చు హెచ్చు చేయబడుచున్నది. ఇట్లు 1914 నుండి ఇప్పటివరకు సుమారు 10 కోట్ల రూపాయలు హెచ్చుచేయబడినది. ఇదికూడ హిందూదేశమున కేవిధముగను లాభములేని అప్పే. దానినికూడ బ్రిటిష్‌వారే భరింపవలెను.

4. ప్రభుత్వమువారు తమఋణమును వీలైనంత వరకు తగ్గించుటకు ప్రయత్నింపవలెను. ఎంత ఎక్కువ ఋణముచేసిన అంతవరకు మనదేశస్థులపై మోచుటకు వీలులేనట్టియు, ఎందుటకు వీలులేనట్టియు బరువును పడవేయుటయేయగును. ప్రభుత్వము ఋణములకు సంబంధించిన ప్రధానసూత్రములను మనస్సునం దుంచుకొని ఋణమునుచేయుట చాలముఖ్యము.

---

## పొ ల య లు క

బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు

పనిపాటలను దీఋమి నటెంచి, క్రీగంటఁ జూచి, తగ జూచినఁ జూడ్కి మలిపి
సాకునగ బిలిచి, ముచ్చటలాడ, వెలిఁబాఱు చిఱునవ్వుతెరల వాతెఱ నడంచి
తళుకుఁజెక్కిలికిఁ జక్కిలిగింత నిడ, నింక "నొట్టుసుమీ" యంచు నోసరించి
అడుగులం బడి, బాస లిడఁబోవ, "నీ వెంత కేనిఁ జాలు" దని, సిగ్గొని తొలఁగి
అట్టె చని, కౌఁగిటం జేర్చినంతఁ గన్ను-గొలుకుల నీరు నించి, కాంతులఁ గరంచు
చెలుల పొలయల్కలే ప్రేమజీవకళలు-పానకమునకు మిరియంపుఁ బసలుబోలె.

---

## గు ణా ద ర్శ ము *

ఆశౌర్యం బాసత్త్వం
బాశీలం బాపరాక్రమాభీలత్వం
బాశుద్ధవ్రత మెందు న
నాశములని భీష్ముఁ జెడ్డ నమ్మితిమిగదే.
—భీష్మపర్వము, ప్రథమా. 56.

అళియరామరాజుయొక్క జీవితకథను సమగ్రముగ నాలోకించినపుడు రాయలకాలమునాటి సంఘపరిస్థితులు, రాజ్యతంత్రాదర్శములు, దండనీతి, విద్యావైశద్యము, లలితకళాకౌశలము, ప్రజల యార్థికవ్యాపారముల పెంపు, సనాతనధర్మానుష్ఠానములు, రాజభక్తి, పరార్థచింతనము ఇవియన్నియు ముకురమున ప్రతిఫలించినట్టు కననగును. తన తొంబదియారవయేట రామరాజు ఖడ్గము చేతబూని వారించినను వినక శత్రువుల నడుమ జొరబడి ముఖాముఖి వారితో పోరదొడగెనన్నపుడు ఆ కాలపు జనసామాన్యముయొక్క శరీరపాటవమును, ధైర్యసాహసములును నిట్టివని యూహింపనగును. దేహము కేవలము సాధనమని భావించి సమయమునకు పనికివచ్చునట్టు దానికి శక్తిని సేకరించు రహస్యము వారు చక్కగ నెరిగియుండిరని యూహింపవలసియున్నది. తిరుమలరాజుసహితము తొంబదిరెండేండ్లు బ్రతికినాడనుట యీయూహకు మరియొక యాధారము. ఆ కాలపు సమరనీతికి ధీరోదాత్తత లక్షణమనుట విశ్వనాథుని జీవితము వేనోళ్ల ప్రకటించును. ప్రజలలో నాకాలమున చదువను వ్రాయను తెలిసినవారి సంఖ్య యెక్కువ కాకపోయియుండవచ్చును. అయినను వారిచిత్తముల సంస్కరించు శక్తి నొసగు బోధనోపాయములు వివిధములై ప్రబలి వారి తెలివితేటలు మెరుగందియుండవలెను. ఇట్టి బుద్ధిప్రభ సామాన్యముగ రాజ్యమెల్లెడల వ్యాపించియుండదేని 'ఆముక్తమాల్యద', 'వసుచరిత్రము', 'కళాపూర్ణోదయము'వంటి యుద్గ్రంథములు రచింపబడుట యసంభావ్యము. రాజ్యముచుట్టు సముద్రతీరముల వర్ధిల్లుచువచ్చిన యరువది రేవుపట్టణములు అప్పటి వాణిజ్యమునకును, ఆర్థిక సంపత్తి పెంపునకును సాక్షులు. శిల్పచరిత్రములవంటి లలితకళలు సహితము చక్కగ పోషింపబడుచుండెననుటకు హంపి, లేపాక్షి, తాటిపత్రి, మధుర, తిరుచునాపల్లె వంటి స్థలముల మిగిలియుండు నాటి దేవాలయములలోని పనితనము చెప్పకచెప్ప సాక్ష్యమై పరగుచున్నది. పరార్థసంప్రదాయమే గురిగాగల రాజ్యతంత్రమున దైవభక్తియు, పరార్థచింతనమును సహజముగ నెలకొనియుండెననుట విశేషముకాదు. జనులయం దప్పటి

---

* ఆంధ్రగ్రంథమాలయందు త్వరలో వెలువడనున్న 'అళియరామభూపాలుడు' అను గ్రంథమునందలి చరమాధ్యాయము.

మహమ్మదీయ క్రైస్తవ మతసహనము వారి చిత్తవృత్తియందలి యుదారస్వభావమును ప్రకటించునట్టిది.

రక్షస్తగ్గియుద్ధానంతరము నల్గురు మహమ్మదీయ సుల్తానుల వర్తనమును దీర్ఘముగ విచారించి చూచితిమేని యిరుప్రక్కల వైరుల మనస్పర్థకు కారణము పరస్పరమత విద్వేషము కాదనుటయు స్పష్టమగును. అంతియగాక ఉభయజాతులవారికి నాకాలమున సామరస్యము నెలకొల్పి జాతీయతను నిర్మించవలెననుదీక్షను విజయనగరపు ప్రభువులు గురియుంచుంచి దానికై యలవరచిన యుక్తులు వారి యుదార దేశభక్తిని ప్రకటించును. ఈ వైఖరి విజయనగరయుగపు విన్నాణమునకే తిలకప్రాయమయినట్టిది.

రాజ్యతంత్రజ్ఞానమందేమి, అజ్ఞానమును సమయోచితముగ ననుష్ఠించి కార్యసిద్ధి కావించుకొనుటయందేమి, సంగ్రామక్రమమున సామాదిచతురుపాయములను సమయోచితముగ విన్యసించుటయందేమి రామరాజు చన్నరాజన్యవర్గములో నద్వితీయుడనబరగెను. అదివరకు భరతఖండము నేలిన రాజాధిరాజులలో నీత డొక డనునంతటి పేరుగన్నవాడని హీరస్ (Heras) పండితుడు విమర్శించి నిర్ణయించినవాడు. సదాశివుని చెరయందుంచి తాను సింహాసన మెక్కుట యీభూపాలుని శీలమునకు కళంకముగ కన్పట్టునేమోకాని యప్పటి సమయసందర్భముల సమగ్రముగ సమీక్షించితిమేని యీవిపర్యాసము కేవలము సామ్రాజ్యసంగ్రహణార్థముకొఱకే చేకొనబడె ననుట వ్యక్తమగును. తుంగభద్రదయొడ్డున నిల్చి తనయొక్క బాహుదండముచే పైనుండి దిగివచ్చు తురకల నడ్డుకట్టి మరియొక దానిచే దక్షిణాపథమునందలి తీర్థక్షేత్రముల కభయదాన మొసగిన యీరాజన్యుని వ్యక్తిదృశ్యము ఒక్కటేసారి విభ్రమాశ్చర్యముల కల్గించునట్టిది. ఇట్టి క్షాత్రసాహసముల నడుమ హిందూమహమ్మదీయసామరస్యమును ప్రజల మనసున పుట్టించి పోషించవలె ననుకార్యదీక్ష ఆమహామహుడు తనలో పెంచుకొన్న దేశభక్తియొక్క సమగ్రతను చూపును. ఇంతటి సామ్రాజ్యసంసారమును నిర్వహించుటయందు విసుగక సందుజేసికొని వీణె నెత్తి స్వయముగ శ్రుతిగూర్చి పాడి రమింపనేర్చినవాడీ నెఱజాణ. సంస్కృతాంధ్రవాఙ్మయమున నారా జలవరించిన రక్తి భట్టుమూర్తివంటి కవిపుంగవుని తన యాస్థానమున కలంకారముగ ప్రతిష్ఠించి 'రామరాజభూషణు' డని బిరుదొసగిన వితరణ ప్రకటించును. ఈవివిధములైన సన్నాహములందును, వేడుకలయందును పరార్థమును మరువక, వేదాంత చింతనమే గురిగా నంతర్ముఖుఁడై గురుసన్నిధియందు శాస్త్రవిచారముల సల్ప రాజధానినే వదలి అపుడపుడు విశ్రమించుకొనుట కలవడిన విచారపరుడీ వీరవరుడు. తన జీవితపు సోపానపరంపరలో ఒక్కొక్క మెట్టున నార్షధర్మమునే యనుష్ఠించి వర్తించిన సదా

చారపరాయణుడు. ఇతనికి తుదకు లభించిన మరణయోగము సహిత మతిసుందరమై ఘనమై యీ క్రింది భారతవాక్యముల కాచంద్ర తారార్కముగ లక్ష్యమై పరగునట్టిది:

వనమయూరవృత్తము

"పార నొడ లస్త్రపరిపూతముగ ధీరో
దారతఁ బిజెందికి బరం బిడక దృప్య
ద్వైరికతి నొంచి తెసవా రసుటమే లు
ర్వీరమణకోటి కని వేదములు సెప్పఁగ్.

కందము

దానాద్యుత్తమ కర్మవి
ధానంబుల బనియుగతు లుదా త్తరణమునం
జా సేర్చువానిచనియెడు
మానితగతిఁ బోలవంద్రు మహనీయాత్ముల్.

—భారతము, స్త్రీపర్వము, ప్రథమాశ్వాసము.

---

# శతకమంజరి - భక్తిసంపుటము

వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, ఒంటిమిట్టరఘువీర, నారాయణ, శ్రీకాళహస్తీశ్వర దాశరథి, రంగశాయి, శ్రీరామతారక, రామచంద్రశతకములు పది యిందు గలవు. ఒక్కొక్క శతకమునకు పెక్కు మాతృకలతో సరిచూచి చేర్చిన పాఠభేదములును, ఆయా శతకకర్తల చరిత్రమును, రచనమును, విషయమును విమర్శించిన విపులమగు పీఠికయును గలవు. ముచ్చటలు గూర్చునట్లు మేలి క్యాలికోబైండు వెల రు. ౧-౮-౦. శతకములు విడిగను దొరకును.

# బ స వ పు రా ణ ము వెల 2-8-0

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి పరిష్కర్త:— వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పండ్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకు డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు, తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులు గురిపించినాడు. గ్రంథము భిన్నభిన్న మండలములకు జెందిన పెక్కు తాళపత్రమాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందుగలదు. ఆకాలపు టపూర్వసారస్వతచారిత్రకవిశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. అధునికకవికుమారుల కిది యత్యంతోపకారకము.




# మధుకరవృత్తి

డాక్టరు నిడమర్తి ఈశ్వరప్పగారు

కుసుమ గృహములఁ గప్పించి కూర్చికొన్న
రససమృద్ధిని నాయింటిపన నెఱింగి
వచ్చి దోఁచదవే పట్టపగలె నరుఁడ!
చాటుమాటున కయు బందిపోటుదొంగ!

పుష్పిణుల యధరసుధను బుక్కిటఁ గొని
వచ్చి దాఁచితి నాయున్కిపట్టునందు
ఎఱుఁగు మది నీచపుచ్ఛిష్ట మెందఱిదియొ
తగదు నీకన నది దేవతలకె ప్రీతి!

ఖగవాహనుఁడను "జడ్జి"
మొగమోటమి లేక తీరుపునుఁ జెప్పెను మా
కగణితమగు సతిమోవిని
"దగ దుచ్ఛిష్ట"మని యనఁగఁ దగ వేలనదో?

ఏనీతికథలను నెఱుఁగక పెళ్లునఁ
  జాటమే మాజాతి సంఘబలము?
సాముగరిడి లేక శస్త్రముం బట్టక
  యింటఁ జూపమె పోటుబంటుతనము?
కొలతబద్దలు లేక కోణసూచియు లేక
  కట్టమే చిత్రహా గదులమేడ?
రసవర్గ తత్త్వచర్చ యొకింతయును లేక
  యింటఁ గూరుపమె "పేటెంటు" * తేనె?

వృత్తి ధర్మమునం దఱపీనమైన
నెవరిపాటున కేవాడ నీడు లేదొ
అట్టి మేమన్న ఘనతకుం బుట్టినిండ్ల
మపని మాయన్న మే తిండు రంద అహాహ!

కొందరు మీవలె మాలోఁ
గొందఱుసోమరులుహాయిఁ గులుకుచునింటన్!
గొందఱకష్టార్జితములఁ
గొందరు లోకులు హసింప దృష్టాంతముగా.

మేము గణించిన మధువును
దామెల్లరుఁ దిందు రేటి ధర్మమొ మీకున్?
చామరుఁడు కూర్చ హేమము
"భూమీశుల పాలఁ జేరు"పాలు పందురొకో?

మాధుకరవృత్తి జీవించు మాయెడ నను
కంప లే కగ్గిఁ జూపించి కొంప దోఁచి
పీడనము పెట్టి స్వస్వమ్ము వేడ్క మీఱ
మెక్కునరులార! మీరలు రక్కసులరె.

ఇంచుకయుఁ గష్టమున కోడ ల్వంచ లేరొ?
జ్ఞానసంపన్నులయి శాస్త్రచర్చ లెఱిఁగి
సేయరాదె విశ్వామిత్ర సృష్టి నొక్క-
మధువు మము మించి, మమ్మేల మాపవలయు?

---

* వేఱొకరు చేయరానిది.

# భారతీయ మహిళామండలి




శ్రీమతి లీలాదేవిగారు

డాక్టరు జి. టి. రెడ్డిగారి సతీమణి. వీరు నర్సారావుపేటలో బెంచి మేజస్ట్రేటుగా నియమింపబడిరి.




శ్రీమతి యస్, జే. రత్నమ్మగారు

దక్షిణార్కాడుజిల్లా తిరుక్కలూరు తాలూకా బోర్డు గుమాస్తాగానిరి యీమె కీబడెను.




శ్రీమతి యు. అభయమ్మాళ్ గారు, యం. ఏ P.H.D.

ఈమె మైసూరు, మహారాణీకళాశాలయం దర్థశాస్త్రోపాధ్యాయగా నున్నారు. ఈమె లండనులో P H. D. డిగ్రీని బడసినది,



శ్రీమతి బాలాంత్రపు
మహాలక్ష్మీసుందరి కన్యగారు

ఈమె 'హిందూ సుందరి' పత్రికా సంపాదకురాలగు శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి కొమరిత. కాశీ విశ్వవిద్యాలయమున ప్రవేశపరీక్షలో రెండవతరగతియం దుత్తీర్ణ యయ్యెను. సంస్కృతాంధ్రహిందీ భాషలయందును ఈమెకు మంచి ప్రవేశము కలదు.




౧. కుమారి దీనా ఫ్రెంరోజు గాంధిగారు
(ఎల్ఫిన్‌స్టను బయస్కోపు మేనేజరు కుమారిత.)




౨. శ్రీమతి హంస దొరైకణ్ణుగారు

ఇంపీరియలు బ్యాంకిలో నుద్యోగమున నున్న శ్రీ దొరైకణ్ణుగారి భార్య.




3. శ్రీమతి కపిలమ్మగారు

అకౌంటెంటు జనరలుగా నుండిన శ్రీ క్షేమసేన రావుగారి సతీమణి,

ఈ ముగ్గురు చెన్ననగరమున గౌరవ-మేజస్ట్రేటులుగ నియమింపబడిరి.

రాష్ట్రవిభజనము అమలులోనికి రావలెననుషరతు చట్టములో చేర్చుటకు నాకెట్టి అభ్యంతర మగపడదు. అందులకిపుడైన కాలాతీతము కాలేదు. కావున ఇట్టి షరతును చట్టములో చేర్చవలె నని గాంధిమహాత్మునకు మనము సూచింపవలసియున్నది. ఈషరతుచేర్చుటవలన నూతనరాజ్యాంగవిధానము అమలులో పెట్టుట కభ్యంతర ముండదు.

ఆంధ్రరాష్ట్ర ప్రతినిధులుగ నియమింపబడినవారు తమధర్మమునుగుర్తించి సరిగా నిర్వహింపకపోవుట చాల విచారకరము, లజ్జాకరమును. ప్రజలలో నధికాంశము కోరువానిని సంపాదించుటకు ప్రయత్నించుట ప్రతినిధుల పని. ప్రజలకోరికలు తమకిష్టము లేకున్నను, ప్రజలకోరికలనుగూర్చి చర్చింప తమకు ధైర్యము చాలకున్నను, ప్రతినిధులు తమప్రాతినిధ్యమును మానుకొనుట సమంజసము.

అజ్ఞానమును, విశ్వాసమును కారణముగా పుట్టిన హిందూమహమ్మదీయభేద మంతరింపవలయుననిరి. సమష్టినియోజకవర్గ ముండుటయే శ్రేయమనిరి. సంఘవిభేదము లంతరింపవలెనని చెప్పుచు నిట్లు నుడివిరి:

భారతదేశమున ఒక్కజాతీయత యేర్పడవలెనని యును, మనమందరము ఏకముఖముగ పనిచేయవలెనని యును, మతవిషయమగు దురభిమానము పూర్తిగ వదలవలెనని ప్రతిహిందువును, మహమ్మదీయుడును స్పష్టముగ గ్రహించు టవసరము.

మారకపురేటు షి. 1 పె. 4 నుండి షి. 1 పె. 6 కు హెచ్చించుటయే భారతదేశముయొక్క ఆర్థికదుస్థితికి కారణమని పేర్కొనిరి. ఆరేటు మరల తగ్గినయెడల దేశదారిద్ర్యము తొలగుననిరి. భారతదేశము స్వాతంత్ర్యమును బడయుటకు సత్యాగ్రహమే శరణ్యమనిరి. సత్యాగ్రహ విధానమునకు భారతీయులు చక్కగా తయారయి యున్నారనిరి. బ్రిటీషువా "రీదేశములో నధిక వ్యయముతోగూడిన సైన్యమునుంచుకొన వలసిన యవసరముండగూడ" దనిరి. ఎల్లజాతులయు, తరగతులయు ప్రజలయొక్కయు హక్కులు సమానముగ నుండవలయుననిరి.

భాషాప్రయుక్త రాష్ట్రవిభజనము, బర్మా తిరుగుబాటు, బర్మా ఆంధ్రులు, గాంధి-ఇర్విను ఒడంబడిక భంగము, శాంతియుతమగు పికెటింగు, ఖద్దరు, గ్రామోద్యోగుల పునరుద్ధరణము, గ్రామపునర్నిర్మాణము మున్నగు వానిని గూర్చిన తీరుమానములు కావింపబడినవి.

---

# ఎనిమిదవ ఆంధ్ర హిందీమహాసభ – గుంటూరు (27-6-31)

## అధ్యక్షుండు: శ్రీయుత రామచంద్ర వామననాయక్ గారు

ముఖ్యములగు తీరుమానములు

ఆంధ్రదేశములో హిందీభాషను అభిమానభాషగా ప్రవేశపెట్టిన హైస్కూళ్లయొక్కయు, కాలేజీలయొక్కయు అధికారులను యీసభవారభినందించుచున్నారు. ఇంకను ఇట్టి యేర్పాటుగావింపనట్టి పాఠశాలాధికారులు తమపాఠశాలలందు వెంటనే యిట్టి యేర్పాటు గావింపవలసినదిగా గోరుచున్నారు.

గ్రామములందు నివసించుచున్న ప్రజలు హిందీ నేర్చుకొనుట కధికోత్సాహమును జూపుచున్నకారణమున తాలూకాబోర్డు అధ్యక్షులందరు తమక్రింద నున్న ప్రాథమికపాఠశాలలందు హిందీయుపాధ్యాయులను నియమింపవలసినదిగా ఈసభవారు సూచించుచున్నారు.

ఆంధ్రదేశమున కంతకు నొక ప్రత్యేక హిందీ ప్రచారకార్యాలయ మవసర మగుటచేత దక్షిణభారత హిందీప్రచార సభవారు బెజవాడయం దొకకార్యాలయశాఖ నేర్పాటు చేయవలసినదిగా యీ సభవారు గోరుచున్నారు.

భారతదేశముయొక్క వాణిజ్యరాజకీయసారస్వతసంబంధము లగు వ్యవహారము లన్నిటియందును గూడ ఆంధ్రయువకులు పాల్గొనగలుగుటకు హిందీభాషాజ్ఞానము అత్యంతావశ్యకమని యీసభవారభిప్రాయపడుచున్నారు. కాబట్టి ఆంధ్రదేశమందలి అన్ని పాఠశాలలందును, కళాశాలలందును హిందీభాషను నిర్బంధింపవలసినదిగా మద్రాసుప్రభుత్వమువారికిని విశ్వవిద్యాలయాధికారులకును ఈసభవారు విన్నవించుచున్నారు.

ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెసుసంఘములో సభ్యులుగా నెన్నుకోబడగోరువా రందరికిని హిందీభాషాజ్ఞానమును నిర్బంధింపవలసినదిగా యీసభవారు రాష్ట్రీయకాంగ్రెసుసభవారిని గోరుచున్నారు.

---

# అయిదవ ఆంధ్ర గాయకమహాసభ - గుంటూరు, 27-6-31

## అధ్యక్షుండు బ్రహ్మశ్రీ అజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు

ముఖ్యములగు తీరుమానములు

'సరిగమపదని' యను స్వరకల్పన సభలలో జొత్తిగాపనికిరాదని చెప్పువారి మాటలను నిరసించుచు సమయానుకూలముగా స్వరమును సభలలో నుపయోగించుటయే పాటకునికి నుత్తమమార్గమని ఈసభవారు అభిప్రాయపడుచున్నారు.

ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు సంగీతముకూడా తమవిద్యాప్రణాళికయందు చేర్చినను ఆంధ్రదేశమున కళాశాలలయందును ఉన్నతవిద్యాలయములయందును నిప్పటికిని ఆచరణ పెట్టలేదు. కాన వెంటనే అమలు పెట్టుటకు ఆంధ్రయూనివర్సిటీవారిని ఈసభవారు కోరుచున్నారు.

గ్రామఫోను సంగీతరికార్డులమీదను, విదేశీయులచే తయారుచేయబడ్డ సంగీతపరికరములమీదను పన్నువేసి ఆరాబడిని దేశీయసంగీతమునకై వినియోగించవలెనని గవర్నమెంటువారిని ఈసభవారు కోరుచున్నారు.

---

# పదునాలుగవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

గుంటూరు (30-6-1931)

శ్రీయుత బుఱ్ఱా శేషగిరిరావుగారు విజ్ఞానదాయకములగు విషయములు బహుళముగ గల తమ యధ్యక్షోపన్యాసమున గ్రంథాలయాభివృద్ధినిగూర్చి పెక్కుసలహాల నొసగిరి. గ్రంథాలయముల ప్రకృతస్థితి నిట్లభివర్ణించిరి:

మరియొకసంగతి. ఈ యుద్యమము ప్రారంభించిన రోజులలో ఒకరినిమాచి ఒకరుగా పలుతావులలో గ్రంథాలయములు స్థాపించిరి. క్రీడాసంఘములు, విలాసపు కబుర్లక్లబ్బులు, యువజనసంఘములు, నాటకసమాజములు మొదలగు విలాసలాలసమాజము లేర్పడినట్లే, అదియొక విలాసముగానో, నాగరికతా సూచికగానో, మరియొక వ్యాసంగమో, వ్యాపారమో లేకనో, నలుగురిలోనూ పెద్దలనిపించుకోవలె ననియో ధనికులు కొందఱజ్ఞానులు పెట్టుబడి పెట్టి యచ్చటచ్చట గ్రంథాలయ స్థాపనమునకు తోడ్పడి వార్తకెక్కిరి. అంతటితో నంతవరకు వారి జీవితములు ధన్యత గాంచినవి. కాని యట్టి గ్రంథాలయములు జ్ఞానపరులను నియంతలు లేక శీఘ్రముగా క్షీణించినవి. దానంజేసి యజ్ఞానులగు ధనికులవలని యార్థికప్రోత్సాహ మీయుద్యమమునకు సన్నగిల్లినది. ముచ్చటకొరకు తెరువబడిన గ్రంథాలయములు కొన్ని కొన్నిచోట్ల విలాసవంతులగు యువజనుల హేలారంగములై చిక్కియు చిక్కుచును వన్నె దక్కియున్నవి. ఇట్టివే "రిక్రియేషను క్లబ్బు"లను కబుర్లక్లబ్బుల యధీనములోనున్న గ్రంథాలయములు. అవి జీవచ్ఛవములై కొన్నిగ్రామములలో కలహకారణములు గూడ నగుచున్నవి. గ్రామమందలి యైక్యతయు విశిష్టతయు తమ జ్ఞానవిన్యాసవిధానముల వలన కాపాడి పెంపుచేయగల గ్రంథాలయములే వాటికి భంగము వాటిల్లజేయుట గలచోట నట్టి గ్రామాభిమానులు తగినచర్య తీసికొని వాటిని ఖిలపరచుటయే యుత్తమమని తోచక మానదు. అట్టి ప్రయత్నములో గ్రంథాలయోద్యమ కార్యకర్తలును సాయముచేయుట శుభకార్యమే. ఇంత కఠినముగా నీయవసరమున నేలచెప్ప సాహసించితిననగా కొన్నిగ్రామములలో ప్రభుశక్తియుతులగు పెద్ద లిట్టి కలహకారణములుగా గ్రంథాలయములను దించియుంచుట నాస్వానుభవములోనికి వచ్చినదిగనుక. కాగా గ్రంథాలయములను జనోపయోగకరములుగా చేయగలుగుట వాటిని స్థాపించువారి భావనలు, ఆశయములు, ఉత్సాహము, కార్యదీక్ష, జ్ఞానపరత్వము మొదలగు గుణగణములపై నాధారపడియున్నది. జ్ఞానపరత లేని పాలకవర్గము చేతిలోనున్న గ్రంథాలయ ముండినను లేకుండినను నొక్కటేయగును. "ప్రజయార్తి యెఱుగని ప్రభువు దూరమునుండి వచ్చేనే మచ్చోట చచ్చేనేమి" యన్నట్లు "ప్రజలధీశక్తుల ప్రకటింపజాలని పుస్తకాలుండేమి పోయేమి" యనవలసివచ్చును. లయిబ్రరీసంఘముల నేర్పరచు మార్గములనుగూర్చియు పుస్తకసంపాదన విధానములనుగూర్చియు గ్రంథపట్టికలు తయారుచేయుటనుగూర్చియు లయిబ్రరీ వార్షికోత్సవాతిశయములను గూర్చియు నుపన్యసించుటలో జూపిన కౌశలములో నొక పదియవపాలైనను మనగ్రంథాలయోద్యమ నాయకులు యేగ్రంథ మెట్లు చదివిన లాభించునో, ఏగ్రంథమందేమి చూడదగియున్నదో చదువదగినవి ప్రఖ్యాతిగాంచిన కావ్యములలో నెట్టి వివిధజ్ఞాన విశేషములు గలవో శోధించుటలో వినియోగపరచి యుండినచో మన గ్రంథాలయోద్యమము ప్రస్తుతపు జీవచ్ఛవస్థితికి వచ్చియుండకపోవును.

గ్రంథాలయములలో జ్ఞానదాయకములగు గ్రంథములకు స్థాన మధికముగా లేకుండుట విచారకర మనిరి. సుజ్ఞానదాయకములగు

గ్రంథములకే స్థానమును గలిగించవలయునని గ్రంథాలయాధికారులను హెచ్చరించిరి. ఈ పట్టుననే భారతినిగూర్చి యిట్లుపలికిరి :

పత్రికలలో "భారతి"కి ప్రచార మెక్కువ. "భారతి" వంటిదిగాని మరియొకరీతిగా సరియైనది గాని వేరొకమాసపత్రిక యాంధ్రమున లేనేలేదు. ఇంతవరకిది ప్రశంసనీయమే....ఎల్లింత మాపినను తీరదుగాని కలకత్తా మాడరన్ రివ్యూవలె నుత్తమ వైజ్ఞానిక పత్రికగా ప్రారంభింపబడిన మన "భారతి" క్రమక్రమముగా విలాసులాలసులకు వారికి వినోదము కల్పించు స్త్రీ పురుష భావనలను చేష్టితములను వర్ణించుపత్రికగా మారిపోవుచుండుట ముఖ్యముగా గ్రామములందు నివసించు మన యాంధ్రావళి దురదృష్టపరిణామ మనవలసి యున్నది.

వ్యాపారరీత్యా ఈ మార్పిట్టి లాభకారియై నను ప్రజలమనస్సులను విజాతీయములగు నడతిలలోనే లగ్నముచేయు సాధనమైనయెడల నిరూపకనవలాపఠనము వలె భారతీ పత్రికాపఠనమును చిత్తచాంచల్యకల్పనమునకు హేతువగును. పాశ్యములయందలి యిట్టి ధర్మరహస్యములు గ్రహించి గ్రంథాలయాధికారులు పాఠకుల మనంబులను జ్ఞానపరములగు రచనలలో హత్తింపవలసియుండును.

ఆంధ్రదేశమే యింకను ఉత్తమవిజ్ఞానమును పత్రికలద్వారమున పాఠకులకు ప్రసాదింపదగిన సుస్థితియందు లేకుండుటను వీరు గుర్తింపజాలరయిరి. విజ్ఞానధనుల ప్రాపున వెలయుచున్న మాడరన్ రివ్యూతో భారతి తులతూగ లేదనిరి. అట్లు చేయవలసినవారు దేశమున గల విద్యాధికులు. పత్రికలు కేవలము విద్యాధికుల విజ్ఞానమును దేశీయులకు పంచిపెట్టు సాధనములుమాత్రమే యగును. ఆంధ్రదేశమున విద్యాధికులు పెక్కురు లేకపోయిరి. ఉన్న కొలదిమందియు తమ విజ్ఞానమును దేశమునకు ప్రసాదింపక యుండుట పంతులుగారికి తెలియనిది కాదు.

తరువాత వీరు గ్రంథాలయములకు స్థానికవిభాగములు, అనగా, గ్రామీణనాగరికవిభాగములను సకారణముగ నిరసించినారు. ఇది మెచ్చదగినది. ఇట్టి విభాగమనర్థదాయకము. ఈవిభాగముకారణమున గ్రామీణులకును, నాగరికులకును విజ్ఞానాభివృద్ధి సమముగా గాజాలదు. గ్రంథాలయములయం దుండవలసిన గ్రంథములనుగూర్చి చెప్పుచు విద్యాశాఖాధికారుల సర్వజ్ఞంమన్యతను పురస్కరించుకొని గ్రంథాలయములకు నిషిద్ధములుగ భావింపబడుచున్న గ్రంథముల విషయమున నిట్లు సెలవిచ్చిరి :

ఇక గ్రంథాలయములకు రాజ్యాంగాధికారులామోదింపని గ్రంథములు సేకరింపగూడదని యొక నియమము బాధకమగుచున్నది. "బసవరాజీయ" మను గ్రంథ మేపితూరీదారుకథయో యని భ్రమపడి కాబోలు ఒక మాండలిక విద్యాశాఖాధికారి యొక గ్రంథాలయమునకు నిషేధించెను. ఇట్టినిషేధింపులు సాధారణముగా సూక్ష్మవిమర్శతో జరుగుచున్నట్లు కనబడదు. నిదర్శనములు సాయసుభవములోని విచట జేర్చుచున్నచో విద్యాశాఖాధికారుల సర్వజ్ఞత్వమునకు భంగము కలుగును. ఇక నిట్టినిషేధములు జ్ఞానపరులుగాని రివిన్యూ అధికారులు చేయుటకు దిగినచో గ్రంథాలయముల కెట్టిపాట్లు ఘటిల్లునో యూహింపుడు. కనుక గ్రంథసంపాదనమున గ్రంథాలయములకు గల స్వాతంత్ర్యమును సర్వవిధముల గాపాడుకొనదగియున్నది. దానికి ప్రతిబంధకమగు నెట్టి సహాయమును గ్రంథాలయాధికారు లంగీకరింపగూడదు.

పదపడి గ్రంథాలయాధికారులు, గ్రామస్థులు, గ్రంథాలయములవలన లాభములను గ్రామీణులు జక్కగా బడసి తమజ్ఞానసంపదను పెంపొందించుకొనుటకు నాచరింపవలసిన మార్గముల నిట్లు పేర్కొనిరి:

వృత్తివిద్యలను గూర్చిన గ్రంథములు కొన్ని, ఐతిహాసికములు కొన్ని, ప్రపంచవృత్తాంతబోధకములు కొన్ని, ఉత్తమసాహిత్యగ్రంథములు కొన్నియు నుండినచో నెట్టి గ్రంథాలయమైనను మిక్కిలి యుపయోగకారి కాగలదు. బడులలో గ్రామమందలి పిల్లలకు లభించుజ్ఞానమును వృద్ధిపరచు గ్రంథములును, గ్రామజీవితమును తనరీతిని సంస్కరింపగలయంశముల నుపన్యసించు గ్రంథములును ముఖ్యముగా పాఠకలోకములోనికి ప్రచారమునకు దెచ్చుటకై గ్రంథాలయాధికారులు ప్రయత్నపడవలెను. అట్టి ప్రయత్నములో ధనసహాయమునకు లోటుండదు.

గ్రామస్థులకు తమతమ గ్రామములం దభిమానములును, బాధ్యతలును దృఢపడుటకుగాను గ్రామచరిత్రలు దెలుపుపుస్తకములును గ్రామపరిపాలనవిధానములను గూర్చిన పుస్తకములును చేకూర్చుకొని గ్రంథాలయములం దిట్టి యంశములను గూర్చి ప్రసంగములును కావ్యశ్రవణమును చేయించవలెను. గ్రామములోని పురాతన కుటుంబముల చరిత్రలు సంపాదించి పూర్వులు గ్రామముకొరకు చేసిన దానధర్మములను విశదపరచవలెను.

గ్రామాభివృద్ధికి కావలసిన ప్రత్యేక కార్యములందు కావలసిన జ్ఞానము నిచ్చు గ్రంథములను గ్రంథాలయములోనుంచి వాటినిగూర్చి యవకాశము గలిగినప్పుడెల్ల ముచ్చటించుచుండవలెను. గ్రామస్థులకు తీరుబడి గలతరుణములు కనిపెట్టి పురాణపఠనములుగాని ప్రపంచచరిత్రముగాని కాలమానస్థితియందలి మార్పులను గూర్చిన ప్రసంగములుగాని గ్రంథాలయములో జమచేసి వారికి వినిపించవలెను. గ్రామమునకు వివిధవిద్యలలో ప్రవీణులను రావించి గ్రంథాలయమందు వారి విద్యాప్రకాశనములకు ప్రోత్సాహ మొసగవలెను. ఇట్లు గ్రంథాలయములను జ్ఞానమార్గమునకు దించినయెడల వాటికి బహుజనసమాదరణమును, గ్రామస్థులకు సత్సాంగత్యలాభమును సమకూరును. సత్సాంగత్యమువల్ల నిర్మోహత్వమును దానివలన చిత్తనిశ్చలతయు కలిగి జీవితము పవిత్రమై నడవడికి మూఢవిశ్వాసముల దాస్యమునుండి విముక్తి కలుగును.

అనంతరము, జాతీయత లోకకల్యాణకరమనియు, జనసామాన్యమునస్సు జాతీయతయందే లగ్నముకావలెననియు నుద్బోధించుచు నేటి మనయాంధ్రకవిత్వము స్థితి నిట్లు ప్రదర్శించిరి:

మన యాంధ్రకవిత్వము స్థితి చూడుడు. నాలుగు పద్యము లల్లగలయాతడు కవి. పూర్వ ఛందస్సులను కాదని, తా నేర్పరచుకొన్న ఛందోనియమ మైనను సరిగా పాటింపనేరక, భాషను భావములను విశదపరచుటకుగాక దాచిపెట్టి గ్రహణవీధికి రాకుండాచేసి యంతయును అనవసరముగ విచారసాగరములో ముంచువాడు నవకవి. ఆంగ్లమందలి లిరిక్కు పద్ధతి ననుకరింపబోయి దానితో టాగూరుమహాకవి రచనలయందలి వ్యంగ్యతను జోడించబోయి మన నవకవులు శృంగారరచనలను గావించి భావకవిత్వమని క్రొత్తనామకరణముచేసినారు. ఇది శృంగారమో, శృంగారాభాసమో, శృంగారవికారమో, విప్రలబ్ధమో, శృంగారప్రేరితకరుణమో లాక్షణికులే నిర్ణయింపజాలరు. ఒకటిమాత్రము నిజము. పరాకున వీథిగుమ్మములో కార్యాంతరమున నిలుచు యువతీమణు లీరచనలకు గురియగుచున్నారు, వీథిలో పోవు పిచ్చివాని రాతికి గురియైనట్లు. అయినను ఈరచనలలో మన తొల్లింటి ప్రాబంధికశృంగారకవులు చూపిన తేజముగాని, వైవిధ్యముగాని, చిత్రకళగాని, రసభావభాషానాగరికతగాని, గేయలాలిత్యముగాని, కరుణహాస్యపాండితిగాని తుదకు మానసతత్వవివేచనగాని సరిగా కనబడవు. ఇట్టి కవితలకు పత్రికాసంపాదకుల యనుగ్రహము ప్రకాశనసాధనమగుచున్నది.

"భారతీ" పత్రిక సాముగరిడీ యగుచున్నది. దానంజేసి జనసామాన్యమందు తగని ప్రచారము కలుగుచున్నది. ఇందలి నూతనత్వము 1. పూర్వభావను శ్రోత్రపద బంధములలో నిజేకించుట. 2. ఉత్తమనాయకనాయికా హీనభావ విన్యాసమును మననాటి మోటుజీవితము లకు పట్టించి వర్ణింపదలచుట. "సైకో అనాలిసిసు" మానసతత్త్వ విచారణదృష్టినే మాచివరకెడల ప్రపంచములో తీరనేరని యింద్రియలౌల్యమును భావప్రపంచములో తీర్చుకొన ప్రయత్నించుట యని తేటపడును. మన నవకవు లుత్సాహపరులు, స్వతంత్రులు, యువకులు, నియమములను శృంఖలములుగా తలచువారు, నవనవలాడు కోమలహృదయులు, శ్రోత్రప్రపంచమును నిర్మింపవలెనని యువ్విళులూరువారు, ప్రతిభావంతులు, పేరు ప్రతిష్ఠలు సంపాదించి కాలసముద్రపు టిసుక తిన్నెలలో తమ పదచిహ్నములను విడువదలచినవారు. సంసారయాత్ర ప్రారంభింప నూగులాడుచున్నవారు. ఇట్టివారే తమకవితలలో చలాక్షీవిలాసవిలోకనములే యారాధ్యదైవతములుగా భావించుకొని యింద్రియలోలత్వమే కవిత్వమని భ్రమపడి పరమేశ్వరుడు తమ కొసంగిన కళానైపుణ్యమును లోక కళ్యాణకరము లగు నుత్తమాశయములను వర్ణించుటలోను ఉత్తమార్థముల విశదపరచుటలోను వినియోగపరుపకుండుట మిక్కిలి శోచనీయమై యున్నది. మన యాంధ్రావని దురదృష్ట మనవలసియున్నది. ఇట్టి రచనలు ప్రస్తుతపు పరిస్థితులలో కేవల మసంగతములు. జాతీయ జీవిత పరిణామములు మిక్కిలిగా కలిగి యాంగ్ల దేశమును ప్రధాన తరగతి రాజ్యముగా చేయవలసిన రోజులలో స్పెన్సరు మిల్టనుకవులు, మన నవకవులవంటి విద్యాపరులగు యువకు లెట్టి యాశయాను ప్రాణితములగు కవితలను మెరయించిరో మన నవకవులు విశేషించి చదివిన బాగుండును. కాకున్న తొల్లింటి యాంధ్రకవి శేఖరులు తమ కవితలలో మెరయించి యుండినట్టి లోకజ్ఞతనైన పరిగణించి కార్యశూరతకు చదువరుల మనస్సుల దీకొల్పుగల రచనలు చేసి తామే సంచార కార్యాలయములై గ్రంథాలయములను బలపరచి జన సామాన్యమున కుపకరించి తమ యార్థికాశయ సాఫల్యముగూడ గాంచగల్గుదురు గాక యని యుద్బోధించు చున్నాను.

కవిత్వ మిట్టి స్థితికి వచ్చుటకు విద్యాసంస్కారరాహిత్యము, విషయవ్యవస్థ లేమి కారణములు. కాని వెనుకటి ప్రబంధముల వంటి గ్రంథముల రచియింపకున్నను నేటి యువకులయందును రసవత్కవిత్వము చెప్ప గలవారు పలువురు గలరు. కవిత్వమందలి గుణముల నరయుటకు గ్రంథవిస్తార ముపకరింపదు. దోషభూయిష్ఠమగు కవిత యేకాలమునను గలదు. ఆదరములేక యట్టికవిత నశించి యుండును. కాన నేడు కానరాని యట్టి కవిత్వము లేనేలేదనియు, నేడే యట్టికవిత పుట్టుచున్నదనియు విచారింప బనిలేదు. అనాదిగ నాంధ్రకవిత యుత్తమమధ్యమాధమవ్యవస్థల నొప్పుశృంగారమునకు గురిమైయుండుట సత్యము. కావున నిపుడు లోకకళ్యాణకరములగు నుత్తమాశయములను బోధించుకవిత యావశ్యకము.

మఱియు నెల్లశాస్త్రములును కవితాబద్ధములయి వెలసియుండుటను సప్రమాణముగా దెలిపిరి. గ్రంథాలయ స్థాపన పరిపాలనాదులు విద్యావిధానముగా మార్పుచెందవలయు ననిరి. ఈమహాసభవారు కావించిన తీరుమానములలో **ముఖ్యములు :**

౧. స్థానికసంస్థలు, స్థానిక ప్రజలు ఆంధ్రదేశమందున్న అన్నిపట్టణములయందును పల్లెలయందునుగూడ గ్రంథాలయములను కాని పఠనమందిరములను గాని స్థాపింపవలెను.

౨. గ్రంథాలయములకు స్థానికసంస్థలు ధనసహాయ మొనర్చుట చాల అవసరము. అట్టియెడ ప్రభుత్వము వారు జోక్యముకలిగించుకొని అడ్డు తగులకుందురుగాక!

౩. గ్రంథాలయములకు ప్రభుత్వమువా రొసంగు చున్న ధనసహాయ మత్యల్పము. ఏతత్సహాయమును పొందుచున్న స్వల్పసంఖ్యాకములగు గ్రంథాలయములకు సహిత మయ్యది విశేషించి ప్రయోజనకారిగా నుండుట లేదు. కావున గ్రంథాలయముల సహాయార్థము ప్రభుత్వమువారు ఎక్కువ సహాయము చేయవలయును. అద్దానిని (కఠిన) నియమబద్ధత లేక యొసంగు చుండవలయును.

౪. పుస్తక భాండాగారములను, పఠనమందిరములను ౧౮౬౦ సం. ౨౧ నెం. ఆక్టుననుసరించి రిజిష్టరు చేయుటకు చెల్లింపవలసిన రుసుమును లేకుండగనే రిజిష్టరు చేయించుటకు ప్రభుత్వమువా రంగీకరించవలెను.

దొరతనమువారిచే ప్రచురింపబడు పారిశ్రామిక ఆరోగ్యవిషయక ప్రచురముల నన్నిటిని, జిల్లా గెజటులను, ఆంధ్రభాషయందు ముద్రింపబడు గ్రంథములపట్టికలను ఆంధ్రదేశమందలి గ్రంథాలయము లన్నిటికిని ఉచితముగా ప్రభుత్వమువారు ఒసగవలెను.

ఆంధ్రదేశ మధ్యమున అనుకూలమైన స్థలమందు ఆంధ్రభాషయందు ప్రచురింపబడు గ్రంథముల నన్నిటిని, చెన్నపట్టణ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమందలి యితర అముద్రిత గ్రంథప్రతుల నన్నిటిని జేర్చి, ఆంధ్రదేశమందలి యితర గ్రంథాలయములకు సహాయభూతముగ నుండునట్లు గ్రంథాలయము నొకదానిని ప్రభుత్వమువారు నెలకొల్పుట అత్యావశ్యకము గనుక అట్టి గ్రంథాలయమును త్వరలో ప్రభుత్వమువారు స్థాపించవలయును.

౫. ఆంధ్ర దేశమున గ్రంథాలయోద్యమమును స్థాపింపజేయుటకును, గ్రంథాలయములను సర్వజనోపయోగకరముగను జనాకర్షకముగను చేయుటకును కావలసిన విధానమును దేశమందంతటను వ్యాపింపజేయుటకు నేర్పడిన ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమును పునరుద్ధరించుటయును, "గ్రంథాలయ సర్వస్వమును" తిరిగి ప్రారంభించుటయును ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమాభ్యుదయమునకు అత్యంతావశ్యకము గనుక, ఆంధ్రులెల్లరు అట్టి ప్రయత్నములకు తోడ్పడవలయును. ఆంధ్రదేశమందంతటను గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటకై సంచారకార్యదర్శి నొకనినైన నేర్పాటు చేయవలయును. దానికి కావలసిన ద్రవ్యమును సమకూర్చుటకు అందరును సహాయపడవలెను.

౬. మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయములో నున్న, ఆంధ్రదేశపు ప్రాచీన చారిత్రకసాంఘిక సారస్వతాది చరిత్రాంశములకు నిధానమనదగిన లోకల్ రికార్డ్సు వాఙ్మయము చాల జీర్ణదశలో నున్నను, అమూల్యములు అలభ్యములై యున్నను, వాని నుద్ధరించి ప్రచురింపవలసినదిగా పెక్కు రోజులనుండి ఆంధ్రులు కోరుచున్నను ఇంతవరకట్టి ప్రయత్నమును గావింపని మద్రాసు ప్రభుత్వమువారి చర్యకు విచారపడుచు, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారుగాని అథవా ఆంధ్రమహాశయులైనను వాని నుద్ధరించుటకు వెంటనే పూనుకొందురుగాక!

౭. ఆ యా జిల్లా కాంగ్రెసు సంఘములవారు గ్రంథాలయములను పునరుద్ధరించుటకుగాను జిల్లా గ్రంథాలయసంఘములను విద్యాభిమానులగు సభ్యులతో నేర్పాటు చేయవలయును.

---

# నాటకకళాపరిషత్తు

గుంటూరు-౧౯౩౧.

గుంటూరున జరిగిన ఆంధ్రనాటకకళాపరిషత్సమావేశమున, ౕ తదధ్యక్షులు శ్రీ హారీంద్రనాథచటోపాధ్యాయగారు భారతదేశమున సరియైన నాటకశాలయే లేదనియు, ఇతర దేశముల నాటకశాలలు ఎట్టి యల్లరి ప్రదేశాలలో నున్నను వెలుపలిధ్వని లోని వారికి వినబడని పద్ధతిని కట్టబడియుండుననియు, రంగస్థలము లనేకవిధములుగ క్రిందికి పైకి దింపుటకు, ఎత్తుటకు వీలయినవి, ఏవైపు కయినా తిరుగుటకువీలయినవి, పెక్కుభాగములుగ విడదీయుటకు వీలయినవిగ నిర్మింపబడియుండుననియు చెప్పుచు తెరలనుగూర్చి యిట్లు చెప్పిరి :

చవరంగా వుండే ఈ తెరల విషయం కొంత చెప్పాలి. భారతదేశంలో నాటకరంగాల మీద చూసే ఈచవరపు తెరల్లాంటి అసహ్యం పుట్టించే వస్తువులు మరెక్కడా చూడబోము. ఎందువల్ల నంటారా? చెప్తా వినండి. మొట్టమొదట వీటివల్ల మీకు స్వభావసిద్ధంగా వుండే దృశ్యాల్ని చూపించడానికి వీలవుతుంది అనుకుంటే వాట్లో కనుబడేంత కృత్రిమం, అస్వాభావికం మరెచ్చటా వుండబోదు. తెరల్లో ముఖ్యమైన ప్రధాన భాగం ఏదయ్యా అంటే ఆతెరరాసిన ఏ "నరసింహాచారి"గారి పేరో నడుంగా రాయబడిన భాగం (నవ్వు). అందుచేత దానిముందు మీరు విషాదాంతనాటకాన్ని ఆడితే సుఖాంతం గాను, సుఖాంతనాటకాన్ని ప్రదర్శిస్తే విషాదాంతంగాను మారుతుంటుంది. (నవ్వు) గోధుమవన్నె కాగితం తీసుకోండి. ఒకవైపు నునుపుగా, మెరుగ్గా వుంటుంది; రెండో వైపు గరుగ్గా వుంటుంది. ఒకదాని కొకటి అంటించండి. దీంతో మీరు వన్నెమి చేయమంటే అదిచేసి చూపగల్ను. మనోహరంగా, రమణీయ్యంగా, నయనానందకరంగా వుండే వనం చేయమంటారా? ఆకాగితంలోనె ఆకుల్లాగ చిల్లులు కత్తిరించండి. అంతేటనూ అందంగా అలాగె కత్తిరించండి. పసుపు, ఆకుపసుపు రంగుల సన్నని, పుల్లిపొర కాగితం వెనక భాగంలో అంటించండి. కత్తెరతో దానిపైన కొమ్మలు రెబ్బలు, పువ్వులు గుత్తులూ కత్తిరించండి. దానిమీద ఒక "గాజు" తెర వేయండి. వీలైతె నీలం-బూడిద రంగు, బూడిదరంగు-ఆకుపసుపు రంగుల రెండు 'గాజు' తెరలు వేయండి. వెనకవైపునుంచి మంచికాంతిగలదీపంతో ఆకులు వెలిగేట్టుచేయండి.

చిన్న చిన్న విషయాలని గూర్చి, ప్రత్యంశాన్ని గూర్చి వాటికిగల బాధ్యతను, ప్రాముఖ్యాన్ని గురించి మన మిక తెలుసుకోవాలి. వాయనలారా! ఏమం టె రంగస్థలంమీద కేవలం నటులె ప్రధానం గాదు. రంగం మీద కనుపించె ప్రతినీడ గూడా గమనింపవలసి వుంటుంది. ప్రతివెలుగూ, ప్రతికాంతీ, ప్రతికిరణము, ప్రతి కుర్చీ ప్రతివస్తువుకూడా ముఖ్యమైందే.

నటకులు పూసికొనవలసిన రంగులను కట్టవలసిన బట్టలను గూర్చి యిట్లనిరి :

వేషధారణంలో దుస్తులవిషయం చాలాజాగ్రత్త పడవలసి వున్నది. మీరాడే నాటకం ఏకాలందో ఆ కాలపు ఆచారవ్యవహారాల్ని బాగా అవగాహన చేసుకోవాలి. బహదూర్ షా వేషంలో పంపుషూలు (పాదరక్షలు) వేసుకొనివస్తే లాభం లేదు. మరో విశేష మేదంటె మన భారతదేశంలో నటులెల్ల ప్పుడూ ముఖాలకి రంగువేసుకుంటేనే కాని పనికిరామని నమ్ముతారు. ఎందుకో తెలియదు. పూతమీద పూతగా ముఖాలమీద అరంగంతా పులుముకోటం, ఆప్రయాసంతా అనవసరం

గా ఎందుకు పడాలి? అలా రంగుపులిమిన ముఖాలతో మీరుబాగా సున్నంపట్టించిన తమలపాకుల్లాగ వుంటారు. మన భారతీయులకు అద్భుతమైన దేహకాంతి వున్నది. ఇతర దేశస్థులు సైతం ఈ మన దేహ కాంతిని చూచి ఆశపడతారు. అలాంటి స్థితిలో మీ రా శ్వేత ముఖుల్లాగ కనుపించాలని వీళ్ళని అనుసరించడం ఎందుకు? మీముఖాల్ని శుభ్రంగా, పరిశుద్ధంగా కడుక్కోండి. నిర్మలినంగా వుంచుకోండి. కొంచెం బలంగా కనుపించాలంటే కొద్దిగా రంగువేయవచ్చు. రంగులువేసుకోటం ప్రత్యేకంగా అభ్యసించవలసిన విద్య. అది నేర్చుకుంటే ఒక్క గీటుతో ఎలా మార్చుకోవాలంటే అలా మార్చుకోవచ్చు వేషం.

శ్రుతినిగూర్చి యిట్లు పలికిరి :

హార్మోనియానికి నాటకాల్లో తావు లేకుండా చేయాలని కోరుతూవున్నాను. హార్మోనియం స్వయంగా నేనూ వాయించగలను. భారతదేశంలో అపస్వరాలకు, అపభ్రంశపు గొంతుకలకు హార్మోనియం కారణమైనట్టు మరేది కాలేదు.

కాబట్టి మీరు మీవోర్దికల్లో తంబుర శ్రుతి పెట్టుకొని పాటసాధన చేయండని నాసలహా. ప్రపంచంలో దాదాపు అన్నివాద్యాలి శేషాల్ని నేను విన్నాను. సంగీత శ్రవణంలో సూక్ష్మగ్రహణశక్తి కొంచెం నాకు వుందనుకు జీవాణ్ణి. కాని ప్రపంచములో వున్న సంగీత సాధనాలన్నిట్లోకి తంబూరవంటి సర్వోత్కృష్టమైంది లేదు.

హార్మోనియం వికారంపస్వరాల్ని మింగేసి, వీరిలో అనేకమందిని మంచి ఘనపాటకులుగ నమ్మించేటట్టు చేస్తుండడంవల్ల దాన్ని వదలలేకుండా వున్నారు.

ప్రకృతము మనకు ఎట్టినాటకము లావశ్యకములు? దీనినిగూర్చి ఉపాధ్యాయగారు

మనకు కొత్తనాటకాలు చాలా అవసరం. మన నాటకాల్లో యిప్పుడు దేవుళ్ళు, దేవతలు, రాజులు, రాణులు నిండివుంటారు. వీరందరికి వెంటనే పింఛను యిప్పించి సాగనంపటం చాలాఅవసరం. నీవే దేవుడవని మరువద్దు. నీలోనే దేవుడున్నాడు నీ నూతనపథం నీ దారి కడ్డంగావున్న పురాతన సాంప్రదాయా లన్నిటిని ఛేదించేస్తున్నదని నమ్మండి. మానవసమస్యలతో, మనుజమాత్రుల కష్టసుఖాలతో సంబంధం కల నాటకాలు స్వల్పంగావున్న అవే నిజంగా నాటకాలు. వీ రాజమందిరాలు, హంసతూలికాతల్పాలు, ప్రణయకలహాలు, టీ కాఫీలకు సంబంధించినవి కావు. సంఘాన్ని పీడిస్తున్న సమస్యలను చర్చించాలి.

పశ్చిమదేశాల్లో ప్రచారంలోవుండే గొప్పగొప్ప ఉత్తమనాటకాల్ని దేశభాషల్లోకి తర్జుమా చేయటానికి భాషాంతరీకరణసమాజా లేర్పడాలి.

అనిరి. తరువాత వారు కళ నిట్లు నిర్వచించిరి :

నాకు కళ అనగా ప్రబోధము. కళ ప్రబోధానికి విరుద్ధముకాదు. ప్రబోధము అనగా ఏమి? ప్రబోధము అన్నప్పుడు సంకుచితమైన జాతీయప్రబోధ మని నాఅభిప్రాయం కాదు. నాప్రబోధము సర్వకాలాబాధితమును శాశ్వతమును నగు ప్రవస్వరూపము. దానికి ఎల్లలుగాని సరిహద్దులుగాని లేవు. క్షుద్బాధ దానికి మాతృభాష. అట్టిది నాప్రబోధము. కళను గురించి మాట్లాడేవారంతా సౌందర్యాన్ని గురించి పలుకుతారు. సూర్యుణ్ణిగురించి, సూర్యాస్తమయాన్ని గురించి వర్ణించి వర్ణించి విసుకెత్తడం లేదా మనకు? ఎప్పుడూ పక్షుల్ని గురించి, పక్షుల గానాన్ని గురించి వ్రాసివ్రాసి విసుగుపడడంలేదా? అనాకారాన్ని కురూపిత్వాన్ని గురించిఆలోచించారా? అది మీ కండ్లకు పొడగట్టదా? ఖడ్గమృగాన్ని గురించి ఎన్నడైనా మీరు వ్రాశారా? వధ్యశాలకు కొనిపోద్యోపశువు పడు ఆవేదనను గురించి రాశారా? శిశువుయొక్క పక్కటెముకల దంతధావళ్యాన్ని గురించి ప్రశంసించారా? మరేవిటి రాశారు? మీరు వ్రాయబోవు నాటకాల కివి కథావస్తువులు గావా? ఈవిషయాలన్నిటినిగూర్చి చదివి, అనుభవించి తెలుసుకోనండి! బయటవున్న పరితాపంలో నిండా మునిగి తేలండి!

కన్నీటికాలువలో ఈవిచారాన్ని గొంతుకబట్టతాగండి! పిమ్మట యింట్లకుపోండి! "మొదటితరగతి రైలుబండిలో తల్లో చక్కటి రోజాపువ్వులు తురుముకొన్న ఒకస్త్రీ ...ని" గురించి వ్రాయకండి! ఆవిడ అలా సుఖంగా, అనాయాసంగా ప్రయాణం చేయటానికి అనుకూలంగా ఆర్రైలును నిర్మించిన కోట్లకొలది కూలివాండ్రను గురించి రాయండి!

ముందుముందు నాటకసంఘముల నెట్లు ప్రారంభించవలెను? హారీంద్రనాథ్ గారి యభిప్రాయమున నాటకసంఘాలు :

ఆర్ధురార్ధరు కలసి ఒకచిన్న సమాజంగా బయలు దేరండి. ఒక్కవంద రూపాయలు మూలధనం సంపాదించండి. మీరు శ్రద్ధాభక్తులుగలిగి వుంటే ఏధనికుడైనా మీకామాత్రం సహాయం చేస్తాడు. తెరలు మొదలైన వానికిగాను అందులో రు 50 లు వ్యయపరచండి. కొద్ది కొద్దిగా ప్రారంభం చేయండి. ఏదైనా నూతనంగా కని పెట్టండి. "ఒక పేదవాణ్ణి ఒక ధనికుడు బరువు మోయ మని నిర్బంధపెట్టడం, ఆపేదవాడు మోయలేనని మొత్తు కోవడం, అంత ఆధనికుడు కండ్లెర్రజేసి కాలాచేత తన్నటం, కొరడాతీసి కొట్టడం..." ఇలాంటి దేదో రాయండి. ఇలాంటివే వేలకొలది ప్రేక్షకులని ఆకర్షిస్తాయి. బహుశా మొదటిరాత్రి రు 200 లు మాత్రమే డబ్బు వసూలౌతుం దనుకోండి. ఈరెండు వందల్లో ఒకవందరూపాయిలు మీచిన్ననిధిలో వుంచుకొని మిగిలింది ఆర్ధురుసమానంగా పంచుకోండి. దీనివలనవ్యాపార దౌష్ట్యం నశిస్తుంది. దీని మూలంగా మీ కలలు కని, వాటిని రంగంమీద ప్రదర్శించటాని కవకాశం ఏర్పడుతుంది.

తరువాత పల్లెటూరి నాటకాలను ప్రశంసించినారు. స్త్రీపాత్రములను స్త్రీలే ధరించవలెనన్నారు. పదపడి ప్రతివ్యక్తియు, కళాభివృద్ధికి, తన్మూలమున దేశాభివృద్ధికి, స్వరాజ్యప్రాప్తికి స్వీయము స్వార్థరహితమగు సేవను కావింపవలయునన్నారు. వీరియుపదేశము లాచరణ యోగ్యములు.

ఈపరిషత్తువారు చేసిన తీరుమానము లలో ముఖ్యములయినవి :

## తీర్మానములు

విశ్వవిద్యాలయ పఠనప్రణాళికయందు నాట్య విద్యను ఒకపఠనీయ విషయముగా అంగీకరించి ఆంధ్ర నాటకకళాభివృద్ధికి తోడ్పడవలయునని, ఆంధ్ర విశ్వ విద్యాలయమువారిని యీసభవారు ప్రార్థించుచున్నారు.

నాటకసంఘములవారి ప్రయాణ సౌకర్యార్థమై రయిల్వేకంపెనీలవారు సామాజికులకు వారి సామానుల కునుతక్కువరేటు ఒసంగవలసినదిగ రైల్వేకంపెనీలవారిని ఈ సభవారు కోరుచున్నారు.

ఆంధ్రదేశములోని నాటకసంఘములవారును, నట కులును, వేషధారణమునకు అవసరములైన రంగులు, దుస్తులు మొదలైన వస్తువులనెల్ల స్వదేశమునందుతయారు చేయబడిన వానినే విధిగ ఉపయోగించి, తద్వారా స్వదేశీపరిశ్రమను ప్రోత్సహింపవలసినదిగ ఈ సభ వారు కోరుచున్నారు.

దేశకాలపరిస్థితుల కనుగుణముగను, నవీనాశయము లనుబట్టి నూతన నాటకముల రచనను ప్రోత్సహించుటకై ప్రతిసంవత్సరమును కనీస మూడు గ్రంథములనైన రచించుటకై గ్రంథకర్తలకు నిధినుండి పారితోషికము లొసంగు ఏర్పాటుచేయవలసినదిగ ఈ సభవారు కోరుచున్నారు.

# ఇరువదవ ఆంధ్రసాహిత్య పరిషన్మహాసభ

విశాఖపట్టనము 23,24-5-1931

మహాసభాధ్యక్షులు బ్రహ్మశ్రీ, మహా మహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి గారు పాండిత్య ప్రకర్షనుచాటు తమ యధ్యక్షోపన్యాసమున ఆంధ్రవాఙ్మయాభివృద్ధికరములగు కొన్ని మహోపదేశములను కావించిరి. అందు వారు మనవాఙ్మయమున మనకు లభింపని జ్ఞానమును ఇతరభాషలనుండి అనువాదముల మూలమున సంపాదింపవలసి వచ్చిన దనియు, అట్లు చేయు టంత ప్రశస్తము కా దనియు, స్వతంత్రముగ గ్రంథముల రచింపవలయు ననియు చెప్పిరి. అనువాద విధానమును పేర్కొనుచు, శాస్త్రగ్రంథముల యనువాదమును గూర్చి యిట్లులనిరి :

సంస్కృత వాఙ్మయమున విస్తృతముగ లేని ప్రకృతిశాస్త్రము మొదలగువానిని నాంగ్ల భాషలో నాయాశాస్త్రములలో నిష్ణాతులగువారు పూనుకొని దేశభాషలోనికి కనువదింప వలయును. అట్టివారి కాంధ్రభాషలో విశేషపరిజ్ఞానము లేకున్నను, వారి కభ్యాసములోనున్న గ్రాంథికముననఁగాని, వ్యావహారికముననఁగాని, గ్రామ్యముననఁగాని వ్రాయవలయును. క్రమముగా నవసరమైనచో ననుకూలమయిన భాషలోనికిఁ బరివర్తనము చేయుట సులభమగును. మొదట వ్రాయువారిని నిర్బంధింపఁగూడదు. అటులయినచో సరియైన జ్ఞానము మనకు రాఁజాలదు. ఆంధ్రభాషలోఁ బ్రావీణ్యము కలిగి యాయాశాస్త్రములందు విశేషపరిజ్ఞానము లేక సామాన్యజ్ఞానము కలిగినవా రాంధ్రభాషలోఁ దెచ్చుటకుఁ బ్రయత్నించిన సరియైనజ్ఞానము రాకపోవుటయగాక విపరీతజ్ఞానము గూడ వ్యాపించుట కవకాశము గలుగును. అది యనర్థదాయకము. సంస్కృతవాఙ్మయమున నున్న శాస్త్రగ్రంథముల పైని నేఁజెప్పిన విధమున నాయాశాస్త్రములలోఁ బరినిష్ఠితు లగువారి మూలమున నాంధ్రీకరింపఁబడవలయును.

ఆంధ్రీకృతములయిన న్యాయసూత్రములు, బ్రహ్మసూత్రములు, నిర్ణయసింధువు, గౌతమ ధర్మసూత్రములు, సంస్కృత లోకోక్తులు, కావ్యాదర్శము, దశరూపకము, మొదలగు గ్రంథము లపార్థాది దోషజుష్టము లని సోదారహరణముగ నిరూపించినారు. పదపడి

పైరీతి నాంధ్రాలంకారశాస్త్ర గ్రంథములను బాఠ్యగ్రంథములనుగా నియమించి విశ్వవిద్యాలయము వారాంధ్రభాషాజ్ఞానము నభివృద్ధిచేయఁ బ్రయత్నించుచున్నారు. ఈప్రయత్నమువలన నెట్టిఫలము సంభవించునో గమనించి యీపరిషత్తువా రుచితమార్గము నాలోచింపం బ్రార్థితులు.

అని పరిషత్తు వారిని హెచ్చరించినారు.

సంస్కృత నాటకాంధ్రీకరణములయందు గూడ "వ్యంగ్యభూతములగు రసభావాదులటులుండఁ జాలచోటుల వాచ్యార్థమే భేదించె"నని తామనుకొని కొండొక ఉత్తరరామచరిత్రానువాదమున నుండి యుదాహరణమును జూపి,

ఇటుల సరిచేసి చూచినచో నూటికిఁ దొంబదిలో భేద ముండకమానదు. కొంతకాలమున కీ యాంధ్రీకరణ

ములం జూచి తృప్తి నొంది సంస్కృతములోని సార మాంధ్రభాషలోనికి వచ్చినదనియు సంస్కృతముతో మన కవసరము లేదనియు నభిప్రాయము లోకమున వ్యాపించినచో మన జ్ఞాన మెంత హీనదశ పొందునో యని భీతి కలుగుచున్నది.

అనిరి. అనువాదముల జేయగోరువారు జాగరూకత వహించి యథామూలముగ నాంధ్రీకరింపజాలిన నే యట్టిపనికి దొరకొనదగుదురు. ఊరక సాహసించి వాఙ్మయమున కనర్థమును దెచ్చిపెట్టుట న్యాయ్యము కాదు.

ఇక వ్యాకరణములనుగూర్చి చెప్పుచు 'ఆంధ్రభాషానుశాసన'మను వ్యాకరణమును విమర్శించిరి. అందు సూత్రములకు నుదాహరణములకు గల సంబంధమును సందేహించి ప్రాజ్ఞుల నాలోచింపగోరిరి.

సంస్కృత వ్యాకరణమున మంచిజ్ఞానము గల వారి సహాయమును గూర్చుకొని వ్యాకరణరచన చేయ వలయునుగాని కేవలాంధ్రపండితులు చేయదగినపని కాదు.

అని వీరు తలంచుట యెల్లరు నంగీకరింపదగినది.

ఆంధ్రభాషకు సంస్కృతజ్ఞాన మావశ్యకమనుచు

వ్యాకరణజ్ఞానపూర్వక సంస్కృతజ్ఞానమును మన మభిలషింపవలయును. ఇప్పటి విద్యా సంవిధానమున సంస్కృతములో వ్యాకరణమును మూలద్రోసి కొంచెపు భాషాజ్ఞానమును సహకారముగఁ జేసికొని తెలుఁగునందు ప్రవీణులగుటయే కాక యుభయభాషాప్రవీణులు గూడ నగుచున్నారు. అట్టిజ్ఞానము భాషకు విశేషించి యుపకరించునది కాదు. ఇపుడు (1) శిష్టవ్యావహారికము (2) గౌరవనీయులు (3) వానినేయులు (4) ప్రాముఖ్యత మొదలగు పదములు నూతనముగ గ్రాంథికము లగుచున్నవి. ఇది భాషకుఁ గళంకమని నా తలంపు. ఇట్టి కళంకమును దొలఁగింపఁ బ్రయత్న మత్యావశ్యకము.

అనిరి. విద్యాసంవిధానమున నీదోషము తొలగుట పరమావశ్యకము.

ఈసభవారు కావించిన తీరుమానములలో ముఖ్యములు.

౩. విశ్వవిద్యాలయములలో నుత్తమాంధ్రపరీక్షల నేర్పాటుచేసియున్నారు గాన నట్టియుత్తమవిద్యాభ్యాసమునకు వలయుపుస్తకములను బండితులచే ననువాదము చేయించుటకును, రచింపఁ జేయుటకును, వాని నీపరిషత్తువారు సంస్కరించుటకును, వలయువానిని బ్రకటించుటకును నిర్ణయింపఁబడియెను.

౪. ఇదివఱకుఁ బ్రకటితములై యున్న పాత్తములలోఁ బెక్కులు దోష సహితములై యున్నందున వాని యొక్క సవరణ మీపరిషత్తు నిర్ణయించుటకును, ఈపరిషత్తు వారిచేఁ బరిష్కరింపఁబడిన గ్రంథములే పాఠ్య పుస్తకములుగా నుండునట్లు చేయుటకును నిర్ణయించుటయైనది.

౫. ఈపరిషత్తువారిచే నామోదింపఁబడిన పుస్తకములే పాఠ్యపుస్తకములుగా నుండునటులు నిర్ణయించుటకు విశ్వవిద్యాలయముల వారిని, పాఠ్యపుస్తక నిర్ణాయసంఘమువారి నీసభవారు కోరుచున్నారు.

౬. ఆంధ్రభాషా ప్రతినిధులుగా నేర్పఱుపఁబడిన వారిద్దఱిలో నొక రీపరిషత్తువారిచే నిర్ణయింపఁబడినవారుగా నుండ వలయు నని యీసభవారు విశ్వవిద్యాలయమువారిని గోరుచున్నారు.

౭. ప్రాచీన పుస్తకములలోని శృంగారవర్ణనము లశ్లీలము లని భావించుట యుక్తము కాదు కావున నందువిషయమై ప్రభుత్వమువా రెట్టినిబంధనముల మూలమునను నిషేధింపఁగూడ దని యీ సభవారు ప్రార్థించుచున్నారు.



## గడ్డము

**గడ్డంగల** మనిషిని చూశేటప్పటికి అనేక భావాలు మనస్సును ముట్టడించినవి. "గడ్డం" అని ఇంటిపేరు కలవాళున్నారు కాని వారందరికీ గడ్డా లుండవు. వారి వంశ మూలపురుషునకు గడ్డ మున్నదేమో చెప్పలేము. దేవుళ్లకు మ్రొక్కుకున్నవాళ్లు, భార్యలు కడుపుతో వున్నవాళ్లు, జబ్బుపడిలేచినవాళ్లు, క్షౌరమునకు మంచి రోజు కుదురనివాళ్లు, ఏదైనా పట్టుదల కొనసాగించ దలచుకొన్నవాళ్లు, దేశం విడిచి వెళ్లి చాలరోజులకు వచ్చినవాళ్లు, యోగాభ్యాసకులు, ఆధ్యాత్మికచింతాపరులు, బైరాగులు, ముసలివాండ్లు, ముసల్మాన్ సోదరులు సాధారణంగా గడ్డం పెంచుకుంటారు. గడ్డం లేకుండడమే అందమని యెంచే యీ నవనాగరకయుగంలో కూడా, గడ్డం పెంచుకోవడమే షోకని తలచి అలా చేసే వాళ్లు లేకపోలేదు. ఇప్పటివాళ్లకు కొంచెము గడ్డ మెదిగేటప్పటికి యేమిటో తోచక అయోమయమై, అది సెలూనులోనో, స్వయంక్షౌరంవల్లనో వదిలిపోతే గాని, ఛిద్రం వదలినట్లు నిద్రపట్టదు. ఐనా, మన హిందువులు స్వాభావికంగా నిరాడంబరులై, శరీర సౌందర్యమున కంతగా పోషణచేయరు కనుక ఎదిగినగడ్డాలు ఎక్కువ చూసినా కనిపిస్తుంటవి. కాని పాశ్చాత్యులలో అలాకాదు. క్యాథలిక్ ఫాదరీలను విడిచిపెడితే, గడ్డం గలవారు వారిలో చాలతక్కువ. ఫ్రెంచి రిపబ్లిక్కు క్రొత్త అధ్యక్షు డగు డూమరుకు చతురాకారముగల గడ్డము కలదట. అతనికే కాక అతను యెన్నుకొనిన ఫ్రెంచి రాజ్యాంగ సభలోని ముఖ్యసభ్యు లందరికీ అలాటిగడ్డాలే కలవట. ఇది చూచి ఇప్పుడు ఫ్రెంచిదేశంలో చాలామంది గడ్డాలు పెంచుకోవడమే Fashion గా యెంచుకొని గడ్డాల పిచ్చిలో పడ్డారట. ఎవరైనా ఒకరు నలుగురినీ ఆకర్షించే యేపని చేసినా అదెఅందరూ అంధగజన్యాయంగా అనుకరించడం మానవస్వభావంగా పరిణమించింది.

గడ్డములో ఏమున్న దనుకుంటాము. ప్రాచీప్రతీచీ దృగ్విభులకు గడ్డమే సరిహద్దు. యోగికిని యోధునకును గల భేదము గడ్డములో కేంద్రీకరింపబడ్డది. గడ్డంలోని తత్వాన్ని గ్రహించలేని మనము అది పెద్దల చాందసాలలో ఒకటి అనుకుంటాము. గడ్డమున్నవాళ్లలో మనకు తాతయ్యపోలికలు కనుపిస్తవి. బైబిలులో వచ్చే పాత్ర లన్నిటికీ గడ్డాలున్నై. మనఋషులంతా గడ్డాలు కలవాళ్లే. ప్రపంచములోని గొప్పమతా లన్నిటికీ మన ఆసియాఖండమే పురుటింటిఉయ్యాల. ఒకబుద్ధుడు తప్ప ఈమతస్థాపకులంతా గడ్డాలుకలవాళ్లే. బుద్ధుడికి గూడా గడ్డమున్నదేమో చెప్పలేముకాని అతనిప్రతిమలలోను పటాలలోను గడ్డమున్నట్లు కనుపించదు. మతస్థాపకులే కాక మతశాఖలను ఏర్పాటుచేసిన జ్వింగ్లి (Zwingli), కాల్విన్ (Calvin) వంటివారలుకూడా మంగలకత్తిని బహిష్కరించినట్లే కనబడుతుంది. గడ్డముమహాత్వలక్షణమేమెం! గాంభీర్యమునకు, యోగ్యతకు, అనుభవమునకు గడ్డము బాహ్యచిహ్నమేమెం. జనులను తరింపచేయ తలచిన మహనీయులలో ఏకొద్దిమందో తప్ప అందరూ గడ్డాలను ధరించినవాళ్లే. గ్రీకుకావ్యాలలోని జ్యూస్

(Zeus) దేవుడూ, ప్లేటో అనువేదాంతి, సోఫోక్లీసు అను నాటకరచయితే, ఆఖరికి కేవలకవియైన హోమరు, గడ్డాలతోనే చిత్రింపబడ్డారు. మన పురాణపురుషులలో శివునకు గడ్డమున్నది. విష్ణువునకు లేదు. అభినవ రష్యా ప్రవక్తయైన కార్ల్‌మార్క్సు గడ్డము ధరించకపోయి నట్లయితే తనకన్న యెంతో సమర్థుడగు లాస్సేల్ కంటె ఎక్కువపలుకుబడిని అనుచరులను సంపాదించలేక పోయేవాడే. టాల్‌స్టాయిగడ్డము రష్యాలో నవ్యమత విజృంభణమునకు మూలకందమైనది. రవీంద్రుని జ్ఞానా రణ్యము అతనిగడ్డములో నిమిడియున్నదేమో. ఒక్క మహాత్ముడే గడ్డంలేకుండా జగత్తుపైన మత్తుమందు చల్లగలిగినాడు.

ప్రతీచి ప్రపంచయోధులకు పుట్టినిల్లు. యోధా గ్రేసరు లెప్పుడూ గడ్డమంటే అసహ్యించుకొన్నట్లే కనబడుతుంది. అలగ్జాండరు, తనసైనికులు గడ్డాలు పెంచుకుంటే శత్రువులు దాన్నిపట్టి లాగి వశంచేసి కొంటారనే భయంచేత గడ్డాలు పెంచుకోకుండా ఆర్డరు చేశాడు. పీటరు తనరాజ్యంలోని గడ్డాలకు పన్నులు వేశాడు. పెలీయుకు గడ్డమంటేనే గిట్టేదికాదట. నెపోలి యను, సీజరు గడ్డాలను తీయించుకొనేవాళ్లు.

గడ్డములో నేదో మర్మమున్నది. ముఖం తీరును మార్చగలశక్తి దానికున్నది. అదియొక మాయవేషముగా నుపయోగపడగలదు. గడ్డమున్న వాళ్లంతా యోగ్యులని భ్రమపడగూడదు. ఇట్టిగడ్డాన్ని ధరించియే అజ్ఞానియు, క్రూరుడును గర్వియునగు రస్పుటిన్ అను రష్యన్ కర్షకుడు రష్యాప్రభుత్వమునకు సింహస్వప్నమై, దాని నాశ నమునకు కారకుడై, గొప్పరాజకీయనాయకుడు కాగలి గెను. గడ్డ మింత పనిచేస్తుందా అని ఆశ్చర్యపడనూడదు. జగన్మోహినియైన క్లియోపాత్ర కనుముక్కుతీరులో కాసంతవంకవున్నా ప్రపంచచరిత్ర తారుమారై పోయేదే అని జనవాక్యం లేదా?

మొత్తంమీద గడ్డం ఆధ్యాత్మికము. అది లేకుండ డం ప్రాపంచకము, పాంచభౌతికము. గడ్డం యోగి లక్ష ణం, అదిలేకుండుట యోధచిహ్నం. గడ్డం బ్రాహ్మం, సాత్వికము. అదిలేకపోవడం క్షాత్రం, రాజసం. గడ్డం వైదీకం—ఛాందసం. అది లేకపోవడం నియోగం—నీటు.

శ్రీకర్లపాలెం కుటుంబశాస్త్రి, బి. ఏ.

---

## తర్జుమా

హిలేరుబెల్లాకుగారు ఆక్సుఫర్డునందు 'తర్జుమా'ను గూర్చి ఉపన్యసించిరి. తర్జుమాకు మూడు ప్రధానసూత్ర ములున్నవట: చేయువాడు తన మాతృభాషలోనికి తర్జుమా చేయవలయును; తర్జుమాభాష సాధ్యమయినంత సమగ్రముగా లొంగుబాటున నుండవలెను; స్థల పరిమితి యు, రచనానియతియు భాషాంతరీకర్తను అరికట్టరాదు. ఈసూత్రములను బెల్లాకుగారు వివరించి ఉదాహరణ ములు చూపిరి.

భాషాసంప్రదాయము (idiom) తర్జుమా చేయుట నుగూర్చి ప్రత్యేకము ముచ్చటించిరి. సరిగా సూచిన భాషాంతర పర్యాయము లన్నవి (literary equivalents) లేవనిరి. ఇందులకు ఫ్రెంచి, ఇంగ్లీషు సమార్థకముల అన్యోన్య భావభిన్నతలు నిదర్శించిరి. ఫ్రెంచిభాషయందలి 'terre' అను మాటకు ఇంగ్లీషున 'land',—'soil',—'ground',—'earth' - ఇన్నిటిలో ఏదైనకావచ్చు; ఇట్టిమచ్చుకొన్ని నిదర్శనములు చూపిరి. ఇంకొక విశేషము: ఇతర భాషతో భాషాంతరీ కర్తకు అమితపరిచయ మున్నచో, అందలి భాషా సంప్రదాయము నతడు తనభాషయందు చొనిపిన, కంగా తేర్పడవచ్చును. మాతృకకంటె భాషాంతరీకర ణము దాదాపు సర్వదా పెద్దదిగనే యుండవలసియుం డును కాన పరిమాణము విషయమున స్వాతంత్ర్య ముండ దగునని నొక్కి చెప్పిరి. అవసరమైనయెడ రచనానియ తిని మార్చుటకును స్వేచ్ఛ యుండవలె ననిరి.

పద్యరచనను తర్జుమాచేయు విషయమునుగూర్చి చెప్పుచు, అది గద్యమున చేసిననే బహుశః సర్వదా యుక్తముగ నచ్చుననిరి. "పూర్వ మెన్నడు నెఱుగనంత యెక్కువగా జరుగుచున్నది యిప్పుడు తర్జుమా ; అంత

కంటె పాడుగ జరుగుచున్నదికూడ. చెవులకర్జుమాలు చాలప్రమాదకరములు; ఏలయన, అవి యితరజాతుల వాఙ్మయము గొప్పతనమునెడ అపనమ్మకము తెచ్చిపెట్ట గలవి" అని పల్కెరి.

---

## ప్రాచ్య పాశ్చాత్య గాంధర్వకళ

[టాగూరుగారికిని, ఎయిన్‌స్టీనుగారికిని జరిగిన సంభాషణ]

('కల్చరల్ వరల్డు' అనుపత్రికలో నీసంభాషణము ప్రకటిత మయినది.)

ఎయిన్‌స్టీను—(హిందూగాంధర్వమున) ఛందో నియతి చాల కఠినమైనదా?

టాగూరు— ఆ, అవును. పద్య నియమమును దాటిపోరాదు; ఎన్ని పోకడలు పోయినను గాయకుడు లయ, తాళమానము చూచుకొనుచునే యుండవలెను. అదియూ మారనిది. మీ ఐరోపీయ సంగీతమున లయవిషయమున స్వేచ్ఛ యున్నది; అట్లు 'రంజనము' విషయమున లేదు. భారతదేశమునవో, రంజనము విషయమున స్వేచ్ఛ యున్నది, లయయందు లేదు.

ఎయిన్‌స్టీను— భారతీయ సంగీతము మాటలు లేకుండ పాడవచ్చునా? మాటలు లేనిపాట అర్థమగునా?

టాగూరు—ఆ. మాకు అర్థము లేని శబ్దములతో పాట లుండును; ఆశబ్దము లూరక స్వరముల ఆనిక కుపయోగపడును. ఉత్తరహిందూస్థానమునసంగీతము స్వతంత్రమైనకళ; వంగదేశమునవలె పదములకు, భావములకు వృత్తి కాదు. అది చాల జటిలమైనది, సూక్ష్మమైనది; అది తానే యొక నిండైన మాధుర్యలోకము.

ఎయిన్‌స్టీను— అది బహు మేళకము (Polyphonic)* కదా?

టాగూరు— వాద్యములు వాడుదురు, కాని సమ్మేళ (Harmony) రచనమునకు కాదు; లయ కొలుపుటకును, విస్తరగాంభీర్యములు[అనురణన, రంజనములు] పెంపుచేయుటకును మాత్రమే అవి వాడుదురు. సమ్మేళనమువలన మీసంగీతమున ఆలాపము (Melody)† ఏమైన నష్టపడునా?

ఎయిన్‌స్టీను—ఒక్కొకప్పు డంత యూడుకపోవదు కాని, ఒక్కొకప్పుడు సమ్మేళము ఆలాపమును పూర్తిగ మ్రింగివైచును.

టాగూరు—ఆలాపమును, సమ్మేళమును చిత్రములకు రేఖలు, వర్ణములు నెట్లో అట్లు. ఒక సాదా రేఖాచిత్రము సమగ్రసుందరమై విలసిల్లవచ్చును; వర్ణము మార్చుటచే అది అస్ఫుటమై సమర్థత కోల్పడవచ్చును. అయినను వర్ణము రేఖల మేళగింపుతో, వానిగొంతునులిమి వానివిలువ చెడగొట్టకుండునంతవఱకు, గొప్పచిత్రముల నిర్మాణమునకు కారణభూతము కావచ్చును.

ఎయిన్‌స్టీను—మంచి అందమైన పోలిక యిది. వర్ణముకంటె రేఖ చాల పురాతనమైనదికూడ. మీ ఆలాపమున మాదానికంటె గొప్పతంత్ర మున్నటు లున్నది. జాపానీయసంగీత మట్లే కన్పించును.

టాగూరు—మా మనస్సులకు ప్రాచ్య సంగీతము విన్నపు డెట్లుండునో పాశ్చాత్య సంగీతము విన్నపు డెట్లుండునో విభజించి చెప్పుట కష్టము. పాశ్చాత్యసంగీతము విని నేను లోతులలో కదలిపోయితిని — అది గొప్పదని అనిపించుచున్నది నాకు; దానితంత్రము చాల విస్తృతమైనది; కల్పన (composition) చాల ఉదాత్తమైనది. మాసంగీతము నాకు మఱింత లోతులలో తగులును, అందలి రసస్ఫోరకత (lyrical appeal) నుబట్టి. ఐరోపీయ సంగీతము పురాణము వంటిది: దానికి

---

* పాశ్చాత్యసంగీతమున ఒక ఆలాపరీతికి సమ్మేళముగ ఇతరరీతులు ఒకే సమయమున కూర్చుచుందురు. ఇట్లు అనేక మేళగతులు ఒకేసారి జరుగుటను Polyphonic లేక Contrapuntal పద్ధతి యందురు. అట్టి యితర మేళమునకు Counterpoint అని పేరు.

† Melody అన్నది ప్రధానమైన మేళము. మన గేయ రచనయందలి 'ధాతువు' ఈ Melody కి పర్యాయమే. Harmony అన్నది దానికి తోడుగా మఱికొన్ని మేళములు కూడుట, సమ్మేళము.

విశాలమునుభక్తిక యున్నది; నిర్మాణమునది మతికగా నుండును.

ఐయిన్‌స్టీను—ఒక ప్రశ్న యున్నది, ఐరోపీయులము సమాధానము చెప్పజాలనిది — మేమంత వాడుకపడిపోయినాము మాసంగీతమునకు. మా సంగీతము ఆచారముగా వచ్చు అనుభూతియా, మూలవృత్తి యను మానుషానుభూతియా? 'సంవాద' 'వివాదము'లను భూతము లొనర్చుకొనుట యన్నది స్వాభావికమా, లేక అనుసూత్యారమగు ఆచారమా, యేమిటు లవలంబించునది? ఇది మేము తెలిసికోగోరుదుము.

టాగూరు—ఏమో కాని, పియానో మాత్రము నన్ను గందరగోళ పెట్టును. అంతకంటె ఫిడేలన్న నాకు చాల సంతోషము.

ఐయిన్‌స్టీను—చిన్నతనమున ఎన్నడును ఐరోపీయసంగీతమువినని భారతీయునికొకని కది వినిపించి ఆతని కెట్లుండునో పరీక్షించుట ముచ్చట గూర్చు విషయము. [హిందూసారస్వతానుబంధము, ౨౮-౬-౩౧]

జె. సి. కుమారప్ప గారు



ఆంధ్రదేశమున సంచారము చేయుచున్నారు. గురుశిష్యసంవాదము అను పేర భారతియందు ప్రకటితములగుచున్న వ్యాసములు వీరు వ్రాసి 'యంగ్ ఇండియా' యందు ప్రకటించిన వాని సారాంశములే.

## చిత్రపరిచయము

### వింత గడియారములు

ఇట్టి గడియారములను పారిసులో నొకబుద్ధిశాలి తయారుచేయును. యంత్రసాహాయ్యము లేక, పరికరములన్నిటిని తానే సొంతముగా చేసికొనును. ఈ గడియారములు కాలమును సరిగా తెలుపును.

౧. ఈగడియారము పొదువగల గాజుపాత్రలలో రసాయనమిశ్రణములు గలవు. గడియారమునందలి ముండ్లను నడపగలశక్తి యామిశ్రణములకు గలదు.

౨. ఈగడియార మొక చెట్టుకొమ్మలోను, ఒక బండిదారముతోను తయారుచేయబడినది. పరికరములన్నియు నాకొమ్మయందలి కఱ్ఱతో చేసినవి.

### వింత ప్రాకుడుజంతువు

'యేలు' (అమెరికా) విశ్వవిద్యాలయము వస్తుప్రదర్శనశాలయందు ఈ అస్థిపంజరము గలదు. ఇది ౮౦ అడుగుల పొడవు, ౧౬ అడుగుల ఎత్తు ౬౪టన్నుల బరువుగలది. ప్రపంచమునగల ప్రాకుడుజంతువులలో నెల్ల నిది పెద్దది. విశ్వవిద్యాలయశాస్త్రపరిశోధకు లిది ౧౨౦,౦౦౦,౦౦౦ సంవత్సరము లుండు ననియు, జీవించియున్నపుడు దీని బరువు ౩౮ మొదలు ౪౦ టన్నులవఱకు నుండెననియు నభిప్రాయపడిరి.

### పక్షులను మ్రింగు సాలీడు

దక్షిణ-అమెరికాలో నిట్టివి గలవు. అవి కాళ్లను ఏడంగుళముల మేర చాపగలవు, పక్షులనుపట్టిదిగమ్రింగును. అవి గూళ్లనుకట్టుకొనవు. కలుగులమొద్దుల క్రిందను రాళ్ల క్రిందనునుండును. ఇవి రాత్రులయందు సంచరించునవి. ఇవి విషజంతువు లేకాని మనుష్యులకుఅపాయకరములుకావట.

### మేడమీది తోట

లండనునగరమునందలి ఒక గొప్ప మేడపైనున్న తోట. ఇచ్చట చుట్టుప్రక్కల వ్యాపారము చేయువారందఱు వేసవిసాయంకాలముల నిచ్చట లేనీరు త్రావి వినోదించుచుందురు.

### స్వాతంత్ర్య దేవత

వాషింగ్‌టనులోని 'క్యాపిటల్ డోము' పయి నున్నది. ఈవిగ్రహము తల నలంకరించుచున్న యాతడు థార్లను పైరిసు. ఫోర్మను.




## శ్రీ భగవద్గీత

(సంస్కృతము, తెలుగులిపి)

శ్రీ బెల్లంకొండ రామారావుగారి భాష్యార్క ప్రకాశవ్యాఖ్యానముతో నాలుగుసంపుటములు, దాదాపు 1420 పుటలు, రాయలుసైజు, చక్కని కాగితములు, ముచ్చటలుకూర్పు అచ్చు, అందమైన అట్టబైండు: వెల సంపుటము 1-కి రూ. 1-8-0.

ఉపనిషత్తుల సారము భగవద్గీతలు. వీనికి పలువురు వ్యాఖ్యానముల గావించియున్నారు. అందు శంకరావతారులు శంకరాచార్యుల వ్యాఖ్యాన ముత్తమమైనది. శంకరభాష్యమునకు ఖండనరూపమైనది రామానుజభాష్యము. ఆరామానుజభాష్యమును సయుక్తికముగ విమర్శించుచో శంకరభాష్య మసమానమునని తలచి గుంటూరుమండలములోని పమిడిపాడు గ్రామవాసులు శ్రీయుతులు కీ. శే. బెల్లంకొండ రామరావుగారీభాష్యార్కప్రకాశ మను వ్యాఖ్యానము వ్రాసియున్నారు. ఈభాష్యార్క ప్రకాశము శంకరభాష్యమునకు మెరుగుపెట్టునదై యున్నది. వీరు, శంకరాచార్యులు వ్యాఖ్యానము చేయకవదలివేసిన భాగమునకు వ్యాఖ్యానమును, వారు వ్యాఖ్యానముచేసిన భాగమునకు పదాన్వయమును గావించిరి. సంస్కృతమున కొంచెము ప్రవేశముగలవారు గూడ సులభముగ నర్థముచేసికొనదగినంత సులభశైలిలో నీవ్యాఖ్యానము వ్రాయబడియున్నది. అందరును ఈగ్రంథమును జదివి గీతల పరమార్థమును దెలిసికొని యానందింతురుగాక !

పుస్తకముల క్రింది విలాసమునకు వ్రాయవలయును:—

మేనేజరు, ఆంధ్రపత్రిక,
తపాలుపెట్టె 212, మద్రాసు.

---

## పాఠశాలలు - వాఙ్మయము

'కోదండరాముఁడు' అను గ్రంథమును చెన్నపురి సి. కుమారస్వామినాయుడు అండు సన్సువారు 1930 వ సంవత్సరమున ముద్రించి ప్రకటించినారు. క్రౌనుసైజు, పుటలు 144, వెల 0-9-0. ఈపుస్తకమున రామాయణ కథ వర్ణింపబడినది. దీనిని రచియించిన వారెవ్వరో తెలియరాదు. ఇయ్యది మాధ్యమికపాఠశాలల బాలురకొరకు రచింపబడినట్లు తోచుచున్నది. ఈగ్రంథము పాఠ్యగ్రంథ నిర్ణాయకసంఘమువారి యంగీకారముద్ర నింకను బడసినటులు కానరాదు.

గ్రంథరచన మపశబ్ద, అపార్థ, అసంబద్ధార్థభూయిష్ఠము. రామాయణకథ యగుట యొక్కటియే యిందలి సుగుణము. ఇట్టి గ్రంథములు ఆంధ్రభాషావల్లరికి వేరుపురువులు. విద్యాశాఖాధికారు లిట్టి యధమగ్రంథములు

బాలుర దరికి చేరకుండ కాడవలయును. అట్లు చూడ లేని మున్నొకమారు కీ. శే., బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిలుగారు సెల విచ్చినట్లు విద్యాశాఖాధికారులు విద్యాశాఖ— అధిక — అరులు (విద్యాశాఖకు, అధికశత్రువులు) అగుదురు.

గ్రంథమునుండి స్థాలీపులాకన్యాయము ననుసరించిన కొన్ని యుదాహరణములు:—

పు. 4. సాధించువాడును యగు; పు. 8. సర యూయను = సరయువను; పు. 9. నీతివంతిము = నీతి మంతము; పు. 14. తాటకి = తాటక; పు. 14. దుర్గార్గ వడత = దుష్ప్రవర్తనము; పు. 15. కావలుంచి = కావలి యుంచి; పు. 18. జనకమహారాజు శాస్త్రపరిశీలనల యందు మిక్కిలి సమర్థుఁడై...శాస్త్రపరిశీలనయందు అనగానేమి?; పు. 21. జనకుని తమ్ముడు జయధ్వజుఁడట; కాదు, కుశధ్వజుడు; పు. 29. కైకదశరథునకు 'ప్రియబాలపత్ని'; పు. 35. సాష్టాంగముగ; పు. 40. సంభ్రమముగ వర్ధిల్లుచుండు ననుకొంటివా!; పు. 43. శృంగిబేరి పురము = శృంగిబేరపురము; పు. 46. రాము డుండాశ్రమము = రాముడుండు నాశ్రమము; పు. 49. కైవ్రత భ్రాతుఁడు=భ్రాత; పు. 54. 'నీటిచే నావరింపఁబడిన దీవి' - నీటిచేనావరింపబడని దీవులు కలవా?; పు. 55. విశ్రావసు, కేశిని. కాదు. విశ్రవసుడు, కైకసి. అని; పు. 56. విద్రదసింగవుఁడు శూర్పణఖ భర్తయట. కాదు విద్యుజ్జిహ్వుడు. శూర్పణఖ కుమారుడు జంబుకాసురుడు కాని శంభుకుమారుడు కాడు; పు. 64. ఛండాలా=చండాలా; పు. 93. ఆపదోద్ధారకుడు=ఆపదుద్ధారకుడు.

వాక్యరచన.

పు. 72. అతని వీరులలో కొండఒకవాడు ఋష్యమూకపర్వతదాపున నొక చెట్టుపైనుండ. కొండలు-వీరు నరులా, వానరులా? రామాయణమున వానరులకు వాలము లున్నట్లును, లంకలో ఆంజనేయునితోకకు నిప్పునంటిం చినట్లును గాక; పు. 78. నాయొద్ద శత్రువులనుభిన్నాభిన్నములుగ చేయునట్టియు,దహించునట్టి యస్త్రములును, నాచేత కనుమాత్రము, శత్రువులను గడగడలాడించు కోదండమును, నాపాదుగాటి యుక్కువంటి భుజముల నమర్చ బడియు యిప్పుడవి యన్నియు నిష్ప్రయోజనములై యున్నవే. చక్కనివాక్యము! పు. 79. తనవింటినారితో ఝుంకారము కావించెను. ఝుంకారమా, టంకారమా? పు. 81. అతనివెంట మహాశూరులగు అంగద, నల, జాంబవంత, నీలుఁడు మొదలగువారిని పోయి.... పు. 103. కాలపాశమువలన దుర్బుద్ధిగలిగిన రావణుఁడు హనుమంతుని చేతులకు నిప్పంటించి మేళతాళవాద్యములతో మారంతయు త్రిప్పి యతనిని యవమానపఱుచవలెనని యుత్తరవు చేసెను; పు. 105. రాక్షసులలో వృద్ధ, బాల, గొప్ప, స్వల్పనెల్లఱు ప్రాణముల తప్పించుకొనుటకు దారితోచక యల్లాడుచుండిరి; పు. 115. పిమ్మట రావణుడు, కోదండపాణియై తమ్మునితో నిల్చియున్న రాముని సంఘటించెను; పు. 118. ఆయస్త్రమతని తలను చ్ఛేదించి నామమాత్రమైన శేషంఢజేసెను.

అమూలాగ్రము నిట్లు దోషములు రోమకంబళి న్యాయము ననుసరించి లెక్కకు మిక్కిలిగ గలవు. శకటరేఫములయు, అర్థానుస్వారములయు మాట చెప్పబనియేలేదు.

సీతాదేవి యగ్నిప్రవేశము మాట లేదు.

---

## శ్రీకృష్ణవాస్తు శాస్త్రము

గ్రంథకర్త: పేరు సోమల గణపయామాత్యుడు. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రిలు అండుసన్సు, 292, ఎస్ప్లానేడు, చెన్నపురి.

వాస్తుశాస్త్రము పలుతెరగుల బరగునది. అందు గృహవాస్తువు సర్వజనోపకారకమగుట ముఖ్యమైనది.

దానిని సమగ్రముగ నిరూపింపజాలిన గ్రంథ మాంధ్రమున నిదివరకు వెడలకుండుట తీరనిలోపముయి యుండెను. ఇప్పటి కది తీరిన దనవచ్చు. ఆంధ్రపద్యరూపమున వెలసిన శ్రీకృష్ణవాస్తుశాస్త్రము గృహవాస్తువును సమగ్రముగ చక్కగా నిరూపింప జాలియున్నది. ఇయ్యది శ్రీకృష్ణున కంకితమగుటచే శ్రీకృష్ణవాస్తుశాస్త్ర మనబడెను. వాస్తుసారసంగ్రహ మనియు దీనికి పేరుగలదు. గృహనిర్మాతలందరు తప్పక చదువదగిన గ్రంథము. పాఠకుల సౌకర్యార్థ మాంధ్రతాత్పర్యము గూడ జేర్చబడి యున్నది.

ఇట్టి యుత్తమగ్రంథము నాంధ్రలోకమున కొసగిన ప్రకాశకులు ప్రశంసనీయులు.

---

## ఆంధ్రచంద్రాలోకము

గ్రంథకర్త: తాడూరి లక్ష్మీనరసింహరావు పంతులుగారు, రాజమండ్రి.

సంస్కృతచంద్రాలోకమున కియ్యది యాంధ్ర పద్యానువాదము. చంద్రాలోకమును రచించినవాడు జయదేవకవి. కాళిదాసుడు దీనిని రచించెనని కొందరందురనియు, గోదావరీమండలమువారి కట్టితలంపే గలదనియు, తాము నామండలమువారే యగుట తాము నట్టి తలంపే గలిగియుంటిమనియు మన యనువాదకులు పీఠికయందు వ్రాసికొనియున్నారు. పలువుర తలంపున నిది జయదేవరచితమై యుండ తా మన్యథా అభిప్రాయపడుచుండుటకు వీరు కారణముల నొండురెంటిని చూపి యుండిన బాగుండెడిది.

అనువాదము మూలానుసారియై చక్కగనే యున్నది. శైలియు సరళముగ నున్నది.

కాని యనువాదమం దటనట లక్షణములును, లక్ష్యములును మూలము నతిక్రమించి యుంట కానవచ్చును. కొన్నింటిని జూడుడు—

చిత్రము (పుట 26)

ఎందు విపరీతఫలముకై యిలప్రయత్న
మాచరింపంగబడు జిత్ర మందు గలదు
తనర ముల్లోకముల నేలుదానికంటె
నెక్కువయునౌరి సజ్జనుల్ మ్రొక్కుచుంద్రు.

మూలము—విచిత్రం తత్ప్రయత్నశ్చే ద్విపరీతః ఫలేచ్ఛయా। నమంతి సంతః త్రైలోక్యా దపి లబ్ధుం సమున్నతిమ్.

ఫలేచ్ఛయా విపరీతః ప్రయత్నశ్చేద్విచిత్రం నామాలంకారః, ఇష్టవిపరీతాచరణమితి యావత్. అని వ్యాఖ్య.

ఫలమునకు విపరీతమగు ప్రయత్నము - ఇష్టవిపరీతాచరణము- విచిత్రము అని మూలము. సమున్నతికి విపరీతమయినది నమనము. అనువాదమున నట్టిదేదియు గానరాదు. పైగా లక్షణముకూడ విపరీతముగ కన్పట్టుచున్నది.

ప్రత్యనీకము (పుట 33)

ఇలప్రత్యనీక మనబడు
బలవద్రిపుపక్షచరుల బాధింపంగా
కలువలు తము గెలచిన యా
చెలికన్నుల దవిలికొలువ చెవులను వంచేఁ.

మూలమునందలి యధఃకరణమున కిట వంచుట. కలువలు చెవులను వంచలేదు, అధఃకరించినవి, అనగా క్రిందుజేసినవి, తిరస్కరించినవి.

ప్రౌఢోక్తి (పుట 35)

ధరణి ప్రౌఢోక్తి యగు నుత్కర్షమునకు
గారణములేక కారణకల్పనమ్ము
అల్ల యమునానదీతీరమందు గల త
మాలలతలట్లె కొప్పులు నీలమయ్యె.

మూలము—ప్రౌఢోక్తి రుత్కర్షాహేతౌ తద్ధేతుత్వప్రకల్పనమ్,......

ఉత్కర్షమునకు హేతువుకాని దానియందు హేతుత్వము కల్పించుట ప్రౌఢోక్తియని. అనువాదము విపరీతముగ నున్నది.

లేశము (పుట 88)

ఒక్కదోషంబునకు నొక సుగుణంబును
నొక్కసుగుణమునకు నొక్కదోష
మమరునట్లు కల్పనము సేయ నలవాని
లేశమండ్రు ధరగవీశులెల్ల.

యథా—లేశస్స్యాత్ దోషగుణయో ర్గుణదోషత్వ కల్పనమ్.

దోషమునకు గుణత్వము, గుణమునకు దోషత్వమును జెప్పుట లేశము. ఇటను ననువాదము అనన్వితముగ నున్నది.

ఇట్టి వింకను గలవు. శాస్త్రములయం దుండరానివివి. ఎటులో ఇందు దొర్లినవి. అనువాదకు లికముందు ఇట్టివి లేకుండ రచనలకు గడంగ దగుదురు.

---

## ఆంధ్రాక్షరములు

మ॥ రా॥ శ్రీ, రాజా పానగంటి పార్థసారథి రాయనింగారిచే రచింపఁబడిన "ఆంధ్రాక్షరములు" అను వ్యాసమును నేను మిక్కిలి కుతూహలముతోఁ జదివితిని. "భాషయం దుపయోగింపఁబడు ధ్వనుల నన్నిటిని దెలుపుటకుఁ దగినన్ని యక్షరము లుండవలెను" అని వీరు వ్రాసిన సమంజసమగు సిద్ధాంతముచొప్పున "ఆంధ్ర వర్ణసమామ్నాయముతో సమముగ నింకేవర్ణసమామ్నాయముగాని సంపూర్ణస్థితికి సమీపించి యుండ లేదు" అనెడి వీరియభిప్రాయము సత్యమైయున్న దనుటకు సందియము లేదు. యుక్తముగా సవరింపఁబడినచో నీలిపియే యెల్ల దేశభాషలకు నుపయోగించుననెడి వీరి యుద్దేశము కేవలము సంభావ్యమై యున్నది.

I. "ఒక్కొక్కధ్వనిని గుర్తించుట కొక్కొక్క సంకేతమే యుండవలెను...ఒకధ్వనిని స్ఫురింపఁజేయుటకనేక సంకేతములుగాని యనేకధ్వనులను స్ఫురింపఁజేయుట కొక్కటే సంకేతముగాని యుండరాదు."

II. "ఒక్కయక్షరమే యొకప్పు డొక ధ్వనిని, మఱియొకప్పుడు మఱియొకధ్వనిని స్ఫురింపఁ జేయఁ జనదు."

III. "ఒకధ్వనిని స్ఫురింపఁజేయుట కొకప్పు డొకయక్షరమును, మఱియొకప్పుడు మఱియొక యక్షరమును నుపయోగించుట తగదు."

IV. "ఒకయక్షరముండిన నది యొకధ్వనికి గుఱుతుగా నుండవలెనే గాని యూరకుండరాదు."

అని యిట్లు వీరు కొన్ని యక్షరతత్త్వశాస్త్రోచితములగు నియమముల నేర్పఱచికొని యాంధ్రలిపికి మహోన్నతస్థితిని గలిగించుటకయి కొన్ని సవరణములను జూపియున్నారు. అయ్యవి యావశ్యకము లనియె నా యభిప్రాయము. ఆంధ్రలిపియందుఁగల యిట్టిలోపము లీనడుమవచ్చిన గొలుసుకత్తులిపి మున్నగువాని కారణమున వచ్చెనాయని యాలోచింపవలసియున్నది.

ఆంధ్రశబ్దచింతామణియందును, వికృతివివేకమునందును నాంధ్రలిపిస్వరూపము దిఙ్మాత్రముగ నీక్రింది రీతిని రూపింపఁబడియున్నది.

శ్లో. "బాలేందుపరిధిశృంగా వర్తకుశగ్రంథిదాత్ర పరశుసమాః। ఆద్యా ఇభకరతుల్యా స్తద్ధిఘ్నా స్సూల సన్నిభావన్యా॥ దరశార్ఙ్గపిప్పలజగాంకుశపన్నగ సన్నిభాః క్రమా త్పరుషాః। స్తంభవిలేఖాధిక్యే తఏవ వర్గద్వితీయవర్ణాద్యాః॥ కీరతరిహా స్తిమ స్తక కు క్షితులాసనవి తర్దిసీరసమాః। అంతస్థా శ్చోష్మా ణో దంత్యచజా గురురలౌచ బిందుయుతౌ॥"

(ఆంధ్రచింతామణి.)

శ్లో. "పంచవర్గాదయోవర్ణా శ్శృంఖకారక్ష్మాదిసన్నిభాః॥ తిర్యగ్రేఖాయుజశ్చోర్ధ్వం దండరేఖాన్వితా అధః॥ తఏవచ ద్వితీయాస్యు రూర్ధ్వరేఖాద్వికాన్వితాః। ప్రథమాస్తు తృతీయాస్యు స్తృతీయా స్తే చతుర్థకాః॥ రేఖాద్వయాధోదండేన యుక్తాస్స్యు రనునాసికాః। మిశ్రదండద్వయోపేతాః ప్రథమా లిప

యస్స్మృతాః । పూర్ణేందుసదృశః పూర్ణ స్త్వర్ధ స్త్వర్ధేందుసన్నిభః ॥"

(వికృతివివేకము.)

మన్నయాథర్వణులు పయిరీతి, నుచ్చారణమున నెట్లు వర్గాదిమవర్ణములే మహాప్రాణాద్యావేశమున వర్గద్వితీయాదిరూపముల నందుచున్నవో యట్లే లేఖనము నందును వర్గాదిమవర్ణానుమాపక రేఖల నుండియే స్వల్పము లగు మార్పులతో వర్గద్వితీయాదివర్ణానుమాపక రేఖలును వెలయుచున్నవని నిరూపించి యాంధ్రలిపియొక్క యుత్తమోత్తమస్థితిని వెల్లడించియున్నారు. ప్రాచీనాంధ్రపండితాదృతమగు నీ లిపియం దట్టిలోపము లగపడవు. ఏది యెట్లయినను నిపుడు వాడుకలోనికి వచ్చియున్న లిపిలో శ్రీ రాజాగారు చూపిన లోపములు సవరింపఁదగినవేయని నా యభిప్రాయము. ఉన్న దానిని మార్పరాదనుచుఁ బ్రతిఘటించుట యుక్తము కాదుగదా!

ఇప్పటి ముద్రణములయందుఁ బ్రాజ్ఞులగు ముద్రణ సంస్కర్తలచేఁ బ్రాచీన తాళపత్రమాతృకల లిపియందలి యెన్నెన్నిలోపములు తొలఁగింపఁబడి యుండలేదు? సున్న యాదిఁ బలుకఁబడుటకును దేల్చి పలుకఁబడుటకును వ్యావర్తకముగా నాదిఁ బలుకఁబడునపుడు పరహల్లునకు లేనిపోని ద్విత్వము నియమముగాఁ దాళపత్ర మాతృకలలో లిఖింపఁబడుచుండెడిదిగాదా? అట్టి లేఖనము సరికాదని యప్పకవి యీ క్రిందిరీతిని నిరసించియుండలేదా?

క. "బలుబొట్టులపై వర్ణం
బులక్రిందట నవియె మరల మూఁడవతులు జ
డ్డలుచేసి వ్రాయుచుందురు
విలిఖింపరు వాని రెండు ద్విత్వము లార్యుల్.

(అప్పకవీయము, ౨ ఆ. ౮౫ ప.)

సున్న తేల్చి పలుకఁబడుటకు గురుతుగ నిపుడు వ్రాయఁబడుచున్న యర్ధానుస్వారలిపి యప్పటికిఁ బండితులచేఁ గల్పింపఁబడమింజేసి తాళపత్రమాతృకా లేఖకు లట్లు వ్రాయుచుండెడివారనియుఁ జెప్పుటకు వలనుపడదు. ప్రాచీనవైయాకరణు లరసున్నలిపిని దమవ్యాకరణములలో స్పష్టముగా నీ క్రిందిరీతిని నిరూపించియే యున్నారుగదా?

శ్లో. "పూర్ణేందుసదృశః పూర్ణ స్త్వర్ధ స్త్వర్ధేందుసన్నిభః."

(ఆంధ్రశబ్దచింతామణి.)

వర్ణసమామ్నాయసంఖ్యానమునందును నాంధ్రశబ్దచింతామణి పూర్ణార్ధానుస్వారములను వేర్వేఱుగాఁ బరిగణించియున్నది.

శ్లో. "ద్వివిధాదిరు దేదోతో ఒచో వక్రతమా వనుస్వారౌ"

శ్లో. "సిద్ధస్సాన్యశ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః
హ్రస్వా త్పూర్ణో ఒపి భవే ద్దీర్ఘాచ్చేత్ఖండఏవసజ్ఞేయః."

(ఆంధ్రశబ్దచింతామణి.)

వీనిలోని "అర్ధ, ఖండ" శబ్దములుగూడఁ బ్రాచీన పండితవ్యవహారసిద్ధమగు నర్ధానుస్వారలిపిని నిరూపింపఁ జాలియున్నవిగదా!

క. "...నిడుపులమీఁదిబిందు లరబిందు లనుక్."

"నఖండః ప్రథమార్ధస్య ద్విత్వకృతేఽత్ర కదాచన."

(వికృతివివేకము.)

పయివ్యాకరణములకుఁ దర్వాత వ్రాయఁబడినవే యిపుడు మన కుపలబ్ధము లగుచున్న తాళపత్రమాతృకలెల్ల ననుటకు నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు గదా!

మఱియు నప్పకవి తనకాలపుఁ దాళపత్రమాతృకలలో వ్రాయఁబడుచున్న వలపలిగిలుకను నీ క్రిందిరీతిని నిరసించియుండలేదా!—

తే. "మొదల రేఫాక్షరంబునాపిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ జదివికొనుచు
ముందు జడ్డయు వెస రేఫమునకు బదులు
గిలుక విభజించియు లిఖింతు రిలఁ గుమతులు."

(అప్పకవీయము, ౨ ఆ. ౮౧ ప.)

పయిసందర్భమును బట్టి యాయాకాలములందలి జనసామాన్యముచే నపరిశీలితముగాఁ బూర్వపూర్వాభ్యాసాటుల వశమున లిపులు లిఖింపఁబడుచుండుననియు,

భాషాపండితుల నాగరకత ప్రబలినకొలఁది నట్టి లిపుల లోని లోపములు పండితులచే సవరింపఁబడుచు వచ్చుచుండుననియు నెవ్వరికేని యంగీకరింపక తీరదుగదా!

"ఉచ్చారణమునందు శకారద్వయమును బలుకుచు "శ్లు" అని వ్రాయుట యుక్తము కాదు" అనెడి శ్రీరాజాగారి యభిప్రాయము మిక్కిలి సమంజసమై యున్నదనుటకు సందియము లేదుగదా! అలఘు లకారముతో నవ్యవహితోత్తరముగా సంయోగించు లకారమును లఘువుగాఁ బలుకుట చతుర్ముఖునకేని శక్యము కాదుగదా! ఇట్టి యసంభావ్యమగు నలఘులఘు లకారద్వయసంయోగము బాలసరస్వతులు మున్నగు నిటీవలి యాంధ్రవైయాకరణులు చింతామణికిఁ జేసిన ప్రామాదికవ్యాఖ్యలవలన బయల్వెడలినదనియు, నాంధ్రశబ్దచింతామణికర్తృప్రభృతి ప్రాచీనుల కయ్యది యభిప్రేతము కాదనియు నారచించిన చింతామణివ్యాసములలో విపులముగఁ జర్చించి చూపియున్నందున నిట విస్తరభీతిని మరల వివరింపనైతిని.

పయిరీతి నాంధ్రలిపిలోఁగల లోపములను సవరించుటయే గాక శ్రీరాజాగా రాంధ్రలిపికి మఱికొన్ని లోపములను బాపుచు నపూర్వమగు నందమును గూర్చు టైపుపద్ధతిని గూడఁ గల్పించి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రు లగుచున్నారు.

అట్టిపద్ధతిని గల్పించుటలో సౌకర్యార్థముగ సంయుక్తవర్ణములను విడఁదీసి లిఖించుమార్గమును జూపియున్నారు. ఇట్టిరీతి నాగరలిపిలోను, నఱవలిపిలోను ఈవఱకుఁ గొంత వెలసియున్నది. దీనిమూలమున నుచ్చారణమునకు విలక్షణముగ వ్రాయఁబడుచున్న తెలుఁగు వ్రాఁతలోని క్రమవిపర్యాసదోషము తొలఁగి యుచితమగు నుచ్చారణానురూపవర్ణక్రమ మేర్పడుచున్నది. మఱియు నిట్టిరీతిని మన మంగీకరించిన పక్షమున 'టైపు పద్ధతి' యాంధ్రమునకు సుకరమగుటయేగాక ముద్రణసౌకర్యముగూడ సంభవించుటచేత ముద్రింపఁబడు నాంధ్రసారస్వతమున కితోధికావ్యాప్తి సంభవింపఁగలదు.

ఉత్తరోత్తరాన్నత్యలాలసులగు నాంధ్రపండితమహాశయులు శ్రీరాజాగారి యభిప్రాయముల నాదరించి యాచరణములోనికి వచ్చునట్లుగఁ దోడ్పడి కృతార్థులయ్యెదరు గాక!

వ. చి. సీ. రా. శా.

---

# గ్రంథ స్వీకారము

## గృహావిచ్ఛిత్తి

నవల. గ్రంథకర్త: రాయసం కృష్ణమూర్తిగారు, సరస్వతీగ్రంథమాల, కాకరపర్రు, తణుకుతా, ప. గోదావరిజిల్లా. డెమ్మీసైజు ౧౯౪ పుటలు వెల ౧-౮-౦.

---

## ల వం గ ల త

సాంఘికనవల. గ్రంథకర్త: కోనూరి రంగయ్యగారు, నరసాపురం, ప. గోదావరి. విచిత్రనవలా గ్రంథమాల. డెమ్మీసైజు ౧౭౬ పుటలు. వెల రు. ౧-౮-౦.

---

## కపింజలసంహితా

సంపాదకులు : పా. సీతారామానుజాచార్యులు గారు, భద్రాచలము, తూ. గోదావరి. శ్రీపాంచరాత్రాగమశాస్త్రసర్వస్వము. డెమ్మీసైజు ౧౫౬ పుటలు, వెల ౩-౦-౦. ఉత్తమప్రతి ౪-౦-౦.

---

## మా రు తి

కర్త: మోచర్ల రామకృష్ణయ్యగారు, బి. ఏ., ప్లీడరు, నెల్లూరు. క్రౌనుసైజు ౪౫ పుటలు (౧౦౦ పద్యములు) వెల రు. ౦-౪-౦.

---

## శ్రీ వివేకానందస్వామిజీవితము

(ప్రథమభాగము) గ్రంథకర్త: బులుసు వెంకటేశ్వర్లుగారు. పుస్తకములు దొరకుచోటు—బులుసు వెంకట శ్రీరామమూర్తిగారు, కాకినాడ. డెమ్మీసైజు ౨౫౭ పుటలు వెల రు. ౧-౦-౦.

---

1. ద్వాదశనామసహస్రాష్టోత్తర స్తోత్ర రత్నాకరము.

డెమ్మీ ౧౬ సైజు, ౪౧౩ పుటలు వెల ౧-౭-౦

2. శివసహస్రనామస్తోత్రమ్.

పై సైజు, ౫౯ పుటలు, వెల ౦-౮-౦.

పైరెంటికి ప్రకాశకులు: బి. జె. కృష్ణశాస్త్రి గారు, హొలహర్వి పోస్టు, బళ్లారిజిల్లా.

---

సర్వేశ్వర శతకము

(పూర్వభాగము) కర్త: చెముడుపాటి వెంకట కామేశ్వర కవిగారు (చెముడిపాటి కామేశంపంతులు గారు ఛత్రపూరు, గంజాము జిల్లా.) వెల ౦-౮-౦.

---

౧. ఋతుసంహారము(ఆంధ్రపద్యానువాదము)

అనువాదకులు: తాడూరి లక్ష్మీనరసింహరావు పంతులుగారు. డెమ్మీసైజు ౨౮ పు. వెల అ. 3.

౨. రసమంజరి (తెలుగు)

అనువాదకులు; తాడూరి లక్ష్మీనరసింహరావు పంతులుగారు. డెమ్మీ, ౫౫ పు. వెల అ. ౬.

3. సనత్సుజాతీయము(తెలుగుపద్యకావ్యము)

గ్రంథకర్త: తాడూరి లక్ష్మీనరసింహరావు పంతులుగారు. డెమ్మీ, 3౪ పు. వెల అ. ౮.

పైమూటికి గ్రంథకర్తపేర రాజమండ్రికి వ్రాయవలయును.

---

బంధుప్రేమ

డెమ్మీసైజు, పుటలు ౧౦౮, వెల ౦-౭-౦.

గ్రంథకర్త. నిమ్మల వేంకటసోమయాజిగారు.

ప్రకాశకులు: సిద్దాబత్తుల సుబ్బారావు గారు, విశాఖపట్టణము.

కేసరి (చారిత్రక నవల)

కర్త: నిమ్మల వేంకటసోమయాజిగారు.

ప్రకాశకులు: లీలావతీగ్రంథమాల, రాజమండ్రి. వెల రూ. ౧-౫-౦.

---

లోకములు, లోకాంతరములు

డెమ్మీసైజు, ౧౪౬ పుటలు, వెల రు. ౧-౦-౦.

గ్రంథకర్త: ముక్తినూతలపాటి గోపాలకృష్ణ మూర్తిశాస్త్రిగారు.

ప్రకాశకులు: కనుపర్తి మార్కండేయశర్మగారు సంపాదకులు, స్వధర్మప్రకాశిని. నెం. ౭౨, పూనమల్లి హైరోడ్, బృందావనం, కీలుపాకు, మదరాసు.

---

శశిరేఖాపరిణయము (నాటకము)

డెమ్మీసైజు, పుటలు ౯౧, వెల ౦-౭-౦.

గ్రంథకర్త: నిమ్మల వేంకటసోమయాజిగారు.

(విలాసము లేదు)

---

శరణాగతి

(వంగమాతృకా) ప్రణేత: నిత్యలీలాప్రవిష్ట ఠాకురు భక్తివినోదులు. (తమిళ) భాషాంతరీకర్త: పి. యస్. శంకరనారాయణ అయ్యరు, బి. ఏ., బి. యల్.

డెమ్మీ ౧౬ సైజు, ౧౨౧ పుటలు వెల ౦-౬-౦.

ప్రకాశకులు:—శ్రీ గౌడీయమఠము వారు, ఉత్తరగోపాలపురము, క్యాథిడ్రాల్ పోస్టు, మదరాసు.

---

గ్రామ పునర్నిర్మాణ వ్యాసములు

గ్రంథకర్త: అన్నంరాజు శ్రీరాములు గారు, స్టోనుహౌసు పేట, నెల్లూరు. క్రౌను సైజు: ౨౩౦ పుటలు. వెల రు ౧-౦-౦

---

# పత్రికా స్వీకారము

ఆంధ్రవైద్యసమ్మేళన పత్రిక

దశమవార్షిక సంచిక

సైజు క్రౌను ఆక్టవో. సంపాదకులు: వేటూరి శంకరశాస్త్రిగారు, ముక్త్యాల. చందాదారులకు పది అణాలు, ఇతరులకు ఒకరూపాయి.

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచపరిస్థితులు సర్వత్ర భయభ్రాంతులను కలుగజేయుచున్నవి. భావములందు, శాంతికార్యములందు సమరము వర్తమాన సమయమునందు ప్రపంచావస్థగ నున్నది. స్వార్థపరత్వము, ప్రజ్ఞావాదము, కపటప్రవర్తనము రాజనీతికి పరమలక్ష్యములైనవి. ప్రజలన్నాతురులై దుఃఖవేదన ననుభవించుచున్నను రాజనీతిజ్ఞులు సమరసన్నాహములకై సంపదలను వినియోగించుచు ప్రపంచమును దుఃఖమయము చేయుచున్నారు. ఫ్రాన్సు రాజ్యము జర్మనురాజ్యమును పీడించి గ్రహించుచున్న కోట్లద్రవ్యమును ఆయుధధారణమునకై వినియోగించుచు సంగ్రామసన్నాహములను ప్రపంచమునందంతటను వ్యాపింపజేయుచున్నది. వర్తమానకాలమునందు ఫ్రాన్సు చూపుచున్న కాఠిన్యము సమరమార్గమునకు సాధనమగుచున్నది. ఫ్రాన్సు కోశాగారము బంగారముతో నిండియున్నది. సైన్యములు, విమానములు, యుద్ధనావలు, మరఫిరంగులు మొదలగు సమరసన్నాహములన్నియును సంగ్రామమునకు సంసిద్ధముగ నున్నవి. ఐరోపామహాసంగ్రామముల కాదికాలమునుండియును ఫ్రాన్సుదేశము రణరంగమై యూరపుఖండముతోపాటు ప్రపంచమును భస్మపటలము చేసినది. కడపటి సంగ్రామదావానలము చల్లారకపూర్వమె ఫ్రాన్సు చేయుచున్న సంగ్రామసన్నాహములు ప్రళయాంతకములుగ నున్నవి. యూరపురాజ్యము లవలంబించిన దండనీతి సుందోపసుందోపాఖ్యానమునకు లక్ష్యముగ నున్నది. యూరపు రాజ్యాంగవేత్తలు గుణించునటులు సంగ్రామము ౧౯౩౮ నందు జరిగినను, జరుగకున్నను సంగ్రామము సంభవమని నిశ్చయింపదగియున్నది. రుష్యా, జర్మని మొదలగు దేశములందు ప్రజ లన్నాతురులై దుఃఖవేదన ననుభవించుచున్నపుడు రాజ్యాధికారులకు సంగ్రామము శరణ్య మగుచున్నది. సంగ్రామములకు మూలము సామాన్యముగను నర్థసంబంధముగాని ధర్మసంబంధము గాదు. వర్తమానకాలమునందు జర్మని, రుష్యా మొదలగు దేశము లనుభవించుచున్న దుర్దశ యూరపురాజ్యములందు సంచలనమును గలుగ జేసినది. రుష్యా దుస్థితిని తలపోయకపోయినను జర్మని దుస్థితిని తలపోయవలసివచ్చినది.

* * * * *

జర్మని దుస్థితి

గతమాసమునందు జర్మని దేశమునందు వ్యాప్తమైన ఆర్థికదుస్థితి వర్ణనాతీతము. ధనాగారములు వ్యాపారమును నిలుపుదల జేసినవి. ధనాగారములతోపాటు వ్యాపారము,

పరిశ్రమలు నిలిచిపోయినవి. హూవరుగారి విధానము కొనయూపిరితోనున్న జర్మని దేశమునకు గండమును తప్పించినది. లండనునందు గూడిన ఆర్థికప్రముఖుల సమావేశము జర్మనికి సహాయము చేయవలసిన యవసరమును గ్రహించినది. అమెరికా గ్రేటుబ్రిటనులు జర్మని బ్యాంకులకు ధనసహాయము చేసి నిలిచిపోయిన వ్యవహారమును తిరిగి ప్రారంభింపజేసినవి. హూవరుగారి విధానము జర్మనికి తాత్కాలికముగ నుపశమనమును గలుగజేసినను నష్టపరిహారములందు మార్పుగలుగనంతవరకును జర్మని దుర్దశ యథాప్రకారము భయభ్రాంతులకు గారణంబుగా గలదు. మహాసంగ్రామబీజములకు మూలాధారమైన ఆయుధధారణమునందు మార్పు గలుగనంతవరకును ప్రపంచావృతమైన యార్థికసంక్షోభ ముపశమించుట యసంభవము. జర్మనిదేశమునకు సంప్రాప్తమైన దురవస్థయె పరాధీనస్థితియందున్న భరతవర్షమునకును సంప్రాప్తమై ప్రజలయందు సంక్షోభమును గలుగజేయుచున్నది.

### భరతవర్షము - ఆర్థికస్థితి

భరతవర్షమునకు సంప్రాప్తమైన ఆర్థిక దుర్దశకు పరాధీనస్థితియె మూలమని నిత్యవ్యవహారములు వేయినోళ్లను చాటుచున్నవి. పరపరిపాలన మత్యంతవ్యయోపేతమై ఆర్థిక చైతన్యమును స్తంభింపజేసినది. సైన్యవ్యయము, ఉద్యోగవ్యయము తగ్గనంతవరకును బ్రిటీషు పరిపాలనమునందు వ్యయభారము తగ్గజాలదు. విదేశవ్యాపారము, ౧౮ పెన్నుల మారకపురేటు మొదలగు దుర్ణయము లీదురవస్థను దుర్భరముచేసినవి. భారతీయస్వరాజ్యసమస్యకు మూలాధార మార్థికస్వతంత్రమునందే గోచరంబగుచున్నది. బర్మాయందు దోపిడులకును సంయుక్తరాష్ట్రములందును, చెన్నరాష్ట్రమునందును, నితరరాష్ట్రములందును సంక్షోభమునకును దుర్భరమైన ప్రజల దారిద్ర్యమె మూలముగ నున్నది. లండనునగరమునందు రౌండుటేబిలు సమావేశమునందును, సమాఖ్య విధానమునందును నిర్ణయముగావలసిన ప్రధానవిషయ మార్థికస్వాతంత్ర్యము. రాజ్యాంగములందు రక్షణోపాయములను నిర్ణయించుటయందు భేదాభిప్రాయములు గలుగుటకు మూలకారణ మార్థిక నిర్ణయములందే గలుగుచున్నది. రక్షణములు స్వరాజ్యమును గోరెడి భరతవర్షమున కవసరమనుట నిర్వివాదాంశమైనను భాగ్యభోగముల ననుసరించి బ్రిటీషురాజ్యాధికారులు చూపెడి ప్రతిఘటనము నిరాశాజనకముగ నున్నది. గాంధి-ఇర్వినుసంధియందు రక్షణోపాయములు భరతవర్షమున కేర్పడవలయునని నిర్ణయింపబడినను గ్రేటుబ్రిటనునందు బయలుదేరిన ప్రతిఘటనము నిరాశకు గారణంబుగ నున్నది. గాంధిమహాత్ముని లక్ష్యమంతయును ఆర్థికస్వాతంత్ర్యమునందు లగ్నమైన విధమును కాంగ్రెసునిర్మాణకార్యవిధానము చేయుచున్నది. అప్పునప్పుల నిర్ణయమును జేయుటయందు కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ మిాలత్యమునె

స్వీకరించినది. నిర్ణయవిధినిషేధములందు భేదాభిప్రాయము లుండవచ్చును. సిద్ధాంతము నందు మాత్రము భేదాభిప్రాయము లుండ జాలవు. లండను సమావేశములందు వాద ప్రతివాదము లార్థికనిర్ణయములందే గలుగుట సహజము. ఆర్థికసమస్యలను భారతీయయోగ క్షేమములకై నిర్ణయించుటకు కాంగ్రెసు పక్షమున గాంధిమహాత్ముని రాయబారము సకలవిధములను యోగ్యముగ నున్నది. కరాచి నిర్ణయించిన మహాత్ముని రాయబారమునె బొంబయియందు గూడనున్న అఖిలభారతకాంగ్రెసు సంఘమును నిర్ణయించుట సహజము. ఆ నిర్ణయమున కనురూపముగను గాంధిమహాత్ముడును ఆగస్టు ౧౫ వ తేదీని లండనునగరమునకు బోయి స్వరాజ్యసంపాదనమును జేయుటకు భగవంతు డనుగ్రహించుగాత! ఇతరపక్షముల ప్రతినిధులును నేకాభిప్రాయముతో స్వరాజ్యసంపాదనము నందు గాంధిమహాత్మునకు సకలవిధములను దోడ్పడవలసియుందురు. మితవాదపక్షము కాంగ్రెసు లక్ష్యముతో నేకీభవింపకపోయినను కాంగ్రెసుమార్గము నవలంబించుట శుభసూచకముగ నున్నది. హిందువులును, మహమ్మదీయులును సాంఘికలక్ష్యమును విసర్జించి భారతజాతీయలక్ష్యము నవలంబించుట సమంజసము. అకోలాయందు విజయరాఘవాచారిగారి యధ్యక్షతక్రింద గూడనున్న హిందూమహాసభ కాంగ్రెసు లక్ష్యము నవలంబించి ఫెడరలువిధానమును విశాలవంతము చేయుటకు దోడ్పడుట ధర్మము.

* * * *

గాంధి-ఇర్విను ఒడంబడిక

గాంధిమహాత్ముని లండను ప్రయాణము సంధినియమములను పాటించుట యందు గలదని వారి ప్రసంగప్రవర్తనములు విస్పష్టము చేయుచున్నవి. కాంగ్రెసుప్రచారము నందు కాంగ్రెసుప్రచారకులు చూపుచున్న స్వాతంత్ర్యము నిరంకుశాధికారమున కభ్యస్తమైన యధికారవర్గమునకు కోపావేశములను గలుగజేయుట సహజము. సిమ్లాయందు హృదయపరివర్తనము కొంత గలిగినను రాష్ట్రప్రభుత్వములందు పరివర్తనము గలుగనివిధమును నిత్యవ్యవహారములు రుజువుచేయుచున్నవి. ముఖ్యముగను చెన్నరాష్ట్రమునం దీ విషయము విశదమగుచున్నది. కృష్ణా గోదావరీ మండలములందు పన్నులను వృద్ధిచేయుట, లింగరాజుగారి శిక్ష, నిర్బంధశాసనముల ప్రయోగము, పోలీసువారి ప్రవర్తనము, సర్ ఉస్మాన్ సాహేబుగారి ప్రసంగప్రవర్తనములు మొదలగు విషయములన్నియును సీవిషయమునకు మహావ్యాఖ్యానములుగ నున్నవి. కల్లు, సారాయి అంగడులను విదేశవస్త్ర దుకాణములను పికెటింగుచేయుటయందు నిరంకుశాధికారవర్గము చూపుచున్న ప్రతిఘటనము శాంతికి భంగమును గలుగజేయుటకు విషమచిహ్నములుగ నున్నవి. గాంధిమహా

త్మ డనవరతము కాంగ్రెసుప్రచారకుల నీ విషయమై చేయుచున్న హెచ్చరిక సర్వత్ర తెలిసియున్నది. రాష్ట్రాధికారులను నీవిషయమై క్రింది యధికారులను హెచ్చరించవలసిన యవసరము విస్పష్టముగ నున్నది. కాంగ్రెసు ప్రస్తుత [illegible] శాసనోల్లంఘనప్రస్థానమును విరమించి నిర్మాణకార్యవిధానమునందు ప్రచారకుల లక్ష్యమును లగ్నముచేయ నిర్ణయించినది. ఆనిర్ణయమునకు తోడ్పడి శాంతిని సంరక్షించుట దేశక్షేమమునకు పరమావసరము. ప్రభుత్వాధికారులు ప్రయోగించెడి నిర్బంధవిధానప్రయోగము శాసనోల్లంఘనప్రస్థానమునకు సాధనము గాకుండుట ప్రభుత్వమునకు ప్రయోజనకరము. బొంబయి, సిమ్లాయందలి అధికారవర్గ మవలంబించెడి సామోపాయమును మద్రాసు ప్రభుత్వమును నవలంబించి గాంధి-ఇర్విను ఒడంబడికను శాంతిరక్షణమును సార్థకముచేయుట పరమధర్మము. బొంబయియందు సమావేశముగానున్న అఖిల భారతకాంగ్రెసు సంఘమును నీధర్మసంరక్షణమునకు బూనుకొనుట ప్రయోజనకరము.

* * *

అఖిలభారత కాంగ్రసు సంఘము

ఆగస్టు ౭వ తేదిని బొంబయి యందు గూడగల అఖిలభారత కాంగ్రెసు నిర్వహింపవలసిన భార మపారముగ నున్నది. జాతీయ పతాక నిర్ణయము, ప్రజల హక్కుల నిర్ణయము, హిందూ మహమ్మదీయ సమస్య నిర్ణయము, అప్పుల నిర్ణయము, అహింసాధర్మ నిర్ణయము మొదలగు నిర్ణయములను జేయవలసి యున్నది. కాంగ్రెసు పూనిన అహింసాసిద్ధాంతమును స్వరాజ్య సంపాదనమునకును, ప్రపంచ శాంతికిని, మానవధర్మస్థాపనమునకును కాంగ్రెసుసంఘ మాత్మగౌరవమును గాపాడుటకు సమర్పించవలసి యున్నది. బొంబయి, బెంగాలు రాష్ట్రములం దవలంబింపబడిన హత్యా మార్గమును నిరసించుట కాంగ్రెసు ధర్మము. ఈవిషయమునందు గాంధిమహాత్ముని ప్రవర్తనము లోకమున పరంజ్యోతివలెను ప్రకాశింపగలదు. నిరంకుశ ప్రభుత్వమును, హింసామార్గమును దండనసాధనమునను గాకను సామసాధనమునను నుపశమింప జేయుట ప్రయోజనకరము. మాలానా షౌకతాలిగారు దేశమునం దంతటను ప్రతిధ్వనింప జేసిన సాంఘికాభిమానమును నుపశమింప జేయుట భారతజాతీయవిజయమునకును, శాంతిస్థాపనమునకును పరమసాధనముగ నున్నది. జాతీయపక్షపు మహమ్మదీయులవలెను హిందువులును, నీపరమధర్మమును గ్రహించుట ప్రయోజనకరము. అధికసంఖ్యాకులైన హిందువులమీదను భారతజాతీయధర్మసంరక్షణమును జేయవలసినభారము గలదు. అఖిల భారతసంఘము కోపావేశములను విసర్జించి ప్రశాంతచిత్తముతోను, విశాలహృదయముతోను సాంఘికసమస్యనునిర్ణయించుటసమంజసము. జాతీయపతాకమును నిర్ణయించుటయందుపసంఘము చూపిన విచక్షణ ప్రశంసనీయము. ప్రాచ్య విజ్ఞానమునకును, వైరాగ్య

త్యాగమునకును లక్ష్యమైన కేసరి - రంగు
వస్త్రము పతాకమునకు వస్త్రముగను, కృషి
లక్ష్యమైన రాటము చిహ్నముగను గ్రహింప
బడుట యుక్తముగ నున్నది. అస్పృశ్యవిషయ
మునను, ప్రజల హక్కుల విషయమునను
మితవాదాతివాదుల వాదప్రతివాదము లేర్ప
డినను కాంగ్రెసుసంఘసమావేశము జయ
ప్రదముగను గాంధిమహాత్ముని నాయకత్వము
క్రిందను నిర్వహింపబడునని విశ్వసింపదగి
యున్నది. కాంగ్రెసుసంఘ సమావేశము
భగవదనుగ్రహమువలననే జయప్రద మగు
గాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra PatrikaPress, No.7, Thambu Chetty St., Madras